పాఠకులకు
ప్రకటనకర్తలకు
ఏజెంట్లకు
శ్రేయోభిలాషులకు
శ్రీ దుర్ముఖినామ సంవత్సర
# ఉగాది
శుభాకాంక్షలు





## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: రాశిఖన్నా
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com


## మార్నింగ్ కాఫీ



"ఇరవై ఏళ్ళప్పటి హనీమూన్‌కీ, అరవై ఏళ్ళప్పటి హనీమూన్‌కీ తేడా ఏమిటో?"
"అప్పుడు నయాగరా! ఇప్పుడు వయాగరా"

●●●

**యువకుడు:** దెబ్బయిపోయాం. నిన్ను నేను ముద్దుపెట్టుకున్నప్పుడు మీ తమ్ముడు చూశాడు. వాడు పదిమంది ముందూ నోరెత్తకుండా ఉండా లంటే ఏం చెయ్యాలి.

**యువతి:** ఎప్పుడూ ఉన్నదే! ఓ వందిస్తే చాలు, వాడు నోరెత్తడు.

●●●

తన ప్రేమ సక్సెస్ అవుతుందా? అవ్వదా? అన్నది తెలుసుకునేందుకు ఓ హస్తసాముద్రికుణ్ణి కలిసింది ఓ యువతి. ఆమె చేతిని పట్టిపట్టి చూసి అడిగాడిలా సాముద్రికుడు.

"లావుగా ఉండి, ఉంగరాల జుత్తుగల ఓ వ్యక్తి ప్రేమలో నువ్వు పడ్డావు, అవునా?"

"అవున్సార్" అందామె. ఆశ్చర్యపోయింది.

"చేతిలో గీతల్ని చూసి ఇంత పర్‌ఫెక్ట్‌గా ఎలా చెప్పగలిగారు సార్?" అడిగింది.

చెప్పగలను అన్నట్టుగా నవ్వుతూ తలతాటించి, అన్నాడిలా.

"ఆ వ్యక్తి పేరు గూండా రమేష్, అవునా?"

"అవున్సార్! నో డౌట్, మీరు జీనియస్."

"జీనియస్సా పాడా! నీ చేతికి ఉన్న ఉంగరం నాదే! నన్ను కొట్టి మొన్న లాక్కుపోయాడు ఆ వెధవ." అన్నాడు సాముద్రికుడు.

●●●

"నాన్నా! కాకి అరిస్తే బంధువులు వస్తారా?"

"అవున్రా"

"మరి వచ్చిన బంధువులు పోవాలంటే?"

"మీ అమ్మ అరవాలి"

●●●

"డాక్టర్‌గారూ! నిద్ర సరిగా పట్టడంలేదు. మంచి మందుంటే ఇవ్వండి."

"దీనికి మందులకన్నా మంచి వాతావరణం ముఖ్యంవండీ! మెత్తని పరుపుండాలి. చక్కని సంగీతం ఉండాలి. నీలిరంగు బెడ్‌లైట్ ఉండాలి. మనకి ఇష్టమైన, కంటికి ఇంపైన చిత్రాలు గోడకి ఉండాలి. ఇవన్నీ ఉన్న గదిలో మీరుంటే పిలవకుం డానే నిద్ర వస్తుంది."

"నిజమేకాని, ఇవన్నీ ఆఫీసులో కష్టం కదండీ?"

-వైనతేయ

www.navyaweekly.com

# నవ్య

సంపుటి: 13 సంచిక: 6

13-4-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజి

# భయం

ఏం కరువు వచ్చి పడిందోగాని తాగడానికి ఇన్ని నీటిచుక్కలు లేవు. ఇంత పచ్చగడ్డి లేదు. ఊరిలో ఉండి లాభం లేదు. అడవులు పట్టిపోవడమే మంచిదనుకున్నది ఓ పిల్లదున్న. దానిపేరు లాలకం. తండ్రి అడవిలోనే ఉంటున్నాడు. ఎప్పటి నుంచో రమ్మంటున్నాడు. అయినా వెళ్ళలేదది. అమ్మ చాటునా, ఊరిమాటునా ఉండిపోయింది. ఇప్పుడిక తప్పదనుకుంది. అడవికి బయల్దేరింది. ఊరికి ఉత్తరాన ఉంది అడవి. ఆ దిశగా ప్రయాణించింది. పగలంతా నడిచి నడిచి సాయంత్రానికి అడవికి చేరుకుంది. వచ్చీరాని కొమ్ములూ, చచ్చీ చెడిన దాని నడకా చూసి నవ్వుకున్నాయి అడవి జంతువులు. నవ్వుకుంటే నవ్వుకున్నారు, నాకేంటి? అన్నట్టుగా ఎవరినీ పట్టించుకోకుండా అక్కడక్కడా కనిపిస్తున్న పచ్చికను చూసి ముచ్చటపడింది లాలకం. తింటూ ముందుకు నడిచింది. కాసేపటికి తండ్రీ, బంధువులూ కనిపించారు. సంతోషపడింది.

చీకటి పడే వరకూ అందరితో పాటుగా అటూ ఇటూ తిరిగి, ఆఖరికి ఓ చోటుకి చేరుకుంది లాలకం. తండ్రి పక్కగా నడుం వాల్చింది. ఊరిలోనైతే ఎవరినీ పట్టించుకోవద్దనేది తల్లి. ఎవరితోనూ గొడవ పడవద్దనేది. అలాగే మసలిందక్కడ. ఇది అడవి. ఇక్కడ ఎలా మసలాలో ఎవరికి భయపడాలో తెలుసుకోవాలనుకున్నది లాలకం. తండ్రిని అదే అడిగింది.

"ఇక్కడ ఎవరికైనా భయపడాలా?"

"భయపడాలి! సింహాలకి భయపడాలి." అన్నాడు తండ్రి.

"విన్నాను! అమ్మ చెప్పింది. సరే! సింహం కనిపిస్తే తప్పించుకుంటాను. పరిగెత్తి పారిపోతాను." అన్నది లాలకం.

"అదే తప్పు! ఎప్పుడూ అలా చెయ్యకు." అన్నాడు తండ్రి.

"చెయ్యకపోతే ఎలా? చచ్చిపోనూ? చంపేయదూ?" అడిగింది లాలకం.

కొడుకు అమాయకత్వానికి పగలబడి నవ్వాడు తండ్రి. చెప్పాడిలా.

"నువ్వు పరిగెడితే సింహం నిన్ను వెంటాడుతుంది. నిన్ను వేటాడుతుంది. వెనుక ఏం జరుగుతున్నదో నీకు తెలియదు. తెలియక ముందుకే పరుగుదీస్తుంటావు. అదే అవకాశంగా సింహం నీ వెనుక దాడి చేసి, నిన్ను దిగలాగుతుంది."



"అవునా? మరప్పుడు ఏం చెయ్యను?" అడిగింది లాలకం. భయపడ్డదేమో! తండ్రికి దగ్గరగా జరిగింది.

"సింహం కనిపించింది. నువ్వు దాన్ని చూశావు. అది కూడా నిన్ను చూసింది. నువ్వు భయపడకూడదు. భయపడకూడదు సరికదా, నువ్వు దాన్ని చూసి భయపడట్లేదన్నది దానికి తెలిసేలా గట్టిగా నిలబడాలి. నువ్వు అలా నిలబడినా అది ఖాతరు చెయ్యకపోతే అప్పుడు నువ్వేం చెయ్యాలో తెలుసా?" అడిగాడు తండ్రి.

"ఏం చెయ్యాలి?"

"ఏం చెయ్యాలి అంటే...మొనదేలిన, గట్టిగా ఉన్న నీ కొమ్ముల్ని దానికి చూపించాలి. బలంగా ఉన్న కాలిగిట్టలతో భూమిని తవ్వుతూ బెదిరించాలి."

"బెదరకపోతే?"

"బెదరకపోతే అడుగులో అడుగు వేసుకుంటూ మెల్లగా దాని ముందుకు వెళ్ళాలి. అయినా అది నిన్ను తేలిగ్గా చూస్తే కొమ్ములు విసిరి కుమ్మేయాలి. కాళ్ళతో తన్నేయాలి. ముట్టెతో మట్టుబెట్టాలి. ఎలాగైనా సరే, దాని రక్తం కళ్ళ చూడాలి."

"అదెలా సాధ్యం? సింహంతో పిల్లదున్న పోట్లాటా? జరిగేదేనా? ఒంటరిపోరాటం నా వల్ల కాదు." అంది లాలకం.

నవ్వాడు తండ్రి.

"ఒక్కసారి చుట్టూ చూడు." చెప్పాడు. చూసింది లాలకం. సాటి జంతువులన్నీ వీరాధివీరుల్లా, యోధానుయోధుల్లా ఉన్నాయి. పెద్ద పెద్ద కొమ్ములూ, గట్టి కండలూ, కాళ్ళూ...సింహాలకే సింహాల్లా కనిపించాయి. ఊపిరి పీల్చుకుంది లాలకం.

"నువ్వు ఒంటరి కాదు. నీది ఒంటరిపోరాటం కాదు. వీళ్ళంతా నీ వాళ్ళు. నీ వెనకే ఉన్నారనుకో! అప్పుడు...?" అడిగాడు తండ్రి.

సమాధానంగా ధైర్యంగా నవ్వింది లాలకం.

•••

జనారణ్యంలో ఆశల రూపంలోనూ, నిరాశల రూపంలోనూ, సమస్యల రూపంలోనూ, సందేహాల రూపంలోనూ అనేక సింహాలు మనకీ తారసపడతాయి. బెదిరించి, భయపెట్టి మనల్నీ పరుగుదీయిస్తాయి. పరిగెత్తామో! అంతే సంగతులు. ప్రాణాలు లాగేస్తాయి. అందుకే దేనికీ భయపడకండి! ఉగాదిపండగ పూట ధైర్యాన్ని కూడగట్టుకోండి!!

నవ్య



## మానవతా దృక్పథం

వచ్చే వరకు ఎదురుచూపులు, వచ్చాక చూస్తే నిల బడేందుకే చోటు దొరకదు. నిత్యం సిటీబస్సుల్లో ప్రయాణించేవారి అవస్థ ఇది. వృద్ధులకు, వికలాంగులకు, స్త్రీలకు ప్రత్యేక సీట్లు ఉంటాయి. కానీ అడిగితే గానీ సీటు ఇచ్చే పరిస్థితి ఉండదు. అడిగినా వాదోపవాదాలు, ఘర్షణలు. ఎందుకొచ్చిన గొడవ అని నిలబడి వేలాడేవారూ ఎక్కువే! సెబాస్టిన్‌కు అలాంటి పరిస్థితే ఎదురైంది. తన అనుభవంలోకి వచ్చిన సంఘటనను సోషల్‌మీడియాలో పోస్ట్ చేస్తూ అందరూ ఆలోచించాలని గుర్తు చేస్తున్నాడు.

బెంగళూరులో ఆర్‌ఎంజడ్ ఎకోస్పేస్ ఉద్యోగి సెబాస్టిన్ ఫెర్నాండెజ్. ప్రతిరోజు సిటీబస్సులోనే అతడి ప్రయాణం. ఆఫీసు రాత్రి తొమ్మిది, తొమ్మిదిన్నరకి అయిపోతుంది. తిన్నగా బస్‌స్టాప్‌కి వచ్చి సిటీబస్సు పట్టుకుని వేలాడుతూ, ఊగుతూ వెళ్లాల్సిందే! ఒకరోజు ఆఫీసు అయిపోగానే, డైరెక్టు బస్సు దొరికింది. లక్కీగా సీటు కూడా దొరికింది. చాలామంది ఎక్కుతున్నారు దిగుతున్నారు. ఒక స్టాపులో బస్సు ఎక్కుతున్న ప్రయాణికుడి మీద సెబాస్టియన్ దృష్టి పడింది. అతడికి రెండు చేతులూ లేవు. బస్సులో కూర్చోవడానికి ఖాళీ లేదు. నిలబడే ఉన్నాడు. డ్రైవర్ బ్రేకులు వేసినప్పుడల్లా బ్యాలెన్స్ చేసుకోవడానికి అతడు పడిన అవస్థ అంతాఇంతా కాదు. రెండు మూడు సార్లు తూలిపడిపోయాడు. ఇక చూస్తూ ఊరుకోలేకపోయాడు సెబాస్టిన్. లేచి వెళ్లి ముందు సీటులో కూర్చున్న యువకుడికి ఆ వికలాంగుడి పరిస్థితి చూపించి సీటు ఇవ్వమని అభ్యర్థించాడు. అతడు లేచి సీటు ఇచ్చాడు. కానీ చేతులు లేని ఆ వికలాంగుడు సీట్లో కూర్చోడానికి నిరాకరించి, తన ముందు నిలబడివున్న ఓ వృద్ధుడికి ఆ సీటు ఇచ్చాడు. ఇదంతా చూసి ఆశ్చర్యపోయాడు సెబాస్టిన్. తన పరిస్థితికి ఏమాత్రం బాధపడకుండా, శారీరకంగా బలహీనపడిపోయి తన కన్నా దీనావస్థలో ఉన్న ఓ వృద్ధుడికి సీటు ఇచ్చాడతడు. పరిస్థితులను అవగాహన చేసుకునే విధానం, ఆలోచనా పద్ధతి వంటి వాటిపైనే మనుషుల్లో మానవ తత్వం ఆధారపడి ఉంటుందని ఈ సంఘటన నిరూపిస్తుంది. అతడికి హ్యాట్సాఫ్ చెప్పాల్సిందే అంటూ సెబాస్టిన్ ఈ సంఘటనను సోషల్‌మీడియాలో పోస్ట్ చేశాడు. ఈ సంఘటన మరికొంతమందికి ఆదర్శం కాగలిగితే చాలు అంటున్నాడు సెబాస్టిన్.



# మెయిల్ బాక్స్

### శృంగారాన్ని సమపాళ్ళలో వడ్డించిన కథ

శ్రద్ధాదాస్ ముఖచిత్రంతో వెలువడిన నవ్య వీక్లీ ఆకర్షణీయంగా ఉంది. తెలిసిందిలే శృంగార కథలో సమపాళ్ళలో శృంగారం వడ్డిస్తూనే భార్యాభర్తలు మొదటిరోజుల్లో అపోహలకు లోను కావడం వంటి అంశాన్ని చొప్పించి కథను అర్థవంతం చేశారు. మొదటిరోజు భార్య కాస్త అతి చొరవ లేదా నిరుత్సాహం చూపించినా అర్థం చేసుకునే భర్త వుంటే తప్ప ఇబ్బందులు తప్పవు. ఇలాంటి సందర్భాల్లో భార్య నరకం చూడాల్సి వస్తుంది. భర్త అనుమానస్తుడయితే ఆ సంసారం నరక ప్రాయమే. ఈ అంశాన్ని కథలో చేర్చి నవతరానికి చక్కని సందేశమిచ్చారు. అక్క కథ కన్నీళ్ళు పెట్టించింది. మా అక్క గుర్తుకువచ్చి బాధ అనిపించింది. సరసి, జయదేవ్, బాబు, బాచి మౌంట్ క్రిస్టో కార్టూన్లు బాగుంటున్నాయి.

*-డాక్టర్ కె.ఎల్.వి.ప్రసాద్, హన్మకొండ-4*

### ఆలోచింపజేస్తున్న మార్నింగ్ కాఫీ

మార్నింగ్ కాఫీ బిట్లు మనసారా నవ్వించి ఆలోచింపజేస్తున్నాయి. మాళవికా నాయర్.దిశా పటానీ ఇంటర్వ్యూ విశేషాలు అలరించాయి. మొదటిపేజీలో దీక్షితులుగారి ప్రవచన విశ్లేషణ స్పందింపజేసింది. అరణి రామాయణంలో బ్రహ్మాస్త్రానికి బందీ అయిన హనుమ రావణునితో చేసిన సంభాషణ ఆసక్తిదాయకం. నటి లత ఇంటర్వ్యూ, ఎమ్మెస్ జీవిత చరిత్ర బాగున్నాయి. పెళ్ళి విషయంలో ఊరువాళ్ళు అడిగిన ప్రశ్నలకు నీకేంటి ప్రాబ్లెమ్...అంటూ ఎదిరించి నిలిచిన ఎమ్మెస్ గుండెధైర్యం తెలిసింది. సురభి వింతల్లో సూపర్ డాగ్ హైలైట్. విజయవిలాసం శీర్షిక ఆలోచింపజేస్తోంది. కవితా దినోత్సవంనాటి కవితలు ఆదర్శవంతంగా ఉన్నాయి.

*-మాధవరపు కృష్ణ, కాకినాడ*

### అద్భుత రామాయణం

అరణి రామాయణం అద్భుతం. హనుమంతుని సంభాషణలు, ఆలోచనలు కళ్ళకు కట్టినట్టు రాస్తున్నారు. రావణకుమారుని వధ, వేలాది రాక్షసుల సంహారం, రావణుడితో హనుమ సంభాషణ, అగ్ని సహకారం, లంకా దహనం వంటి ఎన్నో విషయాలను వారం వారం చక్కగా రాస్తున్నారు. నవ్య వీక్లీలో మేం ఎంతో శ్రద్ధగా వారం వారం చదువుతున్నాం. రచయితకు ధన్యవాదాలు.

*-ప్రేమ్‌కుమార్, మియాపూర్, హైదరాబాద్*

### నవ్వాగడంలేదు

నవ్య వీక్లీలో కంరుగాడి కాశీయాత్ర చదువుతుంటే నవ్వు ఆగడం లేదు. కథలు, ఫీచర్స్ అన్నీ పాఠకుల్ని ఆకర్షిస్తున్నాయి. సరదాగా, ఒక ప్రశ్న, మార్నింగ్ కాఫీ చాలా బాగున్నాయి. ప్రతివారం వచ్చే సీరియల్స్ రసవత్తరంగా ఉంటూ ఆనందం కలిగిస్తున్నాయి.

*-డాక్టర్ టి.బాలముకుంద్‌సింగ్, అమరచింత*

### హోమ్లీ కార్టూన్లు

సురభి వింతలు ఆకట్టుకున్నాయి. జైలు ఫుడ్డు తినేవాళ్ళకి ఖైదీ వేషధారులు సర్వీస్ చేయడం ఓ రకమైన వ్యాపార టెక్నిక్! ముఖ్యంగా నవ్య వీక్లీలో కార్టూన్లు అన్నీ ఎంతో హోమ్లీగా ఉంటున్నాయి. భార్యను మూడుసార్లు పెళ్ళిచేసుకున్న ఎమ్మెస్ కథ హాస్యభరితంగా, వినూత్న అనుభవాలతో సాగుతోంది.

*-పోసి, ఎస్సార్‌నగర్, హైదరాబాద్*

### మృత్యుంజయుడు ఉత్కంఠభరితం

మృత్యుంజయుడు సీరియల్ ఎంతో ఆసక్తిదాయకంగా కొనసాగుతోంది. ప్రతి వారం మేం వదిలిపెట్టకుండా చదువుతున్నాం. వీరదర్మ సంపూర్ణ ఆయుష్షు సంపాదిస్తాడా? లేదా? ఆశ్రమకన్యను పెళ్ళాడతాడా? లేదా? అనే ఉత్కంఠతో ఉన్నాం.

*-పి.ప్రవీణ్, విజయవాడ*

### ప్రతిపేజీ విజ్ఞానదాయకమే

సురభి విచిత్రాలు, సినిమా విశేషాలు వారం వారం అలరిస్తున్నాయి. ప్రతిపేజీ విజ్ఞానదాయకమైనదే. మృత్యుంజయుడు, డేర్‌డెవిల్ సీరియల్స్ చదివింపజేస్తున్నాయి.

*-బంతిబాబు, విశాఖపట్నం*

### రామాయణం అందరూ చదవాలి

హనుమ లంకా దహనం, దాని ముందు జరిగిన యుద్ధ సంఘటనలు ఎంతో బాగా చదివించాయి. రామాయణం ప్రతివారూ చదవాలి. ఒక కథ రూపంలో చక్కటి తెలుగులో రామాయణం రాస్తున్న రచయితకు అభినందనలు.

*-శ్యామల,హైదరాబాద్*

### మధుబాబుకు హేట్సాఫ్

నా ఫేవరేట్ రచయిత మధుబాబు. ఆయన రచనలు చదువుతాం. డేర్‌డెవిల్ సీరియల్ సినిమా పంథాలో సాగుతోంది. ఎడారి వాతావరణంలో జాబిలమ్మకోసం అన్వేషణ, జుబ్బా కొండల్లో నిధి రహస్యం తెలుసుకునేందుకు ప్రయత్నాలు ఉత్కంఠభరితంగా రాస్తున్నారు. హేట్సాఫ్. జోకులు, కార్టూన్లు బాగుంటున్నాయి.

*-కృష్ణకుమార్, తాడిగడప*

### వ్యక్తిత్వ వికాస వ్యాసాలు

విజయవిలాసం శీర్షిక ద్వారా ఎంతో తెలుసుకుంటున్నాం. వ్యక్తిత్వ వికాస వ్యాసాలు ప్రతివారం ఒక్కొక్క అంశంతో మాలో స్ఫూర్తి నింపుతున్నాయి.

*-వర్ధనరావు, ఏలూరు*



# ఉగాది లక్ష్మికి వసంత పుష్పాంజలి

కెంజిగురాకు చేతుల నొకించుక వంచి ప్రపుల్ల మంజరీ
మంజుల మాధవీ మధుర మంగళమూర్తి వసంతలక్ష్మి పు
ష్పాంజలి పట్టు నీకు, కమలాకరముల్ రసరాగపూర్ణ దృ
క్కంజములన్ వెలార్చు నవకౌతుక బాష్ప మరందబిందువుల్

అంటూ ఉగాది సౌభాగ్యలక్ష్మికి పుష్పాంజలి పట్టారు కరుణశ్రీ.

మన సంప్రదాయానికి అద్దం పడుతూ ప్రకృతిని మనముందుకు తెచ్చే పండుగే ఉగాది. మాసానాం మార్గశీర్షాణాం..రుతూనాం కుసుమాకరః అని భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ చెప్పాడు. అంటే మాసాలలో మార్గశిర మాసం, రుతువులలో కెల్లా వసంత రుతువు శ్రేష్ఠమైనది అని. అలాంటి వసంత రుతువులో ఉగాది పండుగ వస్తుంది.

తీరి బంగారు పండెడు తెలుగునేల, తేట నీటితో ప్రవహించు తెలుగు నదులు, తుమ్మెద ఝుంకారాలు, పూల లావణ్యాలు, తెలుగు పడుచుల కులుకుటొయ్యారాలూ, భ్రాతృజన ముద్దు ముచ్చట్లే తెలుగు వాకిళ్ళకు చిరునామాలు. ఆ వాకిట నిలబడి మన్మథనామ సంవత్సరానికి వీడ్కోలిచ్చి మూడు పదుల పడుచువోలె అన్నపూర్ణ కన్నబిడ్డల సీమకు చేరిన దుర్ముఖి నామ సంవత్సరానికి సరికొత్త ఆశలతో ఆహ్వానం పలుకుతున్న వేళ...

ఏప్రిల్ 8వ తేదీ ఉగాది సందర్భంగా ఒక అవలోకనం....

యుగస్య ఆదిః యుగాది అంటారు. ఉత్తర దక్షిణాయన ద్వయ(యుగం) సంయుతమైన సంవత్సరానికి చైత్ర శుద్ధ పాడ్యమే ఆది గనుక ఆ రోజును యుగాది అంటారు. మరపురాని అనుభూతులను అందించిన మన్మథనామ సంవత్సరం కాలచక్రంలో కరిగిపోగా, చైత్రరథమెక్కి నవనవోన్మేషంగా అరుదెంచిన 'దుర్ముఖి' శ్రీకర సంపదలు చేకూర్చు..నన్నది పెద్దల ఆశీర్వాదం. త్రిలింగులు ఉగాది అనీ, కన్నడిగులు యుగాది అనీ, తమిళులు చిత్తిరాయ్ అనీ, కేరళీయులు విషు అనీ పిలిచే ప్రాంతీయ సంస్కృతీ వైభవమిది. శాతవాహనుల కాలం నాటి ఈ సంప్రదాయం పలుచోట్లకు విస్తరించింది. మారిషస్, ఇండోనేసియాలలో కూడా Nyepi పేరిట చేసేదీ ఉగాది ఉత్సవమే!

### ఉగాది పుట్టుపూర్వోత్తరం

శ్రీమహావిష్ణువు మత్స్యావతారంలో సోమకాసురుణ్ణి సంహరించి, వేదాలను రక్షించి బ్రహ్మదేవునికి ఇచ్చింది ఈరోజే. ప్రళయానంతరం బ్రహ్మదేవుడు చైత్రమాస శుక్ల పక్ష ప్రథమదినాన సృష్టి ప్రారంభించాడట. దాదాపు ఐదువేల యేళ్ళ క్రితం అష్టగ్రహకూటమినాడు శ్రీకృష్ణ నిర్యాణం జరిగిందంటారు! ఆ మరునాడే కలియుగ ఆరంభ దినానికి నాందీ వాక్యం పలికిందనీ నారద పురాణ సారాంశం. ఈ ఉగాదినాడే వరాహమిహిరుడు పంచాంగాన్ని అందించాడట! శాలివాహన యుగకర్తగా భాసిల్లిన శాలివాహన చక్రవర్తి పట్టాభిషిక్తుడైనదీ, విక్రమార్క శకం ప్రారంభమైనదీ ఉగాదినాడే. ఈ విధంగా ఉగాది గురించి చారిత్రక, పురాణ వృత్తాంతాలెన్నో పూర్వీకుల నుండీ వినవస్తున్నవే.

### తైలాభ్యంగనం

అఖండ కాల ప్రవాహాన్ని అరవై సంవత్సరాలుగా విభజించడం భారత సంప్రదాయ విశేషం. చాంద్రమానం ప్రకారం ప్రతి సంవత్సరం వచ్చే మొదటి తెలుగు నెల, మొదటి తిథి అంటే చైత్ర శుక్ల పాడ్యమి నాడు తెలుగువారి సంవత్సరం ఆరంభమవుతుంది. ఈ సంవత్సరాదిని ఒక ప్రత్యేక విధానంలో జరుపుకోవాలి. ఒక రోజును మూడేసి గంటల చొప్పున ఎనిమిది యామాలుగా విభజిస్తారు. వీటిల్లోని ప్రథమ యామంలో అంటే ప్రాతఃకాలం బ్రహ్మముహూర్తంలో ఇంటిల్లపాదీ పెద్దవారితో తలకు నువ్వులనూనె పెట్టించుకుని వారి ఆశీర్వాదం పొంది తైలాభ్యంగనం ఆచరించాలి. తలమీద నీళ్ళు కుమ్మరించుకుంటూ, గంగేచ యమునేచైవ గోదావరీ సరస్వతీ/ నర్మదే సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధింకురు అనే శ్లోకం జపించాలి. ఆ నదీ ప్రవాహాల దృశ్యాలను మనసా వాచా సాక్షాత్కరింపజేసుకోవడం వల్ల అంతటి ఫలం లభిస్తుందని పురాణాలు చెబుతున్నాయి.

**ఏప్రిల్ 8 ఉగాది సందర్భంగా...**

తైలాభ్యంగనం వల్ల ఆకలి, దప్పిక, మలిన నిర్మూలనం, లక్ష్మీ ప్రసన్నం జరిగి జేష్ఠాదేవీ స్వరూపమైన దారిద్ర్యం తొలగిపోతుంది.

### కొత్త దుస్తులు

ఉగాదినాడు విధిగా కొత్త దుస్తులు ధరించాలి. అంచులున్న దుస్తులైతే మరీమంచిది.



ఇలాంటి వస్త్రంలోనే సకల దేవతలూ ఆవాసముంటారన్నది పండిత ఉవాచ. నూతన వస్త్ర ధారణతో పుత్రమిత్ర బంధుగణ సమక్షంలో సంతోషంతో గడిపినట్లయితే పరదేవతా అనుగ్రహం, లక్ష్మీకటాక్షం కలుగుతుంది. ఇంటిని మామిడి తోరణాలు, పసుపుపచ్చని బంతి పువ్వుల దండలతో శోభాయమానంగా అలంకరించాలి. దిష్టి పోగొట్టేందుకు కొత్త గుమ్మడికాయ ప్రతిష్ఠించాలి.

## నింబకుసుమ భక్షణం

అబ్దాదౌ నింబకుసుమం శర్కరామ్ల ఘృతైర్యుతమ్
భక్షితం పూర్వయామేతు తద్వర్షే సౌఖ్య దాయకమ్

షడ్రుచుల సమ్మేళనం ఉగాది పచ్చడి. వగరు, తీపి, ఉప్పు, కారం, చేదు, పులుపు ఆరు రుచులూ ఇందులో ఉంటాయి. ఈ పర్వదినాన నింబ కుసుమ భక్షణం ఒక పరమ పవిత్ర కార్యం. దీని వల్ల శాంతి, సౌఖ్యాలతో ఉంటామని శ్లోక భావం.



నింబకుసుమం అంటే వేప పువ్వు. వేపపువ్వును నీటిలో శుభ్రంచేసి కొత్త చింతపండు రసంలో నానబెట్టాలి. ఆ రసానికి మిరియాలపొడి, రసాలం (మామిడికాయ) తురుము, కొత్త బెల్లం, ఉప్పు జోడించాలి. ఈ ప్రసాదాన్ని ఈశ్వరునికి లేదా కులదైవానికి నివేదించి శుచిగా పరగడుపునే (ఖాళీ కడుపు) స్వీకరించాలి. ఈ పచ్చడిలో ఒక్కో రుచి జీవితంలో ఎదురయ్యే ఒక్కో అనుభవానికి సూచకం. శకులపై సాధించిన విజయానికి చిహ్నంగా శాలివాహనులు ఉగాది పచ్చడి తిన్నారు.

కాలక్రమేణా చెరకు ముక్కలు, అరటిపండు ముక్కలు, తేనె, వేయించిన పుట్నాల పప్పు(చనా దాల్) బద్దలు, జీడిపప్పు కూడా అదనంగా జేరుస్తున్నారు.

## వైద్య గుణాలు

శతాయుర్వజ్రదేహం సర్వసంపత్కరాయచ
సర్వారిష్ట వినాశాయ నింబకుసుమ భక్షణం

వసంత రుతువులో వచ్చే వేపపువ్వులో విశేష రోగనిరోధక శక్తి, లోకేలరీ గుణాలుంటాయి. కొత్త బెల్లం ఆకలి పుట్టిస్తుంది. కొత్త చింతపండు కఫ వాతాన్ని నిర్మూలిస్తే, వేప పువ్వు క్రిముల్ని నాశనం చేసి, చర్మరోగాలను దరిజేరనీయదు. కఫ వాతాన్ని నిర్మూలిస్తుంది. మిరియాల పొడి శ్లేష్మ రోగాలను దరిజేరనీయదు. మామిడి లాలా జలాన్ని ఊరించి జీర్ణక్రియకు దోహదం చేస్తుంది. ఉప్పు ఎముకలకు బలం. పోషక విలువలుండే ఈ ఆరు పదార్థాలూ అవయవ వ్యవస్థను పరిశుభ్రం చేస్తాయి. వేపచెట్టు గాలి ఆరోగ్యప్రదం. వేపచిగుర్లు నులిపురుగుల్ని చంపుతాయి. ఈ చెట్టుకల్లు కుష్ఠువ్యాధిని నిర్మూలిస్తుంది. వేప ఆకుల్ని బియ్యం డ్రమ్ములో, పుస్తకంలో వేసుకుంటే పురుగు దరిజేరదు. వేపనూనె బొల్లిని నయంచేస్తుంది. చర్మవ్యాధుల్ని నిర్మూలిస్తుంది.

## ఉగాది వంటకాలు

లేత మామిడికాయలతో మామిడి కాయ పప్పు, మామిడి తురుముతో చేసిన పులిహోర, మామిడి, కొబ్బరి మిశ్రమంతో చేసిన పసందైన పచ్చడి, పులిహోర, బొబ్బట్లు, పాయసం, మామిడి, కొబ్బరి తురుము వేసిన రసం, ముక్కల పులుసు గారెలూ వంటి వంటకాలు ఉగాదికి ప్రత్యేకం. ఈ తొలి పర్వదినాన తెలుగు లోగిళ్ళలో కుటుంబీకులు ఎంతో ఇష్టంగా తినే ఆహారం ఇదే.

## పంచాంగ శ్రవణం

తిథిర్వారంచనక్షత్రం యోగః కరణమేవచ పంచాంగమ్

ఉగాది విధులలో పంచాంగ శ్రవణం ఒకటి. శుభకార్యాలు, పూజలు, పితృదేవతారాధనలకు పంచాంగాన్ని ఉపయోగిస్తాం. తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం అనే అయిదు అంగముల సమన్వితం పంచాంగం. 15 తిథులు, ఏడు వారాలు, అశ్విని మొదలు రేవతి వరకు 27 నక్షత్రములు, విష్కంభం మొదలు వైధృతి వరకు 27 యోగములు, బవ మొదలు కింస్తుఘ్నం వరకు 11 కరణములన్నింటి గురించీ తెలియజేసేదే పంచాంగం.

ఉగాదినాడు ఉత్తరాభిముఖంగా కూర్చుని పంచాంగ శ్రవణం చేస్తే గంగానదిలో స్నానం చేసినంత ఫలం. అందుకే పంచాంగస్యఫలం శృణ్వన్ గంగాస్నానఫలంలభేత్ అన్నారు. లక్ష్మీప్రాప్తికి, విజయసాధనకు చైతన్యం మూలం. చైతన్యం కలిగేది కాలం వల్లనే. గంటలు, రోజులు, వారాలు, పక్షాలు, నెలలు, ఋతువులే కాలానికి ప్రాణం. జీవులు నివశించేది ఈ కాల చక్రంలోనే. అంతం లేని ఈ కాల స్వరూపమే దేవీ స్వరూపం. పంచాంగ శ్రవణం, పంచాంగ పూజ కాలస్వరూప నామార్చనకు ప్రతీక. పంచాంగ పూజ దేవీపూజతో సమానం. పూర్వం దేవాలయాలు, పురోహిత వ్యవస్థే పల్లెకు ఆలంబన. తిథివార నక్షత్రాలు, శుభాశుభాలన్నీ పంచాంగ కర్తలే తెలియజేసేవారు. సంపద, ఆయుస్సు, పాపపరిహారాలు, వ్యాధి నివారణ, కార్యానుకూలత, వర్ష పరిస్థితులు, వర్ష కార్తెలు, ఏరువాక ముహూర్తాలు, సూర్యచంద్రగ్రహణాది ఫలితాలు, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు తెలియజేసే రాశి ఫలాలకోసం ఉగాదినాడు విధిగా పంచాంగ శ్రవణం చేసేవారు. నేటికీ ఇదే ఆనవాయితీ.

## కవిసమ్మేళనం

పంటపొలములకును, పాడి పశువులకును/ జీవనదులకు, పర్వతశ్రేణులకు/ దివ్యక్షేత్రములకు పుణ్య తీర్థములకు/ ఉనికిపట్టు నా తెనుగు తల్లి అన్నారు వేదుల సత్యనారాయణ. తెలుగు పద్యంలోనే ఉగాది ప్రసాద లక్షణం ఉందంటారెందరో సాహితీ పండితులు. పద్యపాదాలే పసగల చెరుకులు, పుల్లమామిడికాయలెల్ల యతులు, వృత్త గాంభీర్యమిచ్చు మిరియమ్ము, ఊపునిచ్చు ప్రాస ఉప్పుయదియె, వ్యాకృతిచందను (వ్యాకరణం)లు వగరు చేదులకు ప్రత్యేకమ్ముదియె మన తెలుగు పద్దెము అన్నారు. అందుకే ఉగాది వేడుకకు, కవిత్వానికి అవినాభావ అనుబంధం.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం-న్యాయేణ మార్గేణ మహీం మహీశాః
గో బ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం - లోకాస్సమస్తాస్సుఖినోభవంతు
కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ!
దేశోయం క్షోభరహితః బ్రాహ్మణాస్సంతు నిర్భయాః
అపుత్రాఃపుత్రిణస్సంతు పుత్రిణస్సంతు పౌత్రిణః
అధనాస్సధనాస్సంతు జీవంతు శరదశ్శతం

ప్రజలందరికీ సుఖం కలగాలి, గోవులు, వేదవేత్తలు, దేవతలు తృప్తిచెంది సమస్త లోకాలను వారు చల్లగా చూడాలి, సకాలంలో వర్షాలు కురుయుగాక! పంటలతో సస్యశ్యామలంగా ఉండుగాక! పాలకులు సుభిక్షంగా పరిపాలన చేయుదురు గాక! సంతానంలేని వారికి సంతానం కలుగుగాక! సంపదలు లేనివారికి సంపదలు కలిగి దేశం శాంతిమంతమై ఉండుగాక! ఏ ఒక్కరూ దుఃఖాన్ని పొందక శతాయుష్కులై వర్ధిల్లుదురుగాక! అంటూ ఈ సంవత్సరాదిన మనం కోరుకుందాం!

**-లలితా త్రిపురసుందరి**








తీపి చేదు కలిసిందే జీవితం
కష్టం, సుఖం తెలిసిందే జీవితం
ఆ జీవితంలో ఆనందోత్సాహాలని
పూయించేందుకు వస్తుంది...
ఉగాది పర్వదినం



**శ్రీ దుర్ముఖి నామ సంవత్సర**
**ఉగాది శుభాకాంక్షలు**

**Ameerpet:** Ph: 040 - 4456 9999 | **Kukatpally:** Ph: 040 - 4456 8888



# శ్రీ దుర్ముఖి నామ సంవత్సర రాశి ఫలాలు

(పుట్టిన నక్షత్రం ఆధారంగా)

## మేషం

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పాదం)**



*ఆదాయం: 2* *రాజపూజ్యం: 1*
*వ్యయం: 8* *అవమానం: 7*

దుర్ముఖి నామ సంవత్సరంలో మేష రాశి వారికి ఆర్థిక విషయాలు, వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. ఉన్నత చదువుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రేమానుబంధాలు బలపడతాయి. ఆర్థిక విషయాల్లో పురోగతి సాధిస్తారు. ఉద్యోగ ప్రాప్తికి, ప్రమోషన్లకు, వ్యాపార విస్తరణకు అవకాశం ఉంది. ఏప్రిల్, మే మాసాల్లో ప్రేమ వ్యవహారాలు బెడిసికొట్టే ప్రమాదం ఉంది. వృత్తి వ్యాపారాల్లో ఒత్తిళ్ల అధికం. శ్రమకు తగిన ఫలితం అందకపోవడంతో నిరుత్సాహపడతారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. డ్రైవింగ్‌లో నిదానం అవసరం. స్థిరాస్తులు పెంపొందించుకుంటారు.

5-6 స్థానాల్లో గురుసంచారం కారణంగా ఈ ఏడాది సంతానం విషయంలో శుభపరిణామాలు సంభవం. స్నేహ సంబంధాలు పెంపొందుతాయి. ఇంటి కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. విద్య, వైజ్ఞానిక రంగాలలో విశేష ప్రోత్సాహం లభిస్తుంది. విద్యార్థులు, నైపుణ్యానికి తగిన సదవకాశాలు లభిస్తాయి. పిల్లల విద్య, వృత్తి, వివాహం విషయాలలో అభివృద్ధి కనిపిస్తుంది. గురువు వక్రగమనంలో ఉన్న ఉగాది నుంచి రెండు మాసాల పాటు గురువు వక్రించి నందున పెట్టుబడుల్లో నిదానం అవసరం. విద్యార్థులు లక్ష్య సాధనకు పట్టుదలతో కృషి చేయాల్సి ఉంటుంది.

విదేశీ గమనానికి ఆటంకాలు ఎదురవుతాయి. పొదుపుపథకాల్లో నష్టం సంభవం. ఆగస్టు 12 నుంచి గురువు కన్యారాశిలో సంచరిస్తాడు. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. వృత్తి, వ్యాపారాల్లో వికాసం కనిపిస్తుంది. అయితే అదనపు బాధ్యతలు మోయాల్సి వస్తుంది. అనారోగ్యం, పనుల్లో ఆలస్యం, ఆర్థిక ఇబ్బందులు, అనవసర వ్యయం ఉంటాయి. అపనిందలు మోయాల్సి వస్తుంది.

దుర్ముఖి నామ సంవత్సరంలో 2016 జనవరి 24 వరకు వృశ్చికంలో, ఆ తరువాత ధనుస్సులో శనిసంచారం జరుగుతుంది. ఫలితంగా స్థిరాస్తులు కొనుగోలు చేస్తారు. అయితే ఆర్థిక విషయాల్లో చిక్కులు ఎదుర్కొంటారు. ఋణబాధలు అధికం. ఆరోగ్యం పట్ల అధిక శ్రద్ధ చూపాల్సిన అవసరం ఉంది. ఎముకలు, కీళ్లకు సంబంధించిన సమస్యలు తలెత్తే అవకాశం ఉంది. మానసిక అశాంతి బాధిస్తుంది. నిధుల విషయంలో మాటపడాల్సి రావచ్చు. బ్యాంకులు, ఆర్థిక సంస్థలు, బీమా, మ్యూచ్యువల్ ఫండ్స్‌లో పనిచేసే వారు ఆశించిన ఫలితాలు రాక ఇబ్బందులు ఎదుర్కొంటారు. ఉమ్మడి నిధుల నిర్వహణలో అపనిందలు ఎదుర్కొంటారు.

బంధుమిత్రుల వ్యవహారాల్లో మాటపడాల్సి వస్తుంది. శని వక్ర గమనంలో ఉన్న 2016 ఏప్రిల్ - ఆగస్టు మాసాల మధ్య దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. ఋణ ప్రయత్నాలు ఫలిస్తాయి. పాతబకాయిలు వసూలవుతాయి. కానుకలు, బహుమతులు అందుకుంటారు.

5-11 స్థానాల్లో రాహుకేతువుల సంచారం కారణంగా ప్రేమవ్యవహారాలు, స్నేహాలు బెడిసికొట్టే ప్రమాదం ఉంది. పెట్టుబడుల్లో జాగ్రత్త వహించాలి. అశ్రద్ధ కారణంగా విద్యార్థులు నష్టపోతారు. ఆర్థిక ఇబ్బందులు అధికంగా ఉంటాయి. కొత్త వ్యాపారాల ప్రారంభానికి ఇది తగిన సమయం కాదు. విదేశీ ప్రయత్నాలు ఫలిస్తాయి. విలాసాలకు వెచ్చిస్తారు.

**శివారాధన వల్ల ఈ ఏడాది సత్ఫలితాలు సాధిస్తారు.**

## వృషభం

**(కృత్తిక 2,3,4; రోహిణి; మృగశిర 1,2 పాదాలు)**

ఈ ఏడాది గురు, శని, రాహుకేతువుల సంచారం ఆధారంగా వృషభరాశి వారు స్థల సేకరణ, గృహనిర్మాణం, రియల్ ఎస్టేట్ రంగాల్లో పురోగతి సాధిస్తారు. విదేశీ గమనం, ఉన్నత విద్యాభ్యాసానికి అనుకూలం. కుటుంబంలో శుభకార్యాలు జరుగుతాయి. సొంత ఇంటి కల నెరవేరుతుంది. వాహనయోగం కలుగుతుంది.



*ఆదాయం: 11* *రాజపూజ్యం: 4*
*వ్యయం: 14* *అవమానం: 7*

ప్రేమానుబంధాలు బలపడతాయి. పెట్టుబడులు లాభిస్తాయి. ఉగాది నుంచి రెండు మాసాల పాటు ఖర్చులు అధికంగా ఉంటాయి. ఆస్తుల క్రయవిక్రయాల్లో చిక్కులు ఎదురవుతాయి. సన్నిహితుల ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది. వైవాహిక జీవితంలో చిక్కులు ఎదురవుతాయి.

ఈ ఏడాది 4, 5 స్థానాల్లో శుభప్రదుడైన గురువు సంచరిస్తున్నాడు. ఫలితంగా విలువైన

వస్తువులు, ఆభరణాలు, స్థిరచరాస్తులు సమకూర్చుకుంటారు, ఇంట్లో వేడుకలు, వివాహాది శుభకార్యాలు జరుగుతాయి. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. స్థల సేకరణ, గృహ నిర్మాణం, గృహప్రవేశానికి అనుకూలం. ఆదాయం పెరుగుతుంది. విద్యార్థులకు శుభప్రదం. పరిచయాలు లాభి స్తాయి. స్పెక్యులేషన్లకు అనుకూలం. విద్య, వైజ్ఞానిక రంగాల వారికి విశేష ప్రోత్సాహం లభిస్తుంది. గురువు వక్రగమనంలో ఉన్న ఏప్రిల్ - మే మాసాల్లో రియల్ ఎస్టేట్, గృహనిర్మాణ రంగాల వారు ఆచి తూచి వ్యవహరించాలి. ఆర్థిక విషయాల్లో ప్రతికూలత కనిపిస్తుంది. కుటుంబ సభ్యుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. న్యాయపరమైన సమస్యలు తలెత్తే అవకాశం ఉంది.

జనవరి 24, 2017 వరకు శని మీ 7వ స్థానంలో ఆ తరువాత 8వ స్థానంలో సంచారం చేస్తాడు. మొదట కొన్ని ఆటంకాలు ఎదురయినా వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. వివాహానంతరం జీవిత భాగస్వామి వల్ల కలిసివస్తుంది. ప్రత్యర్థుల కదలికలపై ఒక కన్నేసి ఉంచండి. వృత్తి, వ్యాపారాల్లో ఆటంకాలు ఎదురవుతాయి. సకాలంలో డబ్బు చేతికి అందక ఇబ్బందిపడతారు. దాంపత్య జీవితంలో ఒడిదుడుకులు ఎదురవుతాయి. శని వక్రించిన ఏప్రిల్ - ఆగస్టు మాసాల మధ్య వరకు ప్రత్యర్థులు సైతం మీకు అనుకూలంగా వ్యవహరిస్తారు. వ్యాపారంలో అభివృద్ధి సాధిస్తారు. బకాయిలు వసూలవుతాయి. దాంపత్యం సంతోషదాయకంగా సాగుతుంది. దూర ప్రయాణాల్లో సమస్యలు తలెత్తే అవకాశం వుంది. ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి.

ఈ ఏడాది 4-10 స్థానాల్లో రాహుకేతువుల సంచారం జరుగుతుంది. ఫలితంగా ఇల్లు, స్థలం క్రయవిక్రయాల్లో జాగ్రత్తలు పాటించాలి. ఆరోగ్యం మందగించే ప్రమాదం ఉంది. వ్యాపారంలో ఆశించిన లాభాలు రాక నిరాశపడతారు. చేపట్టిన ప్రతి పనిలో ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది.

**ఆంజనేయ స్వామి ఆరాధన వల్ల సత్ఫలితాలు సాధిస్తారు.**

## మిథునం

**(మృగశిర 3,4; ఆరుద్ర; పునర్వసు 1,2,3 పాదాలు)**

ఈ ఏడాది మిథునరాశి వారికి జనసంబంధాలు విస్తరిస్తాయి. కాంట్రాక్టులు, ఒప్పందాలు లాభిస్తాయి. ఉన్నత చదువుల కోసం విదేశాలకు వెళ్లేందుకు అనుకూలం. వృత్తిపరంగా స్థానచలనానికి అవకాశం ఉంది. న్యాయ, రాజకీయ, ప్రచురణ, మార్కెటింగ్, రవాణా, కన్సల్టెన్సీ, ఏజెన్సీలు, విద్యారంగంలోని వారికి ప్రోత్సాహకరం. సోదరీ సోదరులు, బంధువుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. సొంత ఇల్లు సమకూర్చుకుంటారు. ఏప్రిల్, మే మాసాల్లో గురువు వక్రించిన కారణంగా



*ఆదాయం: 14* *రాజపూజ్యం: 7*
*వ్యయం: 11* *అవమానం: 7*

విద్యార్థుల్లో అశ్రద్ధ పెరుగుతుంది. వాహనాలు నడిపేటప్పుడు జాగ్రత్త. విద్య, రాజకీయ రంగాలకు చెందిన వారు జాగ్రత్త పాటించాలి.

ఈ ఏడాది గురు గ్రహం ఆగస్టు 10 వరకు సింహంలో ఆ తరువాత కన్యారాశిలో సంచరిస్తుంది. ఫలితంగా దూరప్రయాణాలకు అనుకూలం. బంధుమిత్రులతో సత్సంబంధాలు ఏర్పడతాయి. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. బదిలీలకు అనుకూలం. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. ప్రేమ వ్యవహారాల్లో జాగ్రత్త. స్థిరాస్తులు సమకూర్చుకుంటారు. ఉద్యోగులు పై అధికారుల ప్రశంసలు పొందుతారు. ఉన్నత విద్యాయత్నాలు ఫలిస్తాయి. ఉమ్మడి వ్యాపారాలు ప్రారంభిస్తారు. వారసత్వ వ్యవహారాలు పరిష్కారం అవుతాయి. ఉగాది నుంచి రెండు మాసాల పాటు వృత్తి, వ్యాపారాల్లో కొంత నిరుత్సాహకరంగా ఉంటుంది. ఉద్యోగ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. కుటుంబ విషయాల్లో చిక్కులు ఎదురవుతాయి.

ఈ ఏడాది 6, 7 స్థానాల్లో శని సంచారం కారణంగా వృత్తి, వ్యాపారాల్లో అదనపు బాధ్యతలు మోయాల్సి వస్తుంది. పని ఒత్తిడి అధికం. పై అధికారుల నుంచి ఒత్తిడి అధికంగా ఉంటుంది. శక్తికి మించి కష్టపడతారు. కష్టానికి తగిన గుర్తింపు పొందుతారు. రుణాలు ఇచ్చిపుచ్చుకోవడంలో జాగ్రత్త అవసరం. ఉదరసంబంధమైన సమస్యలు ఎదురయ్యే అవకాశం ఉంది. భారీ వ్యాపారాలు వాయిదా వేయండి. శ్రీవారు, శ్రీమతి విషయంలో ఏదో వెలితి బాధిస్తుంది. శని వక్రగమనంలో ఉన్న ఏప్రిల్ - ఆగస్టు మాసాల మధ్య వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. ఆరోగ్యం మెరుగుపడుతుంది. పరిశ్రమలు, వ్యవసాయ రంగాల వారికి శుభప్రదం. పట్టుదలతో కృషి చేసి లక్ష్యాలు సాధిస్తారు. వైద్యం, కేటరింగ్, రిటైల్, హోటల్ రంగాల వారికి శుభప్రదం.

3-9 స్థానాల్లో రాహుకేతువుల సంచారం వల్ల అన్నదమ్ముల మధ్య అపోహలు పెరుగుతాయి. విద్యార్థులకు చదువుల్లో ఆటంకాలు ఎదురవుతాయి. ఆర్థిక విషయాల్లో నష్టం సంభవం. అనుకోకుండా దూరప్రాంతాలకు బదిలీ అవుతారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. పై అధికారుల నుంచి ఒత్తిడి ఎదుర్కొంటారు. ఉన్నత విద్య, విదేశీయానాలకు ఆటంకాలు ఎదురవుతాయి. ప్రయాణాల్లో జాగ్రత్త. పెట్టుబడుల్లో తొందరతగదు. ఆర్థిక పరిస్థితి నెమ్మదిగా పుంజుకుంటుంది.

**దుర్గాదేవి ఆరాధనతో శుభఫలితాలు సాధిస్తారు.**

## కర్కాటకం

**(పునర్వసు 4; పుష్యమి, ఆశ్లేష)**

గురు, శని, రాహుకేతువులు సంచారం ఆధారంగా కర్కాటక రాశి వారికి దుర్ముఖినామ సంవత్సరంలో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. వృత్తి, వ్యాపారాల్లో అభివృద్ధి కనిపిస్తుంది. ప్రమోషన్‌పై వేరే ప్రాంతాలకు బదిలీ అవుతారు. ప్రముఖులతో సాన్నిహిత్యం ఏర్పడుతుంది. కొత్త పరిచయాలు ఏర్పడతాయి. సంకల్పం నెరవేరుతుంది.

విద్యార్థులు పట్టుదలతో కృషి చేసి సత్ఫలితాలు సాధిస్తారు. సోదరీ సోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఏప్రిల్ - మే మాసాల మధ్య తొందరపాటు నిర్ణయాల వల్ల ఆర్థిక విషయాల్లో నష్టపోయే అవకాశం ఉంది.

2-3 స్థానాల్లో గురుగ్రహ సంచారం కారణంగా ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. స్థిర చరాస్తులు, విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. అనుబంధాలు బలపడతాయి. కుటుంబం విస్తరిస్తుంది. వృత్తి వ్యాపారాలలో లాభాలకు, ఉద్యోగంలో పురోగతికి అవకాశం ఉంది. దానధర్మాలకు, ఆధ్యాత్మిక విషయాలకు ఖర్చు



*ఆదాయం: 8* *రాజపూజ్యం: 3*
*వ్యయం: 11* *అవమానం: 3*

చేస్తారు. ప్రస్తుతం చేస్తున్న వ్యాపారంలో చిన్నపాటి మార్పులు చేయడంవల్ల లాభాలు సాధిస్తారు. నలుగురి సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. విద్యాసంస్థలు, కన్సల్టెన్సీ, ఏజెన్సీల వారికి శుభప్రదం. ఆగస్టు 11 నుంచి సోదరులు, సన్నిహితులతో సదవగాహన ఏర్పడుతుంది. చేపట్టిన పనులు పూర్తవుతాయి.

5, 6 స్థానాల్లో శని సంచారం కారణంగా విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. శ్రద్ధలోపించడం వల్ల లక్ష్య సాధన కష్టం అవుతుంది. ప్రేమ వ్యవహారాల్లో ఆచితూచి వ్యవ హరించాలి. సన్నిహితులు కూడా శత్రువులుగా మారే అవకాశం ఉంది. అపవాదులు ఎదుర్కొంటారు. పనులు పూర్తికాకపోవడం వల్ల చికాకులు అధికం అవుతాయి. విలాసాలకు ఖర్చులు అధికం. జనవరి నుంచి ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. వృత్తి, వ్యాపారాల్లో బాధ్యతలు పెరుగుతాయి.

శని వక్రించిన ఏప్రిల్ - ఆగస్టు మాసాల మధ్య ఉన్నత విద్యా విషయాలకు అనుకూలం. స్నేహబాంధవ్యాలు, ప్రేమ వ్యవహారాలు ఫలిస్తాయి. స్నేహాల వల్ల చదువుల పట్ల కొంత అశ్రద్ధ చూపే అవకాశం ఉంది. స్థిరచరాస్తి విషయాల్లో చికాకులు తలెత్తుతాయి. ప్రేమ వ్యవహారాల్లో చిక్కులు, ఆటంకాలెదురైనా ఓరిమితో అందరినీ ఒప్పించేందుకు యత్నిస్తారు.

2-8 స్థానాల్లో రాహుకేతువుల సంచారం వల్ల ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. డబ్బు ఎవరికైనా ఇస్తే సకాలంలో తిరిగి చేతికి రాదు. బాకీలు సకాలంలో చెల్లించలేక మాటపడాల్సి వస్తుంది. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. ఆస్తి విషయాల్లో చికాకులు ఎదురయ్యే అవకాశం ఉంది. వృత్తి పరమైన ఒత్తిళ్ల అధికం. వ్యాపారం మందకొండిగా సాగుతుంది. పెట్టుబడుల విషయంలో జాగ్రత్త. స్పెక్యులేషన్లకు దూరంగా ఉండాలి.

**దత్తాత్రేయ స్వామి ఆరాధన వల్ల కష్టాలు తొలగి, శుభఫలితాలు సాధిస్తారు.**

## సింహం

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పాదం)**

సింహరాశి వారు ఈ ఏడాది ఆర్థికంగా పురోగతి సాధిస్తారు. వ్యక్తిగత ప్రతిష్ఠ పెరుగుతుంది. వ్యాపారాన్ని విస్తరిస్తారు. ప్రమోషన్లు, బదిలీలకు అవకాశం ఉంది. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. అనారోగ్యంతో ఉన్న వారి ఆరోగ్యం మెరుగుపడుతుంది. సంకల్పం నెరవేరుతుంది. పెద్దల పరిచయాలు లాభిస్తాయి. సృజనాత్మక ప్రతిభతో వినూత్నమైన ప్రాజెక్టులు చేపడతారు. గృహ నిర్మాణం, స్థలసేకరణకు అనుకూలం. వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉన్నత విద్యా ప్రయత్నాలు ఫలిస్తాయి. వైద్య, రాజకీయ సినీ రంగాల వారికి ప్రోత్సాహకరం. గురువు వక్రించిన ఏప్రిల్, మే మాసాల్లో అశాంతికి లోనవుతారు. అలర్జీలు బాధిస్తాయి.



*ఆదాయం: 11* *రాజపూజ్యం: 6*
*వ్యయం: 5* *అవమానం: 3*

గురువు 2016 ఆగస్టు 10 వరకు మీ జన్మ రాశిలోనూ ఆ తరువాత కన్యా రాశిలోనూ సంచరిస్తున్నది. ఫలితంగా గౌరవ ప్రతిష్ఠలు పెరుగుతాయి. ఆత్మ విశ్వాసంతో అనుకున్న పనులు పూర్తి చేయగలుగుతారు. ఆరోగ్యంగా, ఉత్సాహంగా ఉంటారు. మీ మాట చెల్లుబాటు అవుతుంది. చక్కని ఆలోచనలు స్ఫురిస్తాయి. నూతన పథకాలకు కార్యరూపం ఇవ్వగలుగుతారు. సంతతి విషయంలో శుభపరిణామాలు సంభవం. విద్య, వైజ్ఞానిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, రాజకీయ రంగాల వారికి పురోగతి కనిపిస్తుంది. కుటుంబం విస్తరిస్తుంది. వృత్తి వ్యాపారాలలో లాభాలకు, ఉద్యోగంలో ప్రమోషన్‌కు అవకాశం ఉంది. ఏప్రిల్, మే మాసాల్లో స్నేహబాంధవ్యాల్లో విభేదాలు తలెత్తుతాయి. ప్రేమలు బెడిసికొట్టే అవకాశం ఉంది. విద్యార్థులు లక్ష్యసాధనకు అధికంగా శ్రద్ధ చూపాలి.

శని 4,5 స్థానాల్లో సంచారం ఫలితంగా రియల్ ఎస్టేట్, గృహనిర్మాణ రంగాల వారికి శుభప్రదం. సొంత ఇంటి కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆస్తి సమస్యలు పరిష్కారమవుతాయి. సంకల్పం నెరవేరుతుంది. బదిలీ ప్రయత్నాలు ఫలిస్తాయి. కుటుంబంలో ఆహ్లాదకర వాతావరణం నెలకొంటుంది. 2017 జనవరి నుంచి విదార్థులు శ్రద్ధాలోపం కారణంగా నష్టపోతారు. శని వక్రగమనంలో ఉన్న మార్చి - ఆగస్టు మాసాల మధ్య పెద్దలు అనారోగ్యం పాలవుతారు. కుటుంబంలో కలతలు ఎదురవుతాయి. భూ క్రయవిక్రయాల్లో అన్ని విషయాలూ సరిచూసుకుని అగ్రిమెంట్లు కుదుర్చుకోవాలి. వాహనాలు నడిపేవారు జాగ్రత్తగా ఉండాలి. అన్ని పనుల్లో ఆటంకాలు ఎదురవుతాయి. ఇంట్లో, కార్యాలయంలో బాధ్యతలు అధికం అవుతాయి.

1-7 స్థానాల్లో రాహు కేతువుల సంచారం వల్ల అశ్రద్ధ కారణంగా ఆరోగ్యం మందగిస్తుంది. ప్రత్యర్థుల నుంచి చిక్కులు ఎదురవుతాయి. వివాహ ప్రయత్నాలకు ఆటంకాలు ఎదురవుతాయి. ప్రియతములతో ఎడబాటు తప్పకపోవచ్చు. భాగస్వాములతో కలహాలు, మనస్పర్థలు అధికం. స్పెక్యులేషన్లలో ఆచితూచి వ్యవహరించాలి. ఖర్చులు అంచనాలు మించుతాయి. పిల్లల పట్ల శ్రద్ధ చూపించాలి. చిన్నమొత్తాల్లో పెట్టిన పెట్టుబడులపై మంచి ప్రతిఫలాలు వస్తాయి.

శ్రీరామచంద్రుడి ఆరాధన శుభప్రదం.

## కన్య

**(ఉత్తర 2, 3, 4; హస్త; చిత్త 1, 2 పాదాలు)**

కన్యారాశి వారు ఈ ఏడాది ఆస్తులు పెంపొందించుకుంటారు. ఉద్యోగంలో భాగంగా విదేశీ యానం చేస్తారు. వాహనాలు, స్థిరాస్తులు కొనుగోలు చేస్తారు. వృత్తి, వ్యాపారాల్లో అభివృద్ధి కనిపిస్తుంది. విదేశీ గమనం, ఉన్నత విద్యాభ్యాస ప్రయత్నాలు ఫలిస్తాయి. కొత్త పరిచయాలు ఏర్పడతాయి. అయితే ఏప్రిల్, మే మాసాల మధ్య ఉద్యోగ, వ్యాపారాల్లో చిక్కులు ఎదురవుతాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. ప్రేమ వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఆర్థిక విషయాల్లో తొందరపాటు తగదు. విద్యార్థులు పట్టుదలతో కృషి చేస్తేనే సత్ఫలితాలు సాధించగలరు.

ఈ ఏడాది 12-1 స్థానాల్లో గురు సంచారం ఫలితంగా ఆర్థిక విషయాల్లో అనవసర ఖర్చులు



*ఆదాయం: 14* *రాజపూజ్యం: 2*
*వ్యయం: 11* *అవమానం: 6*

అధికం. ఆదాయం పెరిగినా డబ్బు మాత్రం చేతిలో నిలవదు. ఇల్లు, ఉద్యోగంలో మార్పులు, చేర్పులకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో నిదానంగా కానీ పనులు జరుగవు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. ఉగాది నుంచి నెల రోజుల వరకు పొరుగు రాష్ట్రాలు, విదేశీ గమనానికి, విదేశాలలో చదువులకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్థిరాస్తుల మూలంగా ఆదాయం లభిస్తుంది. మీ లక్ష్యసాధనలో గత అనుభవం తోడ్పడుతుంది. పుణ్యకార్యాలు, తీర్థయాత్రలకు ఖర్చు చేస్తారు. గౌరవప్రతిష్ఠలు పెరుగుతాయి. విశ్వాసంతో అనుకున్న పనులు నిరాటంకంగా పూర్తి చేయగలుగుతారు. నూతన పథకాలకు కార్యరూపం ఇవ్వగలుగుతారు. సంతతి విషయంలో శుభపరిణామాలు సంభవం.

ఈ ఏడాది శని 3, 4 స్థానాల్లో సంచరిస్తాడు. ఫలితంగా సోదరీసోదరుల వ్యవహారాలు చికాకు కలిగిస్తాయి. మార్కెటింగ్, రవాణా, ఏజెన్సీలు, స్టేషనరీ, బోధనా రంగాల వారు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. వాహనాలు నడిపేటప్పుడు జాగ్రత్త. కుటుంబపరమైన గొడవలు తలెత్తుతాయి. చదువుల పట్ల శ్రద్ధ లోపిస్తుంది. ఉద్యోగంలో మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. జనవరి తరువాత ఇల్లు మరమ్మత్తు పనులకు

ఖర్చులు అధికం. ఆస్తి వ్యవహారాలు ఒక కొలిక్కి వస్తాయి. ఈ ఏడాది ఆగస్టు వరకు శని వక్రగమనంలో ఉన్నందున విద్యార్థులు పట్టుదలతో కృషి చేసి చదువుల్లో రాణిస్తారు. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి అనుకూల సమాచారం అందుకుంటారు. కుటుంబం, ఆస్తులు, ఆరోగ్య విషయాల్లో కొంత మెరుగైన వాతావరణం కనిపిస్తుంది.

12-6 స్థానాల్లో రాహు కేతువుల సంచారం వల్ల చేపట్టిన ప్రతి పనిలోనూ ఆటంకాలు ఎదురవుతాయి. పట్టుదలతో కృషి చేస్తే సత్ఫలితాలు సాధిస్తారు. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. కొత్త వ్యాపారాలు ప్రారంభించేందుకు తగిన సమయం కాదు. మనశ్శాంతి లోపిస్తుంది. విలాసాలకు ఖర్చుచేస్తారు. ఉదరసంబంధమైన సమస్యలు తలెత్తే అవకాశం ఉంది.

**శ్రీ వేంకటేశ్వర స్వామి ఆరాధన శుభప్రదం.**

## తుల

**(చిత్త 3,4; స్వాతి; విశాఖ 1,2,3 పాదాలు)**

తులా రాశి వారికి ఈ ఏడాది వ్యాపార అభివృద్ధికి అనుకూలం. ఆర్థికంగా పురోగతి సాధి



*ఆదాయం: 11* *రాజపూజ్యం: 5*
*వ్యయం: 14* *అవమానం: 6*

స్తారు. కొత్త వ్యాపారాలు ప్రారంభిస్తారు. అందులో విజయం సాధిస్తారు. ప్రముఖులతో పరిచయాలు లాభిస్తాయి. వృత్తి వ్యాపారాల్లో గణనీయమైన పురోగతి కనిపిస్తుంది. జీవితం ఆనందమయంగా సాగుతుంది. ఉద్యోగంలో స్థిరత్వం సాధిస్తారు. జన సంబంధాలు విస్తరిస్తాయి. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. వినోద, విలాసాలకు సమయం వెచ్చిస్తారు. దంపతుల మధ్య సదవగాహన నెలకొంటుంది. ఏప్రిల్ - మే మాసాల్లో ఆర్థిక వ్యవహారాల్లో నిరుత్సాహకరంగా ఉంటుంది. బృంద కార్యక్రమాల్లో అనవసరమైన ఖర్చులు అధికం. మనశ్శాంతి లోపిస్తుంది. విద్యార్థులకు చదువు పట్ల శ్రద్ధ లోపిస్తుంది.

గురువు ఈ ఏడాది లాభ, వ్యయ స్థానాల్లో సంచరిస్తాడు. ఫలితంగా ఆదాయం పెరుగుతుంది. వృత్తి, వ్యాపారాల్లో పురోగతి సాధిస్తారు. వ్యాపార విస్తరణకు అనుకూలం. పిల్లల విషయంలో అభివృద్ధికి, శుభకార్యాలకు అవకాశం ఉంది. వివాహ యత్నాలు ఫలిస్తాయి. విద్య, వైజ్ఞానిక, ప్రచురణలు, ప్రకటనలు, బోధన, న్యాయ, సినీ, రాజకీయ రంగాలలో ఉన్నవారికి ప్రోత్సాహం లభిస్తుంది. విదేశీ గమనానికి, విదేశాలలో చదువులకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. టెక్స్‌టైల్స్, చలనచిత్రాలు, మత్స్య, రవాణా, టైల్స్, ఫొటోగ్రఫీ రంగాల వారికి ప్రోత్సాహకరం. ఉగాది నుంచి నెల రోజుల కాలంలో పెద్దవారి ఆరోగ్యం మందగిస్తుంది. స్నేహానుబంధాలు బెడిసి కొట్టే అవకాశం ఉంది. ఖర్చులు అంచనాలు మించుతాయి.

దుర్ముఖి నామ సంవత్సరంలో 2, 3 స్థానాల్లో శని సంచారం వల్ల పెట్టుబడుల్లో తొందరపాటు కారణంగా నష్టపోయే ప్రమాదం ఉంది. వేరేవారి ఆర్థిక విషయాల్లో తలదూర్చి చిక్కుల్లో పడతారు. ఆర్థిక విషయాల్లో వివాదాలు తలెత్తుతాయి. సౌకర్యలేమితో ఇబ్బంది పడతారు. రుణబాధలు అధికం అవుతాయి. వాహనాలు నడిపేటప్పుడు జాగ్రత్త. దీర్ఘకాలిక దృష్టితో చేసే పెట్టుబడులు కొంతవరకు లాభిస్తాయి. జనవరి నుంచి విద్యార్థులు శ్రద్ధాలోపం కారణంగా నష్టపోతారు. సోదరీ సోదరుల బాధ్యతలు మోయాల్సి రావచ్చు. ఏప్రిల్ 8 నుంచి ఆగస్టు వరకు సినీ రాజకీయ రంగాల వారికి శుభప్రదం. ఆలస్యాలను, వైఫల్యాలను లెక్కచేయకుండా ప్రయత్నాలు కొనసాగించి లక్ష్యాలు సాధిస్తారు. ఆర్థిక విషయాలు కొంత ఆశాజనకంగా ఉంటాయి. స్థిరచరాస్తులు సమకూర్చుకుంటారు. వారసత్వ విషయాలు లాభిస్తాయి.

11-5 స్థానాల్లో రాహుకేతువుల సంచారం వల్ల విద్యార్థులకు చదువులపై అశ్రద్ధ పెరుగుతుంది. ప్రేమ విషయాల్లో చికాకులు ఎదురవుతాయి. అపోహల కారణంగా సమస్యలు ఎదుర్కొంటారు. రుణబాధలు పెరుగుతాయి. ఆస్తి తగాదాలు, కుటుంబపరమైన ఒత్తిళ్ల కారణంగా మనశ్శాంతి లోపిస్తుంది. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. ఆర్థిక స్థిరత్వం లోపిస్తుంది. విలాసాలు, ప్రయాణాలకు ఖర్చులు అధికం. స్పెక్యులేషన్లకు దూరంగా ఉండండి.

**పార్వతీ దేవి ఆరాధన వల్ల చిక్కులు తొలగి శుభాలు కలుగుతాయి.**

## వృశ్చికం

**(విశాఖ 4, అనూరాధ, జ్యేష్ఠ)**

వృశ్చికరాశిలో పుట్టినవారు ఈ ఏడాది వృత్తి, ఉద్యోగ, వ్యాపారాల్లో అభివృద్ధి సాధిస్తారు. ప్రమోషన్లు, ఉన్నత పదవులకు అవకాశం ఉంది. ఆర్థిక విషయాల్లో పురోగతి సాధిస్తారు. రాజకీయ, ప్రభుత్వ, సహకార రంగాలకు చెందిన వారికి ప్రోత్సాహకరం. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. వైవాహిక జీవితం ఉల్లాసంగా ఉంటుంది. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. శత్రువులు కూడా మిత్రులవుతారు. ఏప్రిల్ - మే మాసాల మధ్య పెద్దల ఆరోగ్యం కలవర పెడుతుంది. బాధ్యతలు అధికం అవుతాయి. రుణబాధలు ఎక్కువ అవుతాయి. స్థలమార్పిడి అవకాశాలు అధికం.

పురోగతినిచ్చే గురువు ఈ ఏడాది 10, 11 స్థానాల్లో సంచరిస్తున్నాడు. కాబట్టి వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలలో పురోగతి కనిపిస్తుంది. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. అదనపు ఆదాయం కోసం చేసే యత్నాలు ఫలిస్తాయి. వ్యాపార రంగంలోని వారికి ఊహించని విధంగా లాభాలు వస్తాయి. అధికారం, హోదా, గౌరవ ప్రతిష్ఠలు పెరుగుతాయి. పలుకుబడిగలవారు, ఉన్నత పద



*ఆదాయం: 2* *రాజపూజ్యం: 1*
*వ్యయం: 8* *అవమానం: 2*

వులలో ఉన్నవారు వృత్తి, ఉద్యోగాలలో సహకరిస్తారు. తల్లిదండ్రుల విషయంలో శుభ పరిణామాలు కనిపిస్తాయి. రాజకీయ రంగంలోని వారికి ఉన్నత పదవులు లభిస్తాయి. లాభ స్థానంలో గురు సంచారం వల్ల ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతుంది. పిల్లల విషయంలో అభివృద్ధికి, శుభకార్యాలకు అవకాశం ఉంది. వివాహ యత్నాలు ఫలిస్తాయి. గురువు వక్రగమనంలో ఉన్న ఏప్రిల్ - మే మాసాల మధ్య బదిలీలు, మార్పులు చేర్పులు అసౌకర్యం కలిగిస్తాయి. వృత్తి వ్యాపారాల్లో చికాకులు అధికం. ఆర్థిక వ్యవహారాల్లో తొందర పాటు నిర్ణయాలు తగవు.

ఈ సంవత్సరం మీ జన్మరాశి వృశ్చికం, రెండవ స్థానమైన ధనుస్సుల్లో శని సంచారం జరుగు తుంది. ఫలితంగా 2017 జనవరి వరకు పోలీసు, రక్షణ రంగాల వారికి ఆటంకాలు, అవరోధాలు ఎదురవుతాయి. కుటుంబ సభ్యులతో ఎడబాటు తప్పకపోవచ్చు. మనశ్శాంతి లోపిస్తుంది. ఆరోగ్యం మందగిస్తుంది. శిరోవేదన, నరాలు, కండరాలకు సంబంధించిన సమస్యలు ఎదుర్కొంటారు. అపనిందలు ఎదుర్కొంటారు. ఉగాది నుంచి ఆగస్టు 3 వరకు శని వక్రించిన కారణంగా క్రమ శిక్షణతో వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ప్రముఖులతో పరిచయాలు ఏర్పడతాయి. పట్టుదలతో చేపట్టిన పనులు పూర్తిచేస్తారు. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి నిదానంగా మంచి ఫలితాలు వస్తాయి.

10-4 స్థానాల్లో రాహుకేతువుల సంచారం



# R V TOURS & TRAVELS

**Summer Special Offers**

12-6-11/4, 3rd Floor, Bhagyanagar Complex, Opp. BJP Office, Metro Pillar No. 15, Kukatpally, Hyd-72.
E-mail: rvtoursntravels@gmail.com, www.rvtoursandtravels.in

**8106666134, 8106201230, 7032666930, 7032666922**



## కాశీ 12 రోజులు 16,500/-

**Package Date**
04.05.16

**దర్శనీయ ప్రదేశాలు**
అలహాబాద్, ప్రయాగ, సీతామడి వింధ్యాచలం, అయోధ్య, గయ, బుద్ధగయ, కాశీ, వ్యాస కాశీ, సారనాథ్



## ఛార్‌ధామ్ 15 రోజులు 23,500/-

**Package Date**
05.05.16 26.05.16
12.05.16 02.06.16
19.05.16 16.06.16

**దర్శనీయ ప్రదేశాలు**
ఢిల్లీ, హరిద్వార్, రిషికేష్, యమునోత్రి, ఉత్తర కాశీ, గంగోత్రి, కేదార్‌నాథ్, బద్రినాథ్



## సిమ్లా - మనాలి 10 రోజులు 19,000/-

**Package Date**
29.04.16
16.05.16

**దర్శనీయ ప్రదేశాలు**
ఢిల్లీ, ఆగ్రా, మాధుర, బృందవన్, కురుక్షేత్ర, చండీఘర్, సిమ్లా, మనాలి, రోతంగ్‌పాస్



## కేరళ 11 రోజులు 18,500/-

**Package Date**
09.05.16

**దర్శనీయ ప్రదేశాలు**
భవాని, గురువాయుర్, కొచ్చి, మున్నార్, అతిరమ్‌పల్లి వాటర్ ఫాల్స్, తేక్కడి, అల్లెప్పి, కోవలం బీచ్, త్రివేండం, కన్యాకుమారి, సుచేంద్రం, మదురై, తిరుపార గుండ్రం, తిరువానమల్లి



## గుజరాత్ 13 రోజులు 19,600/-

**Package Date**
28.04.16
18.06.16

**దర్శనీయ ప్రదేశాలు**
అహ్మదాబాద్, ద్వారకా, బిట్ ద్వారకా, నాగేశ్వరం, మూల ద్వారకా, పోర్‌బందర్, సోమ్‌నాథ్,అంబాలి, మాత్రు గయ, మౌంట్ అబు, నాద్ ద్వారకా, కంక్రోలి ద్వారకా, ఉజ్జయిని, ఓంకారేశ్వర్

## అమర్‌నాధ్ 16 రోజులు 23,500/-

**Package Date**
03.07.16
17.07.16

**దర్శనీయ ప్రదేశాలు**
ఢిల్లీ, అమృత్‌సర్, వాగా బార్డర్, కీర్, భవాని, బాల్టల్, అమర్‌నాథ్, కాట్రా, వైష్ణోదేవి, చాముండదేవి, చింటాపూర్ణిమాదేవి, జ్వాలాముఖి, కన్‌గేడి దేవి, నాని దేవి, కురుక్షేత్ర





## అమర్‌నాధ్ 8 రోజులు 65,000/-

**Package Date**
09.07.16

**దర్శనీయ ప్రదేశాలు**
శ్రీనగర్, కీర్ భవాని, బాల్టల్, అమర్‌నాథ్, వైష్ణోదేవి

Flight: Hyd - Srinagar - Jammu - Hyd
Helicopter: Amarnath and Vaishnodevi Temple



## కర్నాటక 8 రోజులు 14,000/-

**Package Date**
02.06.16

**దర్శనీయ ప్రదేశాలు**
బెంగుళూరు, మైసూరు, శ్రీరంగపట్నం, శ్రావణ బెల్‌గోల, హాలిబేడు, బేలూరు, శృంగేరి, కొల్లూరు, మురుదేశ్వర్, ఉడిపి, హోర్నాడు, కొక్కిసుబ్రమణ్యం, గోకర్ణ, ధర్మశాల





## సింగపూర్

3 రాత్రులు / 4 దినాలు

**29,999/-**
Air Tickets + Visa Extra



## సింగపూర్ - మలేషియా

5 రాత్రులు / 6 దినాలు

**39,999/-**
Air Tickets + Visa Extra



## బ్యాంగ్‌కాక్

3 రాత్రులు / 4 దినాలు

**24,999/-**
Including Air Tickets
Chennai - Chennai

**Note: We offer individual and group packages also***

**Area wise Agencies (Andhra Pradesh & Telangana) Solicited**

**Contact:**
**040 - 40045234, 40074366, 40116555**
**9100011661, 8106201230, 9642381234, 9642481234, 9642781234,**
**7032 666 921/922/ 923/924/925/ 927/928/929/930**

కారణంగా కుటుంబ సభ్యుల ఆరోగ్యం కలవర పెడుతుంది. ముఖ్యంగా తల్లిదండ్రుల ఆరోగ్యం పట్ల దృష్టి సారించాలి. పెట్టుబడుల్లో జాగ్రత్త వహించాలి. పై అధికారులతో మనస్పర్ధల కారణంగా నష్టపోతారు. ప్రభుత్వరంగ సంస్థల్లో పనిచేసే వారు అశాంతికి గురవుతారు. మహిళలు సమస్యలు ఎదుర్కొంటారు.

**ఆంజనేయస్వామి ఆరాధన శుభఫలితాలనిస్తుంది**

## ధనుస్సు

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం)**

ఈ ఏడాది గురు, శని, రాహు, కేతు సంచారం పరిశీలిస్తే ధనుస్సు రాశి వారు వృత్తి వ్యాపారాల్లో అభివృద్ధి సాధిస్తారు. పై చదువులు, విదేశీ గమనానికి అనుకూలం. కొత్త వ్యాపారానికి, పరిశ్రమల ప్రారంభానికి తగిన సమయం. ఉద్యోగంలో మార్పు కోరుకుంటారు. విద్యార్థులు, క్రీడారంగంలోని వారికి శుభప్రదం. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. గురువు వక్రగమనంలో ఉండే ఏప్రిల్, మే మాసాల మధ్య ఆందోళనలు అధికం అవుతాయి. వృత్తిపరమైన ఒత్తిడులకు లోనవుతారు. న్యాయ, ఆరోగ్యపరమైన సమస్యలు తలెత్తుతాయి.



*ఆదాయం: 5* *రాజపూజ్యం: 4*
*వ్యయం: 14* *అవమానం: 2*

9, 10 స్థానాల్లో గురు సంచారం వల్ల ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. వృత్తి, వ్యాపారాల్లో శుభపరిణామాలు సంభవం. ప్రమోషన్లు సాధిస్తారు. వ్యాపార విస్తరణకు తగిన సమయం. న్యాయ, ఆధ్యాత్మిక, బోధన, పత్రికలు, రాజకీయ రంగాలలో ఉన్నవారికి ప్రోత్సాహకరం. సంతాన ప్రాప్తికి అనుకూలం. విద్యావిషయాలు, న్యాయ పోరాటాలలో విజయం సాధిస్తారు. కళ, సాంస్కృతిక, బోధన, ఉన్నత విద్య, విదేశీ వ్యవహార రంగాల వారికి ప్రోత్సాహకరం. ఆదాయం పెంచుకునేందుకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. వృత్తి, వ్యాపారాల్లో పురోగతి కనిపిస్తుంది. రాజకీయ రంగంలోని వారికి ఉన్నత పదవులు లభిస్తాయి.

వాహనాలు కొనుగోలు చేస్తారు. ఉగాది నుంచి నెలరోజుల పాటు గురువు వక్రించిన కారణంగా వృత్తి వ్యాపారాల్లో శ్రమాధిక్యం. బదిలీలు అసౌకర్యం కలిగిస్తాయి. మీ పురోగతి చూసి అసూయపడే వారు పెరుగుతారు. పెట్టుబడుల్లో జాగ్రత్త వహించాలి.

12, 1వ స్థానాల్లో ఈ సంవత్సరం శని సంచారం జరుగుతుంది. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, కళలు, సినిమాలు, వినోదం, పర్యాటక రంగాల వారు ఆశించిన ఫలితాలు అందక నిరుత్సాహపడతారు. పైచదువుల కోసం చేసే ప్రయత్నాలకు అటంకాలు ఎదురవుతాయి. రహస్య కార్యకలాపాల కారణంగా అప్రతిష్ఠకు గురవుతారు. ఆరోగ్యం మందగిస్తుంది. కుటుంబ బాధ్యతలు, వృత్తిపరమైన పనులతో ఒత్తిడికి లోనవుతారు. 2017 జనవరి నుంచి మానసికంగా చికాకుగా ఉంటుంది. ఆటంకాలు, అవరోధాల కారణంగా ఒక అడుగు ముందుకు రెండు అడుగులు వెనక్కు అనే చందంగా ఉంటుంది. ఏప్రిల్ - ఆగస్టు మాసాల మధ్య శని వక్రగమనంలో ఉన్నాడు. ఆ సమయంలో భాగస్వామి సహకారం లభిస్తుంది. చేపట్టిన పనులు ఓరిమి, క్రమశిక్షణతో పూర్తి చేస్తారు.

9-3 స్థానాల్లో రాహుకేతువుల సంచారం కారణంగా ప్రయాణాల్లో జాగ్రత్త అవసరం. పెట్టుబడుల్లో తొందరపాటు తగదు. ఏజెన్సీలు, స్టేషనరీ, ట్రావెల్ రంగాల వారికి ఒత్తిడి అధికం. సన్నిహితుల మధ్య అపోహలు పెరుగుతాయి. విద్యార్థులకు చదువుల్లో ఆటంకాలు ఎదురవుతాయి. మోసపోయే అవకాశం ఉంది. దూర ప్రాంతాలకు బదిలీ అవుతారు. కుటుంబ వ్యవహారాల కారణంగా మనశ్శాంతి లోపిస్తుంది.

**శ్రీ లలితాదేవి ఆరాధన వల్ల శుభం కలుగుతుంది.**

## మకరం

**(ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం; ధనిష్ఠ 1,2 పాదాలు)**

ఈ ఏడాది గురు, శని, రాహు, కేతు సంచారం పరిశీలిస్తే మకరరాశి వారు వృత్తి, వ్యాపారాల్లో అభివృద్ధి సాధిస్తారు. పై చదువులు, విదేశీ గమనానికి అనుకూలం. కొత్త వ్యాపారానికి, పరిశ్రమల ప్రారంభానికి తగిన సమయం. విద్యార్థులు, క్రీడారంగంలోని వారికి శుభప్రదం. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. స్థల మార్పిడికి, ప్రమోషన్లకు అవకాశం ఉంది. రాజకీయ, కళ, సినీ, రవాణా, విద్య, ఐ.టి. రంగాల వారికి ప్రోత్సాహకరం. గురువు వక్రగమనంలో ఉండే ఏప్రిల్ - మే మాసాల మధ్య ఆందోళనలు అధికం అవుతాయి. వృత్తిపరమైన ఒత్తిడులకు లోనవుతారు. న్యాయ, ఆరోగ్యపరమైన సమస్యలు తలెత్తుతాయి.

8-9 స్థానాల్లో గురు సంచారం ఫలితంగా ఈ ఏడాది ఆస్తి వ్యవహారాల్లో చికాకులు ఎదురవుతాయి. కొత్త పెట్టుబడులకు దూరంగా ఉండండి. ఆర్థిక సాయం చేస్తే సమయానికి డబ్బు తిరిగి రాకపోయే ప్రమాదం ఉంది. న్యాయపరమైన సమస్యలు ఆగస్టు తరువాత పరిష్కారం అవుతాయి. ఏప్రిల్ - మే మాసాల మధ్య స్థిరచరాస్తులు సమకూర్చుకోగలుగుతారు. ఆర్థిక సమస్యలు పరిష్కారం అవుతాయి.

వృత్తి ఉద్యోగాలలో శుభ పరిణామాలు సంభవం. న్యాయ, ఆధ్యాత్మిక, బోధన, పత్రికలు, రాజకీయ రంగాలలో ఉన్నవారికి ప్రోత్సాహకరం.



*ఆదాయం: 8* *రాజపూజ్యం: 7*
*వ్యయం: 8* *అవమానం: 2*

ఉద్యోగులు ఆర్థికంగా అభివృద్ధి సాధిస్తారు. ఉన్నత చదువుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆరోగ్యం మెరుగుపడుతుంది. వైద్య రంగంలోని వారికి చక్కటి పురోగతి కనిపిస్తుంది. శత్రువులతో విభేదాలు సమసిపోతాయి.

ఈ ఏడాది 11, 12 స్థానాల్లో శని సంచారం ఫలితంగా ఆర్థికపరమైన చిక్కులు ఎదుర్కొంటారు. బంధు, మిత్రుల కారణంగా అదనపు బాధ్యతలు మోయాల్సి వస్తుంది. స్టాక్‌మార్కెట్ పెట్టుబడుల్లో నష్టం సంభవం. క్రయవిక్రయాల్లో చిక్కులు ఎదురవుతాయి. ఒత్తిడులు కూడా అధికమౌతాయి. ప్రశాంతత లోపిస్తుంది. ఆలస్యాలు, ఆటంకాలు, వైఫల్యాల వల్ల అసంతృప్తికి లోనవుతారు. వాహనాలు నడిపే సమయంలో ఏకాగ్రత అవసరం.

చెడు స్నేహాల వల్ల నష్టపోయే అవకాశం ఉంది. మార్చి-ఆగస్టు మాసాల మధ్య శని వక్రించిన కారణంగా రియల్ ఎస్టేట్ రంగంలోని వారి పరిస్థితి మెరుగుపడుతుంది. స్వయంకృషి, కార్యదీక్ష, ఓరిమి, పట్టుదలతో అవరోధాలు అధిగమించి లక్ష్యాలు సాధిస్తారు. నూనెలు, ఇనుము, భూములు, ఖనిజాల వ్యాపారులకు ప్రోత్సాహకరం.

8-2 స్థానాల్లో రాహుకేతువుల సంచారం కారణంగా ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. పెట్టుబడుల విషయంలో తొందరపాటు తగదు. ఆర్థిక సహాయం చేసే విషయంలో ముందు వెనుకలు ఆలోచించండి. చదువుల్లో అశ్రద్ధ కారణంగా వైఫల్యాలు ఎదురవుతాయి. మంచి మనసుతో పక్క వారికి సాయం చేసి చిక్కుల్లో పడతారు.

**గురు రాఘవేంద్ర స్వామి ఆరాధన వల్ల దైవకృప లభించి, విజయం సాధిస్తారు.**

## కుంభం

**(ధనిష్ఠ 3, 4; శతభిషం; పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు)**

ఈ ఏడాది గురు, శని, రాహు, కేతు సంచారం పరిశీలిస్తే కుంభరాశి వారు వృత్తి



*ఆదాయం: 8* *రాజపూజ్యం: 3*
*వ్యయం: 8* *అవమానం: 5*

వ్యాపారాల్లో అభివృద్ధి సాధిస్తారు. పై చదువులు, విదేశీ గమనానికి అనుకూలం. కొత్త వ్యాపారానికి, పరిశ్రమల ప్రారంభానికి తగిన సమయం. ఉద్యోగంలో మార్పు కోరుకుంటారు. విద్యార్థులు, క్రీడా రంగంలోని వారికి శుభప్రదం. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. రాజకీయ, కళా, సినీ, రవాణా, విద్య, ఐ.టి. రంగాల వారికి ప్రోత్సాహకరం. గురువు వక్రగమనంలో ఉండే ఏప్రిల్ - మే మాసాల మధ్య ఆందోళనలు అధికం అవుతాయి. వృత్తిపరమైన ఒత్తిడులకు లోనవుతారు. న్యాయ, ఆరోగ్యపరమైన సమస్యలు తలెత్తుతాయి.

ఆగస్టు 10 వరకు 7వ స్థానంలో గురు గ్రహ సంచారం ఫలితంగా శ్రీవారు, శ్రీమతి విషయాలలో పురోగతి కనిపిస్తుంది. స్నేహితులు, బంధువులు, అభిమానులు మీ లక్ష్యసాధనలో సహకరిస్తారు. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. వివాహయత్నాలు ఫలిస్తాయి. ప్రత్యర్థులపై విజయం సాధిస్తారు.

ఉమ్మడి వ్యాపారం లాభిస్తుంది. విద్యార్థులకు శుభప్రదం. విదేశీ ప్రయాణాలు చేస్తారు. సంతానం లేని వారికి ఈ ఏడాది శుభప్రదం. ఆస్తులు పెంపొందించుకుంటారు. రాజకీయాలు, ప్రకటనలు, ఏజెన్సీ రంగాల వారికి ప్రోత్సాహకరం. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. ఆగస్టు 11 నుంచి సంవత్సరాంతం వరకు విధి నిర్వహణలో ఒత్తిళ్లు అధికమౌతాయి. భాగస్వామి ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించాలి. శస్త్ర చికిత్స అవసరం కావచ్చు. రుణదాతల ఒత్తిడి పెరుగుతుంది. పూర్వానుభవంతో, యుక్తితో నెమ్మదిగా పనులు పూర్తి చేస్తారు. పెద్దల ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది.

ఈ సంవత్సరం 10, 11 స్థానాల్లో శని సంచారం జరుగుతుంది. ఫలితంగా పెద్దల ఆరోగ్యం పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపించాలి. వృత్తి, వ్యాపారాల్లో ప్రమోషన్లు అందుకుంటారు. బదిలీలకు ఆస్కారం ఉంది.

స్థిరాస్తులు సమకూర్చుకుంటారు. అదనపు బాధ్యతలు చేపట్టాల్సి రావడంవల్ల ఒత్తిడి అధికంగా ఉంటుంది. మీ ప్రతిష్ఠకు భంగం కలిగే పరిణామాలు చోటుచేసుకుంటాయి. జనవరి నుంచి ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఏప్రిల్ - ఆగస్టు మాసాల మధ్య ప్రభుత్వ రంగంలోని వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. సన్నిహితులు, బంధువుల భాగస్వామ్యంతో కొత్త వ్యాపారాలు ప్రారంభిస్తారు. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధించి మంచి పేరు తెచ్చుకుంటారు. గుర్తింపు కోసం చేసే ప్రయత్నాల్లో సత్ఫలితాలు సాధిస్తారు.

7-1 స్థానాల్లో రాహుకేతువుల సంచారం వల్ల భాగస్వాములతో కలహాలు, మనస్పర్థలు అధికం. స్పెక్యులేషన్లలో ఆచితూచి వ్యవహరించాలి. ఖర్చులు అంచనాలు మించుతాయి. అనుబంధాలు, ఆర్థిక విషయాల కారణంగా అశాంతికి లోనవుతారు. అశ్రద్ధ కారణంగా ఆరోగ్యం మందగిస్తుంది. ప్రత్యర్థుల నుంచి చిక్కులు ఎదురవుతాయి. వివాహ ప్రయత్నాలకు ఆటంకాలు ఎదురవుతాయి.

**దుర్గాదేవి ఆరాధన శుభఫలితాలనిస్తుంది.**

## మీనం

**(పూర్వాభాద్ర 4; ఉత్తరాభాద్ర, రేవతి)**

ఈ ఏడాది గురు, శని, రాహు, కేతు సంచారం పరిశీలిస్తే మీనరాశి వారు వృత్తి వ్యాపారాల్లో అభివృద్ధి సాధిస్తారు. పై చదువులు, విదేశీ గమనానికి అనుకూలం. కొత్త వ్యాపారానికి,



*ఆదాయం: 5* *రాజపూజ్యం: 6*
*వ్యయం: 14* *అవమానం: 5*

పరిశ్రమల ప్రారంభానికి తగిన సమయం. ఉద్యోగంలో మార్పు కోరుకుంటారు. విద్యార్థులు, క్రీడారంగంలోని వారికి శుభప్రదం. స్థలమార్పిడికి, ప్రమోషన్లకు అవకాశం ఉంది. రాజకీయ, కళా, సినీ, రవాణా, విద్య, ఐ.టి. రంగాల వారికి ప్రోత్సాహకరం. గురువు వక్రగమనంలో ఉండే ఏప్రిల్ - మే మాసాల మధ్య ఆందోళనలు అధికం అవుతాయి. వృత్తిపరమైన ఒత్తిడులకు లోనవుతారు. న్యాయ, ఆరోగ్యపరమైన సమస్యలు తలెత్తుతాయి.

6-7 స్థానాల్లో గురు సంచారం ఫలితంగా ఉద్యోగ, వృత్తి, వ్యాపారాల్లో కొన్ని ఆటంకాలు ఎదురైనా మొత్తం మీద పురోగతి కనిపిస్తుంది. ఆత్మవిశ్వాసం ధైర్య సాహసాలతో చేసే ప్రయత్నాలు జయప్రదం అవుతాయి. హోటల్, ఆహార ఉత్పత్తులు, ఔషధాలు, ఆస్పత్రులు, కేటరింగ్, నిత్యావసరాల రంగాల వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. ఆదాయం పెరుగుతుంది. విలాసాలకు, మంచి పనులకు వెచ్చిస్తారు. పొరుగు రాష్ట్రాలు, విదేశీ వ్యవహారాలు లాభిస్తాయి. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. ప్రత్యర్థులపై విజయం సాధిస్తారు. ఉమ్మడి వ్యాపారం లాభిస్తుంది. కుటుంబ సమస్యలు పరిష్కారమవుతాయి. ఉగాది నుంచి నెల రోజుల పాటు ప్రత్యర్థుల నుంచి, వైవాహిక జీవితంలో చిక్కులు ఎదురవుతాయి. అనాలోచితంగా పక్కవారి సలహాలు పాటించడంవల్ల నష్టపోయే ప్రమాదం ఉంది.

ఈ ఏడాది 9, 10 స్థానాల్లో శని సంచారం జరుగుతుంది. ఫలితంగా కోర్టు కేసులు ఒక కొలిక్కి వస్తాయి. బాధ్యతాయుతంగా వ్యవహరించి మంచి పేరు తెచ్చుకుంటారు. రాజకీయ, ప్రభుత్వ రంగాల వారికి, టీచింగ్, బ్యాంకింగ్ రంగాల వారికి శుభప్రదం. వృత్తిపరంగా గుర్తింపు లభిస్తుంది. ఆరోగ్యం మెరుగుపడుతుంది. పెట్టుబడులకు అనుకూలం. వృత్తి, వ్యాపారాల్లో అదనపు బాధ్యతలు చేపడతారు. శని వక్రించిన ఏప్రిల్ - ఆగస్టు మాసాల మధ్య న్యాయ, బోధన, కళా, రాజకీయ రంగంలోని వారు అనాలోచిత వైఖరి వల్ల ఇబ్బందులు పడతారు. ఆస్తిపాస్తుల విషయాల్లో చిక్కులు ఎదురవుతాయి. తల్లిదండ్రుల ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది. అప్పు ఇచ్చి పుచ్చుకొనే విషయంలో సమస్యలు ఎదురవుతాయి.

రాహు-కేతు గ్రహాల సంచారం ఫలితంగా శత్రుబాధ అధికంగా ఉంటుంది. ప్రతి విషయంలో చికాకులు, ఆలస్యాలు, ఆటంకాలు ఎదురవుతాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. ప్రయాణాల్లో జాగ్రత్త అవసరం. ఆర్థిక ఇబ్బందులు ఎదురవుతాయి. ఖర్చులు అంచనాలు మించుతాయి. ఆస్పత్రిలో చేరాల్సి రావచ్చు. వృత్తిపరంగా ప్రయోగాలకు ఈ ఏడాది అనుకూలం కాదు.

**అన్నపూర్ణాదేవి ఆరాధన వల్ల శుభాలు లభిస్తాయి.**

# నా ఎడ్ల బండి! నా నాగలి కర్రు




మబ్బుల రెక్కలు ఊగుతుంటే
తొలి తొలకరి జల్లు మనసును తడిపేది

పంట పొలాల గుండెల మీద
నా ఎడ్ల బండి కొత్తదారుల్ని తొలిచేది
గరిసెడు గత్తం బండిలో పరుగులు తీసేది
ఎద్దుల గంటల్లో ఆశలు మోతలు మోగేవి

వెన్నెల వొంపిన చందమామ సాక్షిగా
ప్రతి మడిలో రాత్రిళ్ళు ఎరువుల కుప్పలు విరిసేవి
పనిలోని ఆనందాన్ని
ఆ ఆనందంలోని ప్రకృతిని
నా కూని రాగాలు పరవశింపజేసేవి

తడి తగిలితే చాలు
నాగలికర్రు నాగేటి చాళ్ళలో
మట్టిగుండెల్ని చీల్చుకుంటూ ఉరకలు తీసేది

ఎన్నిమైళ్ళు నాగలితో నడిచాను
ఎన్నిసార్లు విత్తనంతో మొలకెత్తాను

తెల్లవారుజాము చంద్రుడు పూస్తున్నప్పటి నుంచీ
సూరీడు వేడెక్కే వరకూ
నాగలితో ప్రయాణం
జీవన వేదమయ్యేది
బతుకు పాటయ్యేది




పాట పల్లవించిన బతుకులో
నాగలి కర్రు కళ్ళల్లో హరిత వనాల్ని నింపేది.

ఇప్పుడు
నా నాగలి జాడేది
ఇనుప దున్నలకింద
కనుమరుగైపోతున్న నా ఎడ్లబండి
ఆనవాళ్ళైనా మిగల్చుకోవాలని
తల్లడిల్లుతున్నాను

-గవిడి శ్రీనివాస్
సెల్:99665 50601





# కంతుగాడి కాశీయాత్ర

## - శివసతీపురం శర్మ

6

**స్నానాలకి సిద్ధమయ్యారు. డ్రస్సులూ, టవల్సూ పట్టుకుని పదండన్నారు.**

**"ఎక్కడికి?" అడిగాడు మోహన్. ఆశ్చర్యపోయాడు.**

**"గంగానదికి" అన్నాడు సుబ్బారావు.**

"గంగానదిలో స్నానం రేపు చేద్దురుగాని. ఇవాళ ఇక్కడే...బాత్రూంలో కానివ్వండి."

"కాశీకి వచ్చి, గంగలో స్నానం చెయ్యకుండా విశ్వేశ్వరుణ్ణి దర్శించుకోవడమా? ఇది అన్యాయం. అక్రమం. పద్ధతి కాదు." అన్నాడు సుబ్బారావు.

"మీ బాత్రూంలోకొచ్చేది కూడా గంగే! కాబట్టి ఇవాళ్టికిక్కడ కానిచ్చేయండి. వెళ్ళండి." అన్నాడు మోహన్.

ఇష్టం లేదు. కష్టం అనిపించింది. అయినా తప్పదనుకున్నాడు సుబ్బారావు. బాత్రూంలోనికి వెళ్ళాడు. ట్యాప్ విప్పాడు. చల్లగా ఉన్నాయి నీళ్ళు. కరిగిన మంచు ధారగా కురుస్తున్నట్టుగా ఉంది. అయ్య బాబోయ్ అన్నాడు. బయటపడ్డాడు.

"ఏంనైందీ?" అడిగాడు కంతు. ఇలా వెళ్ళి అలా సుబ్బారావు బాత్రూం లోంచి బయటపడడాన్ని ఆశ్చర్యంగా చూశాడు.

"అప్పుడే స్నానం అయిపోయిందా?" అడిగాడు.

"నా బొంద అయింది. స్నానానికి వేణ్ణీళ్ళు కావాలి! లేకపోతే కష్టం. అమ్మో! ఆ చన్నీళ్ళతో స్నానం అసాధ్యం." అన్నాడు సుబ్బారావు.

"మరి నేరుగా నదిలోనే స్నానం చేద్దాం అన్నావు?" డాక్టర్‌బాబు గిల్లినట్టు మాట్లాడాడు.

"బుద్ధి తక్కువై అన్నాన్రా! సారీ! ముందు వేణ్ణీళ్ళు చెప్పండ్రా" తలపట్టుకున్నాడు సుబ్బారావు. రిసెప్షన్‌కి ఫోన్ చేశాడు మోహన్. వేణ్ణీళ్ళ సంగతి చెప్పాడు.

"పదినిమిషాల్లో వస్తాయి, కంగారు పడకండి." చెప్పాడు మోహన్. నవ్వాడు. నెక్స్ట్ ప్రోగ్రాం ఏమిటంటూ వాణి ఫోన్ చేసింది. కంతు వివరించాడామెకు.

తలస్నానాలు చేసి అరగంటలో అంతా తయారయ్యారు.

"వాచీలు, సెల్‌ఫోన్లు, పర్సులు, బెల్ట్‌లు, ఆఖరికి దువ్వెనలు కూడా తీసుకు రావద్దు. అలాగే చెప్పులు కూడా వేసుకోకుంటే బాగుంటుంది. చెప్పుల్లేకుండా నడవడం కష్టం అంటే మీ ఇష్టం." అన్నాడు మోహన్.

చెప్పులు కూడా వేసుకోలేదెవరూ. గుడికి బయల్దేరారు. నడుస్తోంటే నడవనివ్వరే పండాలు.

ఎక్కడ నుంచి వచ్చారు? హైదరాబాదా? అభిషేకం చేస్తారా? ఉత్తపూజా? అని వచ్చీరాని తెలుగులో అడగసాగారు. హిందీలో సమాధానం చెప్పి, వారి బారి నుంచి తప్పించాడు మోహన్. పువ్వులూ, పళ్ళూ, టెంకాయసెట్ కొనేందుకు బేరసారాలు ఆడసాగాడు సుబ్బారావు.

"ఇప్పుడివి అనవసరం సార్! రేపుగాని, ఎల్లుండి గాని అభిషేకం చేస్తారు చూడండీ, అప్పుడు తీసుకుందాం. ఇవాళ ధూళిదర్శనమే! అంటే రైలు దిగి నేరుగా శివుణ్ణి చూడ్డం అన్నమాట." అన్నాడు మోహన్.



విశ్వనాథ్‌గల్లీకేసి చొచ్చుకుపోయాడు. అతన్ని అనుసరించారంతా. ఆ గల్లీలో సాక్షిగణపతిని దర్శించారు. డుండిగణపతిని దర్శించారు. అన్నపూర్ణనీ, విశాలాక్షినీ దర్శించారు. విశ్వేశ్వరుణ్ణి దర్శించేందుకు క్యూలో నిల్చున్నారు. పటిష్టంగా చెకింగ్ జరుగుతోంది. మోహన్ చెప్పింది నిజమే! దువ్వెన కూడా జేబులో ఉండడానికి వీల్లేదు. తీసి పారేస్తున్నారు.

మందిరంలోనికి ప్రవేశించింది మిత్రబృందం. లోపల కూడా గట్టి భద్రత కొనసాగుతోంది. భక్తులను ఓ కంట కనిపెడుతున్నారు పోలీసులు. అంతా పాలగచ్చు. తడితడిగా ఉంది. జారిపడతాం అన్న భయం లేదెవరికీ. దూసుకుపోతున్నారు. గర్భగుడి లోనికి రెండు మూడు ప్రవేశద్వారాలు ఉన్నాయి. ఓ ద్వారం గుండా లోనికి ప్రవేశించారు. ప్రవేశిస్తూనే ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ అని గట్టిగా అరిచాడు సుబ్బారావు. విశ్వేశ్వరుణ్ణి దర్శించాడు. హరహరమహాదేవ! శంభోశంకర అన్నాడు కంతు. చేతులు పైకెత్తి జోడించి శివునికి నమస్కరించాడు. తండ్రీ! ఇన్నాళ్ళకు నిన్ను చూశానంటూ నిర్మల కళ్ళు చెమర్చుకుంటే తదేకంగా దేవుణ్ణి చూస్తూ ఉండిపోయింది వాణి. ఆత్రంగా లింగాన్ని అందుకో బోయాడు డాక్టర్‌బాబు. దడి అడ్డుకుంది.

"ఒరే కంతూ! నా కాళ్ళు ఎత్తి పట్టుకోరా! నేను దడి మీద నుంచి వంగి లింగాన్ని స్పృశిస్తాను. ప్లీజ్‌రా! ప్లీజ్." బతిమలాడాడు డాక్టర్‌బాబు.

"బాగోదేమోరా" అన్నాడు కంతు.

"బాగోగులు తర్వాత! ముందు కాళ్ళెత్తిపట్టుకోరా." అన్నాడు డాక్టర్‌బాబు. ఎత్తి పట్టుకున్నాడు కంతు. డాక్టర్‌బాబు శివలింగాన్ని స్పృశించి, కన్నీరు మున్నీరయ్యాడు. వాడు ఎందుకు అంతలా ఏడుస్తున్నదీ ఎవరికీ అర్థం కాలేదు.

పువ్వులు, పత్రి, నీరు, పాలు, పెరుగు, తేనె అన్నిటితో నిండిపోయి ఉన్నాడు శివుడు. సగానికి సగం వాటిలో మునిగిపోయి ఉన్నాడు. దక్షిణాది లింగాల్లా గుండ్రంగా లేడు శివుడు. ఎద్దు మూపురంలా ఉన్నాడు. నల్లగా లేడు. గచ్చుకాయరంగులో ఉన్నాడు. కొద్దిగా ఒరిగి ఉన్నాడు. ఒదిగి ఉన్నాడు. చలో చలో అంటూ భక్తుల్ని బయటకు పంపిస్తున్నారు. అయినా కదలడం లేదెవరూ. శివయ్య ధ్యానంలో, శివయ్య నామంలో మునిగి తేలుతున్నారంతా.

బయటకు రాక తప్పదు. బయటపడింది మిత్రబృందం.

"కాసేపు కూర్చుందాం." అన్నాడు మోహన్. కూర్చున్నారు.

"ఎందుకు ఏడ్చావురా?" డాక్టర్‌బాబుని గుసగుసగా అడిగాడు కంతు.

"చెప్పలేను! ఏడుపు వచ్చిందంతే." అన్నాడు బాబు.

చేతికి రక్షలు కట్టేందుకు ఎరుపెరుపు తాళ్ళతో పండాలు మీది మీదికి వస్తోంటే వద్దని వారిని వారించడం చాలా కష్టం అయింది. అప్పటికే రెండు తాళ్ళు కట్టించుకుని అయిదువందలు వదిలించుకున్నాడు సుబ్బారావు. ఇక దేనికీ భయం లేదనుకున్నాడు.

"లేవండి! టిఫిన్ చేసి గంగాహారతి చూద్దాం." అన్నాడు మోహన్. లేచాడతను. అతనిసహా మిత్రబృందం కూడా లేచి నిల్చుంది. నడిచింది.

**(సశేషం)**

# తక్కువ ఖర్చుతో నాణ్యమైన చికిత్స సాధ్యమేనా..? అవును..

**ఇటీవల కాలంలో ఈ అంశం మీద చర్చ బాగా సాగుతోంది. నగరాలకు వస్తున్న రోగులు పెరుగుతున్నారు. రోగాలు పెరుగుతున్నాయి. చికిత్స విధానాలు పెరుగుతున్నాయి. అంతకు మించి ఆస్పత్రులు పెరుగుతున్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో చికిత్స, నాణ్యత అందుకు అవుతున్న ఖర్చు వంటి అంశాలు ఒకదానితో ఒకటి ముడిపడి కనిపిస్తున్నాయి.**

ఈ క్రమంలో రోజులు మారుతున్న కొద్దీ వ్యక్తుల జీవన ప్రమాణాలు పెరుగుతున్నాయి. ఇందుకు అనుగుణంగా అన్ని వ్యవస్థల్లోనూ ధరలు పెరుగుతున్నాయి. నిత్యావసర వస్తువుల ధరలు కూడా అంతకంతకూ పెరిగిపోవడాన్ని మనం గమనించవచ్చు.

అదే సమయంలో వెల్లువల దూసుకొస్తున్న టెక్నాలజీ పాత్ర గమనించదగినది. అన్ని వ్యవస్థల్లో మాదిరిగానే వైద్య రంగంలో కూడా టెక్నాలజీ తిరుగులేని పాత్ర పోషిస్తోంది. సంక్షిప్తంగా మానవులు నిర్వర్తించాల్సిన అనేక అంశాల్ని టెక్నాలజీ సాయంతో తేలిగ్గా, తప్పులకు ఆస్కారం లేకుండా చేయడం సాధ్యం అవుతోంది. ఈ క్రమంలో ఏ వైద్యులు అయితే లేదా ఏ ఆసుపత్రి అయితే ఎప్పటికప్పుడు టెక్నాలజీని అందిపుచ్చుకొంటారో అక్కడ సునిశితమైన చికిత్సలు సాధ్యం అవుతాయి. అంటే లోపాలు లేకుండా మెరుగైన ఫలితాలు వచ్చే అవకాశం ఉంటుందన్న మాట. దీంతో పాటు ఖర్చు కూడా గణనీయంగా తగ్గుతూ రావటాన్ని గమనించాలి.

సరిగ్గా ఇదే అంశం కాలేయ మార్పిడిలోనూ మనం గమనించవచ్చు. ఒక పదేళ్ల క్రితంతో పోలిస్తే ఇప్పుడు కాలేయ మార్పిడి ఆపరేషన్‌లు ఊపందుకొన్నాయి. ముఖ్యంగా భారత్ వంటి వర్ధమాన దేశాల్లో అప్పట్లో కాలేయ మార్పిడి ఆపరేషన్ అంటే చాలా హంగామా అవసరం అయ్యేది. పెద్ద పెద్ద నగరాల్లో 1.2 పెద్ద ఆసుపత్రుల్లో మాత్రమే ఈ చికిత్సలు సాధ్యం అయ్యేవి. అప్పుడు కూడా అనేక మంది వైద్య నిపుణులు, చాలా పరికరాలు అవసరం అయ్యేవి. కానీ, వైద్యరంగంలో పరిశోధనలు వేగవంతం అవుతున్న కొద్దీ ఈ నిపుణుల సంఖ్య, పరికరాల సంఖ్య తగ్గుతూ వస్తోంది. కానీ, సునిశితంగా పనిచేసే టెక్నాలజీ బేస్డ్ పరికరాలు మాత్రం అధికంగా వాడకంలోకి వచ్చాయి. దీంతో వీటిని కొనుగోలు చేయడం లేదా వాటిని ఉపయోగించడంలో శిక్షణ పొందడం వల్ల ఈ ఫలితాల్ని పొందే పరిస్థితి ఏర్పడింది. కానీ అధునాతన టెక్నాలజీని వాడడం అంటే అది విదేశాల్లో ఎక్కువగా మొదలవుతుందన్నన సంగతి మనకు తెలిసిందే. దీంతో శిక్షణ కూడా అక్కడ పొందినప్పుడే పరికరాలు వాడకంలో మెళకువలు బాగా వచ్చే అవకాశం ఏర్పడింది.

దీంతో కాలేయ మార్పిడి ఆపరేషన్ లకు సంబంధించి సాంప్రదాయక విధానాలు ఎలా ఉన్నా, టెక్నాలజీని అందిపుచ్చుకొన్న చోట ఫలితాలు మెరుగ్గా ఉన్నాయి. ముఖ్యంగా విదేశాల్లోని అంతర్జాతీయంగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొన్న వైద్య పరిశోధన సంస్థల్లో ఈ పరికరాల వాడకం. టెక్నాలజీ మీద శిక్షణ పొందిన సర్జన్‌లు వీటిని బాగా అందిపుచ్చుకొన్నారు. దీంతో ఇటువంటివి భారత్ లో ప్రవేశించాక కాలేయ మార్పిడి ఆపరేషన్‌లు వేగం పుంజుకొన్నాయి. పైగా వీటి కోసం అవుతున్న ఖర్చు కూడా అందుబాటులోకివచ్చింది. దీంతో4,5 సంవత్సరాల క్రితంనాటి పరిస్థితులతో పోలిస్తే గణనీయంగా ఖర్చు తగ్గిందని చెప్పవచ్చు.

వాస్తవానికి కాలేయం పూర్తిగా చెడిపోయిన పరిస్థితి ఏర్పడే అంటే మందులు వాడటం, చికిత్సలు చేయడం, అవసరమైతే ఆపరేషన్‌లు చేయడం వంటి విధానాలు అవలంభించినా ఫలితం లేక పోతే కాలేయాన్ని మార్చాల్సి వస్తుంది. ఇందుకు సరైన జీవన శైలి లేకపోవడం, ఇన్‌ఫెక్షన్ లు సోకటం, రకరకాల కారణాలు కావచ్చును. అటువంటప్పుడు మార్పిడి తప్పనిసరి అవుతుంది. అంటే ఒకరికి కావలసిన కాలేయాన్ని సేకరించి, గ్రహీతల శరీరంలో అమరుస్తారు. ఈ మార్పిడి అనేది మూడు రకాలుగా జరుగుతుంది.

## కాలేయ మార్పిడిలో సాధారణంగా మూడు రకాలు ఉంటాయి.

**1. మృతదాత కాలేయి మార్పిడి** (డిసీజ్డ్ డోనార్ లివర్ ట్రాన్స్‌ప్లాంటేషన్):
**ఈ విధానాన్ని కాడెవరిక్ కాలేయ మార్పిడి అంటారు. మెదడు పనిచేయడం ఆగిపోయిన వ్యక్తుల్లో కొన్ని సార్లు ఊపరితిత్తులు, గుండె వంటి అవయవాలు పనిచేయవచ్చు. సాధారణంగా ఊపిరి ఆగిపోయి, గుండెకొట్టుకోవడం నిలిచిపోతేనే ఒక వ్యక్తి చనిపోయినట్టుగా చెబుతారు. కొన్ని సందర్భాల్లో అంటే స్ట్రోకు, కపాలంలో తీవ్రస్రావం, ట్రామా వంటి కారణాలతో మెదడు నిర్జీవం అయిపోతుంది. దీన్ని బ్రెయిన్ డెడ్ అంటారు. తర్వాత 48 లేక 72 గంటల్లో మిగిలిన అవయవాలు కూడా స్తంభించిపోతాయి. ఈ సమయంలో ఆయా వ్యక్తుల నుంచి వివిధ అవయవాల్ని సేకరిస్తారు.**

**2. హృదయ స్పందన లేని దాతలు** (నాన్ హార్ట్ బీటింగ్ డోనార్స్):
**పూర్తిగా చనిపోయిన వ్యక్తుల నుంచి (అంటే గుండె, మెదడు, ఊపిరితిత్తులు వంటి ప్రధానాంగాలు నిర్జీవం అయిపోయిన స్థితి) కాలేయాన్ని సేకరించడం అన్నమాట. ఇటువంటప్పుడు చనిపోయిన వెంటనే అంటే దాదాపు 20 నిమిషాల్లోపే అవయవాన్ని సేకరించాలి. వెంటనే ఆ అవయవాన్ని భద్రపరచగలగాలి. చట్టబద్ధమైన విధానాల ద్వారా అంటే సాధికారిక వ్యక్తుల సమ్మతితోనే ఈ అవయవాల్ని సేకరించే వీలుంటుంది.**

**3. సన్నిహితుల నుంచి సేకరించటం** (లివింగ్ రిలేటడ్ లివర్ ట్రాన్స్‌ప్లాంటేషన్):
**ఇటువంటి కేసుల్లో కుటుంబ సభ్యులు లేక సన్నిహితుల నుంచి కాలేయాన్ని సేకరిస్తారు. చట్ట ప్రకారం కుటుంబంలోని సన్నిహితుల దగ్గర నుంచి మాత్రమే అంటే రక్త సంబంధీకుల నుంచి మాత్రమే సేకరించాల్సి ఉంటుంది.**

మూడు రకాలుగా కాలేయ మార్పిడి చేయడానికి అవకాశం ఉన్నప్పటికీ మొదటి విధానంలో కాలేయ మార్పిడి ప్రభావవతంగా చేయడం జరుగుతోంది. ముఖ్యంగా ప్రమాదాలు జరిగి ఆకస్మాత్తుగా మరణించే పరిస్థితి ఏర్పడినప్పుడు విశాల హృదయం ఉన్న రోగి బంధువులు ఇతర అవయవాలతో పాటు కాలేయ మార్పిడికి అంగీకరించవచ్చు. అప్పటికే గ్రహీత ఎక్కడో ఒక చోట కాలేయం కోసం ఎదురు చూస్తూ ఉంటారు. ఈ పరిస్థితుల్లో రోగి శరీరం నుంచి కాలేయాన్ని వేరుచేసి, గ్రహీత శరీరంలో అమర్చడంతో కాలేయ మార్పిడి పూర్తవుతుంది.

దాత నుంచి కాలేయాన్ని సేకరించాక గ్రహీత లోకి అమర్చటం అన్నది నిపుణులైన వైద్యుల టీమ్ మాత్రమే చేయగలుతుంది. ట్రాన్స్‌ప్లాంటేషన్ సర్జన్, అనెస్థటిస్టు, పెర్ ఫ్యూశనిస్టు, హెపటాలజిస్టు వంటి నిపుణులు ఇందులో పాలు పంచుకొంటారు. కాలేయ మార్పిడిలో వివిధ భాగాల మధ్య సమన్వయం అవసరం. అదే సమయంలో సదరు ఆస్పత్రిలో అన్ని వసతులు ఉన్న ఆపరేషన్ థియేటర్, ఇంటెన్సివ్ కేర్ యూనిట్, బ్లడ్ బ్యాంక్, సపోర్టివ్ ల్యాబ్‌లు ఉండాలి. సుశిక్షితులైన సిబ్బంది ఉండాలి.

వీటన్నింటిని పరిగణలోకి తీసుకొని ఆలోచిస్తే కాలేయ మార్పిడి ఒక సంక్లిష్టమైన అంశంగా చెబుతారు. కానీ టెక్నాలజీ పాత్రతో సంక్లిష్టత అంతకంతకూ తగ్గింది. అదే సమయంలో నపుణ్యతకు పెద్ద పీట వేయటం జరుగుతోంది. దీంతో అధునాతన టెక్నాలజీ, పటిష్టమైన అవయవాలు, అంతర్జాతీయ శిక్షణ పొందిన సర్జన్‌ల టీమ్ ఉన్న చోట కాలేయ మార్పిడి సజావుగా సాగుతోంది. అటువంటి చోట సైడ్ ఎఫెక్ట్‌లు లేకుండా జాగ్రత్త పడవచ్చు.

**డాక్టర్ ఆర్.వి. రాఘవేంద్రరావు,**
M.S., M.Ch., (SGPGI), F.H.P.B., F.L.T., (SNUH)
సర్జికల్ గ్యాస్ట్రో ఎంటరాలజిస్టు అండ్ లివర్ మార్పిడి సర్జన్, ఫోన్: 9866458511,
డైరెక్టర్, నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ గ్యాస్ట్రో ఎంటరాలజీ అండ్ లివర్ డీసీజెస్,
(సాయివాణి సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రి) ఇందిరా పార్కు ఎదురుగా, లోయర్ ట్యాంక్ బండ్ రోడ్,
హైదరాబాద్, ఫోన్: 89780 21111. ఈ-మెయిల్. drrvrrao@gmail.com



# సుడి

## -భమిడిపాటి జగన్నాథరావు

**నేను ఆడిట్ పార్టీతో విజయవాడ వచ్చి ఇరవై రోజులైంది. రాగానే మా వాళ్ళందరికీ ఉత్తరాలు రాశాను. ఫోన్లూ, సెల్‌ఫోన్లూ లేని కాలం అది. మా పని అయిపోయి రేపు అందరం వెళ్ళిపోతాం. అలాంటిది నిన్న మా చెల్లెలు నిర్మల వెంటనే బయల్దేరి ఆగ్రా రమ్మనమని నాకో టెలిగ్రామ్ ఇచ్చింది. వెంటనే టికెట్, బెర్త్ ఏర్పాటు చేసుకున్నాను.**

**నేను ఎక్కవలసిన ఢిల్లీ వెళ్ళే రైలు విజయవాడ ప్లాట్‌ఫారంపై అప్పుడే వచ్చి ఆగింది. ఆ ప్లాట్‌ఫారం మహా కోలాహలంగా, గొప్ప గందరగోళంగా ఉంది. ఎక్కే జనం, దిగే జనం, తినుబండారాలు అమ్మేవాళ్ళ కేకలు, జనం తోపులాట - ఆ హడావిడి నాలో ఆందోళన పెంచి, నన్ను అస్థిమితంలోకి నెట్టేసింది.**

నేను నెమ్మదిగా నా కోచ్ వెతుక్కుని నా బెర్త్ దగ్గరకు వెళ్లాను. మెయిన్ బేలో లోయర్ బెర్త్.

నా ఎదురు బెర్త్‌లో ఓ యువతి నాలుగైదు నెలల పిల్లాణ్ణి తన భుజం మీద ఎత్తుకుని నెమ్మదిగా జోకొడుతోంది. ఆమె వదనంలో ప్రయాణ అలసట కాస్త కదలాడుతున్నా, చాలా ప్రశాంతంగా మంచి కళతో మెరుస్తోంది. ఆమె ఉన్న బెర్త్‌కింద, నా బెర్త్‌కింద కూడా బోలెడు సామాను సర్దేసి ఉన్నాయి.

నా చూపును ఆమె గమనించి "నేను, ఆయన బ్యాంక్ ఎంప్లాయిస్‌మి. ఇద్దరినీ ఆఫీసర్స్‌గా ప్రమోట్ చేసి వైజాగ్ నుండి చండీఘర్ బదిలీ చేశారు. ఆ ప్రయాణంలో ఉన్నాం. అందుకే ఇంత లగేజ్" అంది ఇంగ్లీషులో సంజాయిషీ ఇచ్చుకుంటున్నట్టు.

ఆమె కంఠస్వరం, తీరు చాలా మృదువుగా ఉంది. ఆ చిన్న పిల్లాడు పాల ఒళ్ళుతో ముద్దుగా, ముచ్చటగా పచ్చగా మెరుస్తున్నాడు.

రైలు కదులుతుండగా అతను హడావిడిగా వచ్చి, పెళ్లాంతో... "ఇదిగో దోసె, వడ, ఇడ్లీ" అన్నాడు హిందీలో టిఫిన్ పొట్లాలు అందిస్తూ.

నన్ను ఓ కంటితో చూస్తూ "వీడెవడు?! ఇక్కడ ఎక్కాడు - మన మధ్యకి" అన్నాడు అతను భార్యతో.

"ఇస్. ఆయనకు హిందీ అర్థం అవ్వొచ్చు. మర్యాదగా మాట్లాడ్డం అలవాటు చేసుకోండి" అంది, మొగుడు కేసి కాస్త చురుగ్గా చూస్తూ.

"ఈ విజయవాడ వాళ్ళకి హిందీ రాదులే" అన్నాడతను.

ఆమె చెపితే నా బెర్త్ కింద ఉన్న తమ సామాను కాస్త సర్ది నా పెట్టె, బ్యాగు పెట్టుకోడానికి చోటిచ్చాడు.

ఆ పిల్లాణ్ణి జాగ్రత్తగా పడుకోబెట్టి టిఫిన్ తినబోతూ "మీకు కాస్త ఇస్తాను. తీసుకోండి" అంది.

నేను "తినే వచ్చానని" చెప్పి వద్దన్నాను.

వాళ్లిద్దరూ టిఫిన్ తినడంలో ఉన్నారు.

చెల్లెలు నిమ్మి 'ఆగ్రా వెంటనే రమ్మనమని వైర్ ఎందుకు ఇచ్చింది?' అన్న ఆలోచనలో ఉండిపోయాను.

ఈ నిమ్మీ మా బాబాయి కూతురు. మా ఇంట్లో ఆడ పిల్లలు లేకపోవడంతో మా సొంత చెల్లెలుగానే చూసుకున్నాం. మా నాన్న, బాబాయి హైదరాబాద్ వాసులు. అక్కడే పుట్టి పెరిగిన వాళ్ళు. ఒకరంటే ఒకరికి ప్రాణం. రెండు వాటాలుగా ఒకే ఇల్లు కట్టుకున్నారు. హైదరాబాద్‌లో ఉద్యోగాలు. మా బాబాయి మూడో కూతురు నిర్మల. మా ఇంట్లోనే పెరిగింది. 'నిమ్మీ' అని పిలుచుకునేవాళ్ళం. ఆ పిల్ల చాలా చురుకైనది, కుదురైనదీను. చదువులో, సంగీతంలో, చదరంగం, క్యారమ్స్ ఆడటంలో బాగా రాణించేది. ఇంగ్లీషులో పి.జి. చేసి తర్వాత 'లా' కూడా పాసయింది.

మాకు బావ వరసైన దూరపు చుట్టాన్ని మా బాబాయి నిమ్మీకి సహచరుడుగా కుదిర్చాడు. అతను విజ్ఞానశాస్త్రంలో ఎం.ఎస్సీ చేసి సైంటిస్ట్‌గా ఉద్యోగం చేస్తున్నాడు. ఆ పెళ్లి మా నాన్న ఆధ్వర్యంలో జరిగింది.

అతనికి ఆగ్రాలో ఉద్యోగం. చెల్లి, బావ ఆగ్రా వెళ్ళారు. ఎనిమిదేళ్ల క్రితం. నిమ్మీ అక్కడ కాలేజీలో లెక్చరర్‌గా కుదురుకుంది. వాళ్ళకి ఇంకా పిల్లలు కలగలేదు.

ఆ చిన్నపిల్లాడు ఉలిక్కిపడి లేచి, ఉన్నట్టుండి ఏడుపు మొదలెట్టాడు. వాళ్ల తినడం ముగిసినట్టుంది. ఆమె పిల్లాడి తల నిమురుతూ ఒళ్లోపెట్టుకుని జోకొడుతోంది.

ఆ 4, 5 నెలల పసివాడికి తలంతా నల్లటి పట్టులాంటి జుట్టు ఒత్తుగా. ఆ పిల్లాడి చిన్ని మొహం, జుట్టు చూస్తుండగా - నాకు నవ్వు వచ్చింది.

"ఎందుకు నవ్వుతున్నారు?" అన్నాడు ఎదురతను కాస్త రొక్కిస్తూ.

"ఏం లేదు..." అని నసిగాను.

"కాదు. ఏదో ఉంది. చెప్పండి" అని పట్టుపట్టాడు.

"ఏం లేదు. ఓ నానుడి ఉంది. అది గుర్తొచ్చి నవ్వొచ్చింది" అన్నాను.

"అదే, ఏవిటది?" అన్నాడు చెప్పి తీరాలన్నట్టు.

"మీ పిల్లాడి తలలో రెండు సుడులు ఉన్నాయి. అలా ఉంటే ఇద్దరు పెళ్లాలంటారు" అన్నాను మొహమాటంగా.

అతను "ఇద్దరు పెళ్లాలు పిల్లాడికా, పిల్లాడి తండ్రికా?" అని వెకిలిగా నవ్వుతూ, నాకు కన్ను కొట్టాడు.

ఆమె అతనికేసి కొరకొరా చూస్తూ "ఆయన మనకి కొత్త. ఆ మాటలేవిటి?" అంది.

అతను "వాడితో కాస్త సరసమాడానులే. నా గురించి వాడేవనుకుంటే నాకేవిటీ?" అన్నాడు భార్యతో.

కాసేపు అయ్యాక "నేనిక పడుకుంటాను" అన్నాను హిందీలో.

"మీకు హిందీ వచ్చా?" అన్నాడు తెల్లబోయి.

"నేను హైదరాబాదీని. మీరు విశ్రమించండి"

**ఆగ్రా రైలెక్కాడతడు. బోగీలో ఎదురు బెర్తులో కూర్చున్న పిల్లాణ్ణి చూడగానే నవ్వొచ్చిందతడికి. మీ అబ్బాయి తలమీదున్న రెండు సుడులు చూసి నవ్వానని పిల్లాడి తండ్రికి సంజాయిషీ చెప్పాడతడు. అదివిని పగలబడి నవ్విన తండ్రి ఏమన్నాడు? ఈ కథలో ఈ సుడులకున్న ప్రత్యేకత ఏమిటి? ఇంతకూ అతడు ఆగ్రా వెళ్ళి చూసిన ఘనకార్యమేంటని?**

# ఆటిజం కష్టాలకు స్వర్ణామృత ప్రాశనతో స్వస్తి

డాక్టర్ పూజారి రవికుమార్
ఆర్ కె ఆయుర్వేదిక్ అండ్
సోరియాసిస్ రీసెర్చ్ సెంటర్
ఫోన్స్: 88869 22294, 88869 22297
www.swarnamruthaprashana.com
www.ayushmall.com



మానవ అస్థిత్వానికీ, వ్యక్తిత్వానికీ నాడీవ్యవస్థే కీలకం. కానీ, కొంద మంది పిల్లల్లో పుట్టుకతోనే శరీరానికీ, నాడీ వ్యవస్థకూ అంటే మెద డుకూ మధ్యనున్న సంబంధం తెగిపోతుంది. దాని ఫలితమే ఆటిజం. మెదడు తన పని తాను చేసుకుపోతుంది. శరీరం తన పని తాను చేసు కుపోతుంది. అంతే తప్ప రెండింటి మధ్య సమన్వయం మాత్రం ఉండదు. ఈ కారణంగానే పిల్లలకు తాము చేయాల్సిన పనేమిటో, చేయ కూడని పనేమిటో తెలియకుండా పోతుంది. వీరి శారీరక ఎదుగుదల బాగానే ఉన్నా, మానసిక ఎదుగుదల మాత్రం సరిగా ఉండదు.

### ఆటిజం కారణాల్లోకి వెళితే...

ఈ వ్యాధి రావడానికి వంశానుగతమైన మూలాలు కూడా పనిచే స్తాయి. ప్రసవ సమయంలో జరిగే కొన్ని పొరపాట్లు కూడా ఈ వ్యాధికి కారణమవుతాయి. శిశువుగా ఉన్నప్పుడు మెదడుకు తగిలిన గాయాలు కూడా ఆటిజం సమస్యకు కారణం కావచ్చు. తల్లి గర్భంలో ఉన్నప్పుడు ఎప్పుడూ ఒకేరకమైన ఆహార పదార్థాలు తీసుకోవడం.

### గుర్తించేదెలా?

ఆటిజం రావడానికి గల కారణాల మాట ఎలా ఉన్నా, వచ్చిన వ్యాధిని గుర్తించడం ఎలా అన్నదే ముఖ్యమవుతుంది. పిల్లలకు అందరిలా ఆ వయసులో మాటలు రావడం లేదన్న విషయాన్ని గమనించి ఎందుకు రావడం లేదో తెలుసుకునే ప్రయత్నాలు చేయాలి. మనం పిల్లల్ని పలక రించినప్పుడు వాళ్లు మనవేపు చూస్తున్నారా లేదా అన్న విషయాన్ని తల్లి దండ్రులు గమనించాలి.

- వీరిలో మొండితనం ఎక్కువగా కనిపిస్తుంది. తాను కావాలనుకున్న వస్తువు తన చేతికి వచ్చేదాకా ఊరుకోరు. అది తనకు అందకపోతే పక్కనున్న వారికి గిల్లడం, కొరకడం వంటివి చేస్తారు.
- ఆటిజం పిల్లలు ఎప్పుడూ ఏదో ఒక వైపే చూస్తారు. మనం పిలిచినా మన వైపు చూడరు. చూసే తీరు కూడా వేరుగా ఉంటుంది.
- ఏవో కొన్ని రంగుల్ని మాత్రమే వీరు గుర్తిస్తారు. ఒకవేళ వాళ్లకు ఎరుపు రంగు నచ్చితే ఎంత సేపూ తన దృష్టినంతా ఆ ఒక్క రంగు మీదే దృష్టిపెడతారు.

### స్వర్ణామృత ప్రాశన వల్ల జరిగేదేమిటి?

ఆటిజంలోని ప్రధాన సమస్య మెదడుకు శరీరానికి మధ్య సంబంధం తెగిపోవడం. అలా తెగిపోవడానికి మెదడు తన సహజమైన పటు త్వాన్ని కోల్పోవడమే కారణం. ఈ స్థితిలో స్వర్ణామృత ప్రాశన మెదడుకు శక్తిని ప్రసాదిస్తుంది. మొత్తం నాడీ వ్యవస్థను, మెదడులోని స్పీచ్ సెంటర్లను చైతన్యపరుస్తూ బాడీకి కనెక్ట్ అయ్యేలా చేస్తుంది. అందుకే స్వర్ణామృత ప్రాశన వాడటం మొదలెట్టిన మొదటి రెండు నెలలలోపల మాట రావడాన్ని గమనించవచ్చు. అసలే మాటల్లేని పిల్లల నోట కొన్ని మాటలు రావడాన్ని గమనించవచ్చు.ఆ తర్వాత మూడో నెలనుంచి ఏదో ఒక్క వ్యక్తితోనే సన్నిహితంగా ఉండే స్థితిని తన చుట్టూ ఉండే ఆ నలు గురితోనూ కలిసిపోవడాన్ని మనం గమనించవచ్చు. నాలుగో నెలలో కాస్తంత అటెన్షన్ కూడా మొదలవుతుంది. ఎవరైనా పిలిస్తే పలకడం, ఏదైనా పని చెబితే చేయడం గమనించవచ్చు. 5వ నెల వచ్చేసరికి అప్పటిదాకా ఉంటూ వచ్చిన హైపర్ యాక్టివ్ తత్వం, కొంత మేరకు తగ్గుముఖం పడుతుంది. మెల్లమెల్లగా ఆ మొండితనం బెరుకుతనం తగ్గిపోతాయి. స్వర్ణామృతప్రాశనలో స్వర్ణభస్మంతో పాటు, ఆయుర్వేదాను సారం మనిషి మేధోశక్తిని పెంచే మేధోద్రవ్యాలు కూడా ఇందులో ఉన్నాయి. ఇవి ఆటిజం పిల్లల ఐ.క్యూ లెవెల్‌ను పెంచడంలో ఎంతో ఉపయోగపడతాయి.

# మోకాళ్ల నొప్పుల నుంచి మోక్షమే లేదా?

డాక్టర్ టి. ఎల్. శ్రీనివాస్
సహజ ఆయుర్వేదిక్ హాస్పిటల్
అండ్ రీసెర్చ్ సెంటర్
బ్రాంచీలు : మలక్‌పేట్ , హన్మకొండ, రాజమండ్రి
విజయవాడ అనంతపూర్, జోగిపేట్, తిరుపతి
ఫోన్స్ : 9160994455, 9160994456



**మోకాళ్ల** నొప్పులు అనేమాట మీద ఈ నాలుగు విషయాల గురించీ ఆలోచించవలసి వస్తుంది. వాటిలో ప్రధానంగా ఏమిటంటే ఒక సాధా రణ బరువుతో ఉండాల్సిన వ్యక్తి, సగటుకంటే ఎక్కువ బరువును మోయాల్సి వస్తుంది. ఆ బరువునంతా ఈ మోకాళ్లే మోస్తాయి. మోయ డమే కాకుండా ముందుకు నడుస్తున్నాయి. అవసరానికి మించిన బరు వును మోయాల్సి వచ్చినప్పుడు ఎముకకు ఎముకకు మధ్యలో ఉండే మృదులాస్థి గాయపడటమో లేదా అరిగిపోవడమో జరగవచ్చు. మొదట్లో గాయమైనప్పుడు స్రావాలు ఎక్కువ కావచ్చు. ఏ ధాతువైనా ఏ స్రవాలైనా, అవసరానికన్నా ఎక్కువగా ఉంటే అది వ్యాధే. అప్పుడు కీలు చుట్టూ ఒక వాపు ఏర్పడుతుంది. గాయమైనప్పుడు గాయం రక్తనా ళాలకు సంబంధం ఉంది కాబట్టి రక్తనాళాలనుంచి కొన్ని అదనపు స్రావాలు ఈ కీలు మధ్యలోకి స్రవిస్తూ ఉంటాయి. కాబట్టి అక్కడ వాపులా తయారవుతుంది. ఒక్కోసారి అక్కడ స్రావాలే ఏర్పడకపోవచ్చు.

### సమస్థితికి తేవాలి

ఏది ఎక్కడ తక్కువగా ఉంటే దాన్ని వృద్ధిచేయడం లేదా పునరుద్ధరిం చడమే అక్కడ చికిత్స అవుతుంది. ఎక్కడైతే ఎక్కువ స్రావాలు జరుగు తున్నాయో అలా జరక్కుండా చూడటమో లేదా వాటిని తీసివేయ డమో అక్కడ చికిత్స అవుతుంది. స్రావాలు ఎక్కువ కావడానికి ఒక గాయం కారణమవుతున్నప్పుడు ముందు ఆ గాయాన్ని మాన్పడమే చికిత్స అవుతుంది.

### జానువస్తి ఒక దివ్య మార్గం

కీళ్లనొప్పులను వాతం పేరుతో చెప్పినప్పటికీ, నొప్పే ప్రధానంగా ఉంటున్నప్పటికీ మిగతా లక్షణాల్ని కూడా ప్రాతిపదికగా తీసుకుని. అంటే పిత్తం, శ్లేష్మం లక్షణాలను కూడా పరిగణనలోకి తీసుకని చికిత్స చేయవలసి ఉంటుంది. కీళ్లు కదలకుండా ఉండిపోయే పరిణామం కావడం చేత, దీనికి సంధిశూల అంటారు. అలా కదలకుండా ఉండిపో వడానికి కారణమేమిటి? ధాతువులు క్షీణించిపోవడమే అందుకు కారణం. వినియోగంలో లేని వాహనం తుప్పు పట్టినట్లు, నొప్పుల కార ణంగా చాలా కాలం అవయవాలను కదిలించకపోవడం వల్ల కీళ్లు బిగు సుకుపోతాయి. ఫలితంగా కీళ్లను మలుచుకుపోవడం గానీ, దగ్గరకు తీసుకోవడం గానీ, సాధ్యం కాకుండా పోతుంది. బలవంతంగా దగ్గరగా తీసుకున్నా తీవ్రమైన నొప్పి వస్తుంది. ఇవన్నీ అంగవైకల్యం కిందికే వస్తాయి. ఈ స్థితిలో ఆధునిక వైద్యం కీళ్ల మార్పిడి అన్న ఒక కొత్త విధానాన్ని తీసుకు వచ్చింది. అయితే అవసరం ఉన్నా లేకపోయినా, కీళ్లు మార్చివేసుకుంటూ పోవడం కాదు కదా: మౌలిక సమస్య జీవక్రియ లకు సంబంధించింది అయినప్పుడు వాటికి సంబంధించిన చికిత్సేదీ లేకుండా, కీలు మార్పిడి చేసి వదిలేస్తే, ఆ నొప్పి ఇంకా కొనసాగే అవకాశం ఉందితైలాలకు వాతాన్ని తీసివేసే తత్వం ఉంటుంది కాబట్టి, వాతాన్ని తొలగించే ఆకులతో లేదా మూలికలతో తైలాలతో అభ్యంగం చేయడం ద్వారా కూడా వారికి ఉపశమనాన్ని ఇవ్వవచ్చు. దీనికి తోడు మోకాలి చుట్టూ తైలాల్ని నొప్పి ఉన్న భాగంలో గుండ్రంగా ఒక ద్రోణి కట్టి ధార గా పోయడం ద్వారా అంటే జానువస్తి చికిత్స చేయడం ద్వారా కూడా నొప్పినుంచి సంపూర్ణ విముక్తి లభిస్తుంది.

అని హిందీలో చెప్పి, నేను పడుకున్నాను.

రాత్రి కలత నిద్ర. నేను ఆగ్రాలో దిగేటప్పటికి ఇంకా కాస్త చీకటిగానే ఉంది. తెలతెలవారబోతూ చీకటి వెలుగులోకి విచ్చుకుంటోంది.

ఆగ్రా తెలుసు. చాలాసార్లు ఆగ్రా వచ్చి మా చెల్లి దగ్గర గడిపే వాళ్ళం నేను, నా భార్య, ఇద్దరు పిల్లలూ.

చెల్లెలు ఇంటికి వెళ్ళాను. మా చెల్లెలు నవ్వుతూ నన్ను ఇంట్లోకి తీసుకెళ్ళింది.

తెల్లవారింది.

కాఫీ ఇచ్చింది. స్నానం అయ్యాక నాకు ఇష్టమైన గోధుమ రవ్వ ఉప్మా చేసింది.

నాస్తా చేస్తూ "బావ ఏడీ" అన్నాను.

"టూర్ ఉందని వెళ్ళారు. రేపు ఆదివారం రాత్రికి వస్తానన్నారు".

ఆ శనివారం సాయంత్రం నిమ్మి నన్ను బయల్దేరమని, ఓ గ్రంథాలయం దగ్గరకు తీసుకు వెళ్లింది. అక్కడ ఉన్న చక్కటి ఆకుపచ్చని లాన్‌లో ఓ అమ్మాయి కూచుని ఉంది. ఆమె పక్కన నిమ్మీ కూచుని, నన్నూ కూచోమని సంజ్ఞ చేసింది.

"ఈ అమ్మాయి నా స్నేహితురాలు. ఓ పదిహేను రోజుల క్రితం ఈ అమ్మాయిని కలిశాను. ఆ తర్వాత వారం రోజుల్లో మరో మూడుసార్లు కలుసుకున్నాం. పేరు చిత్ర. ఇతనూ మా అన్నయ్య" అని నిమ్మి పరిచయాలు చేసింది.

ఆ తర్వాత ముగ్గురం తాజ్‌మహల్ దగ్గరకు వెళ్ళి కూచున్నాం.

త్రయోదశి వెన్నెల తాజ్‌మహల్‌ని వెలిగిస్తోంది.

చిత్ర తెలుపు, పసుపు కలిసిన ఛాయలో వెన్నెల తీగలా మెరుస్తోంది. ఆ పిల్ల మొహంలో బెంగ లాంటిది ఏదో కదుల్తున్నట్టు నాకు అనిపించింది.

"చిత్రకు వాళ్ళ వాళ్ళు పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు. ఈలోగా చిత్ర 'ఫ్యామిలీవే'లో మూడో నెలలో ఉంది. ఆమె లోపల మీ బావ దొంగలా దాగి ఉన్నాడు. తనకి పెళ్ళి అవలేదని, పెళ్ళి చేసుకుంటానని ఈ అమ్మాయిని మీ బావ నమ్మించాడు.

మీ బావ ప్రవర్తన అనుమానం వచ్చి, కూపీలాగి, అతన్ని ఓ రాత్రి వెంబడించి ఈ పిల్లతో చూశాను. అప్పటికే చిత్ర చాలా ఆందోళనలో ఉంది. నేను విడాకులు తీసుకుని వాళ్ళిద్దరికీ పెళ్ళి చేస్తానని చిత్రకు ధైర్యం చెప్పాను".

ఆ తర్వాత ముగ్గురం నిశ్శబ్దంగా ఉండిపోయాం.

నాలో ఆశ్చర్యం, కోపం పెల్లుబుకుతున్నాయి.

ఆ నిశ్శబ్దం భరించలేనిదిగా ఉంది.

నేను చిత్రతో "కంగారు పడొద్దు. మీ పెళ్ళి జరుగుతుంది. మాదీ బాధ్యత" అని లేచాను.

ఆ అమ్మాయిని దింపి ఇంటికి వచ్చాం.

మరుసటి రోజు సాయంత్రం మా బావ ఇంట్లో దిగాడు.



## ఇక సుఖవ్యాధుల బాధే ఉండదు

**హెచ్ఐవి :** చికిత్స లేని వ్యాధిగా హెచ్ఐవికి పేరుంది. నిజానికి హోమియోలో హెచ్ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, త్వరగా వ్యాధులు రావడం జరుగుతుంది.

**గనేరియా :** మూత్రంలో మంట, మూత్రనాళం దగ్గర దురద, జిగురుగా ద్రవం కారడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. ఒక్కొక్కసారి రక్తపరీక్షలో గనేరియా బయటపడకపోవచ్చు. కానీ మూత్రనాళంలో బాధ, మూత్రంలో మంట ఉంటుంది. కొందరిలో పొత్తికడుపు నొప్పి, వీర్యంలో మంట, రక్తం రావడం కనిపిస్తాయి.

**వెనీరియల్ వార్ట్స్:** పురుషాంగం మీద చిన్న క్యాలిఫ్లవర్ తరహాలో పులిపిరులు వస్తాయి. ఇవి గుత్తులు గుత్తులుగా తయారవుతాయి.

**షాంకరాయిడ్ పుళ్లు:** ఇది కూడా లైంగిక వ్యాధే. లైంగిక సంపర్కం తర్వాత 3 నుంచి 5 రోజులలో ఈ వ్యాధి బయటపడుతుంది. జననాంగం మీద రెండు, మూడు పుళ్లు ఏర్పడతాయి. ఇది మొదట చిన్న నీటి బుడగలాగా వచ్చి చీము ఏర్పడి పగులుతుంది. పుండు ఎర్రగా మారి రుద్దినపుడు నొప్పి వస్తుంది.

**హోమియో చికిత్స :** రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. గనేరియా, వెనీరియల్ వార్ట్స్, షాంకరాయిడ్ పుళ్లు కూడా హోమియో మందులతో సమూలంగా దూరమవుతాయి.

**Dr. K Ravikirane**
**M.D.,M.sc(psych), P.G(virology)LONDON**
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
**మాస్టర్స్ హోమియోపతి**
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం, తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106



## పిల్లలు లేరని దిగులే వద్దు

**ఆధునిక చికిత్సలు** ఎన్ని అందుబాటులోకి వచ్చినా సంతానలేమితో బాధపడుతున్న దంపతులకు పరిష్కారాన్ని చూపలేకపోతున్నాయి. అయితే హోమియో మాత్రం ఇందుకు భిన్నంగా సత్ఫలితాలను అందిస్తోంది. ఏడాదిగా ఎటువంటి గర్భనిరోధక పద్ధతులు పాటించకపోయినప్పటికీ గర్భం రాకపోయినట్లయితే సంతానలేమి సమస్య ఉన్నట్లుగా భావించాలి.

**కారణాలు ఇవి కావచ్చు :** వీర్యకణాలు తక్కువగా ఉంటే సంతానం కలిగే అవకాశాలు తక్కువగా ఉంటాయి. వేరికోసిల్, హైడ్రోసిల్, మూత్ర సంబంధ వ్యాధులు, సుఖ వ్యాధుల వల్ల కూడా వీర్యకణాలు నశించి సంతానలేమికి కారణమవుతూ ఉంటాయి. దీర్ఘకాలంగా షుగర్ వ్యాధి ఉండటం, అధిక బరువు, వృషణాలకు దెబ్బలు తగలడం, ప్రమాదాల్లో వెన్నుకు గాయాలవడం, హార్మోన్ల అసమతుల్యత, క్రోమోజోముల లోపాలు, విపరీతంగా స్మోకింగ్ చేయడం వంటివి కూడా పురుషుల్లో సంతానలేమికి కారణమవుతుంటాయి. బిగుతైన దుస్తులు ధరించడం, ప్రతిరోజు వేడి ఎక్కువగా ఉండే నీళ్లతో స్నానం చేసే అలవాటు ఉండటం వంటివి కూడా కారణమవుతాయి.

**హోమియో చికిత్సతో :** సంతానలేమికి కచ్చితమైన కారణం తెలుసుకుని చికిత్స అందిస్తే సంతానసాఫల్యం తప్పక కలుగుతుంది. వీర్యకణాల లోపం ఉంటే హోమియో మందులు తీసుకోవడం ద్వారా వీర్యపుష్టి కలుగుతుంది. వీర్యకణాల కదలికలు పెరుగుతాయి. హార్మోన్ల సమస్యలు సైతం హోమియో చికిత్సతో తొలగిపోతాయి. అంగస్తంభనలు లేకపోవడం వంటి సమస్య ఉంటే దూరమవుతుంది. సంతానలేమి కారణాలన్నీ దూరమయిపోయి సంతానం సిద్ధిస్తుంది.

## శృంగారంలో వైఫల్యమా?

**పడకగదిలో** ప్రవేశించగానే తెలియని భయం. ఈ రోజు కూడా విఫలమవుతానేమోనన్న ఆందోళన, వెరసి శృంగారం జీవితంలో అసంతృప్తి. పెళ్లయిన మూడు రోజులకే విడిపోయే పరిస్థితి. భార్యను సుఖపెట్టలేకపోతున్నానని తన మీద తనకే అసహ్యం. ఈ పరిస్థితి చాలా మంది శృంగార జీవితాల్లో కనిపిస్తుంది. అయితే ఇలాంటి సమస్యలన్నీ హోమియో చికిత్సతో దూరమవుతాయి.

**అంగస్తంభన సమస్యలు :** పురుషులలో ఎక్కువ శాతం మంది ఈ సమస్యతో బాధపడుతుంటారు. శృంగారానికి తగినంత విధంగా అంగం స్తంభించకపోవడం లేదా స్తంభించినా మధ్యలో మెత్తబడటం జరుగుతుంటుంది. అంగస్తంభన సరిగ్గా జరగకపోవడానికి కారణం రక్తం సాఫీగా సరఫరా కాకపోవడమే. మానసికంగా ఆందోళనతో ఉన్నప్పుడు, శృంగారానికి పనికిరానేమోననే సందేహం మదిలో ఉన్నప్పుడు సహజంగానే అంగస్తంభన సమస్య ఎదురవుతుంది. ఒకటి రెండు సార్లు శృంగారంలో పాల్గొని విఫలమైనపుడు మరొకసారి కూడా అలానే జరుగుతుందేమోనన్న భయం పట్టుకుటుంది. ఆ భయంతో శృంగారంలో విఫలమవుతూనే ఉంటారు.

**శీఘ్రస్ఖలనం :** శృంగారంలో ఆనందం అంచులు తాకకముందే స్ఖలనం జరగడం అనే సమస్య చాలా మంది మగవాళ్లలో కనిపిస్తూ ఉంటుంది. ఈ సమస్య దంపతుల మధ్య అగాధాన్ని పెంచుతుంది. ఎక్కువ మంది మగవాళ్లలో ఈ సమస్య కనిపిస్తుంది.

**హోమియో చికిత్స :** మూలకారణాన్ని తెలుసుకుని చికిత్స ఇస్తే మంచి ఫలితం ఉంటుంది. కారణమేదైనా హోమియో మందులు అంగస్తంభన సమస్య, శీఘ్రస్ఖలనంను తొలగించి శృంగార జీవితాన్ని ఆనందమయం చేస్తాయి.

## హెపటైటిస్ బి, సి, హెర్పిస్‌ల ఆటకట్టు

**హెపటైటిస్...** ఈమధ్యకాలంలో చాలా మందిని భయపెడుతున్న వైరస్ ఇది. ఇతర జబ్బులకు చికిత్స కోసం వెళ్లినపుడు, అనుకోకుండా చేసిన పరీక్షల్లో హెపటైటిస్ ఉన్నట్లు భయటపడుతుంది. దాంతో ఇక తమ జీవితం ముగిసినట్టేనని నిర్ధారణకు వస్తారు. ఈ వైరస్ శరీరంలో నుంచి పూర్తిగా పోదని, దీర్ఘకాలంలో కాలేయం దెబ్బతినే అవకాశం కూడా ఉందని వైద్యులు చెప్పడంతో వాళ్లు ఆ నిర్ణయానికి వస్తారు. నిజానికి హెపటైటిస్ వైరస్‌ను కట్టడి చేసే మందులు హోమియోలో ఉన్నాయి. హెపటైటిస్ ఉందని నిర్ధారణ అయ్యాక భయపడకుండా హోమియో వైద్యం తీసుకుంటే ఆరోగ్యవంతమైన జీవితం గడిపే అవకాశం దక్కుతుంది. ఆకలి వాంతులు వచ్చినట్టు అనిపించడం, ఒళ్లంతా నొప్పులు, మూత్రం పచ్చగా రావడం, కామెర్లు, చర్మంపైన దద్దుర్లు రావడం జరుగుతుంది. కడుపులో ఉబ్బరంగా ఉండటం, పొట్టలో నొప్పి వంటి లక్షణాలన్నీ హోమియో మందులతో దూరమవుతాయి.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. సాధారణ పొక్కులే కదా అని వాటిని నిర్లక్ష్యం చేస్తారు. కానీ ఆ నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు మాదిరిగా తయారవుతాయి. పురుషుల్లోనే కాకుండా స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి విపరీతమైన నొప్పి ఉంటుంది. ఈ సమస్యకు చికిత్స తీసుకోకుండా వదిలేస్తే అనేక ఇతర సమస్యలకు దారితీస్తుంది. శృంగార జీవితం దెబ్బతింటుంది. సుఖం దూరమవుతుంది. దంపతుల మధ్య గొడవలకు కారణమవుతుంది. అయితే హెర్పిస్ సమస్యకు హోమియో అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టడం ఉండదు. శృంగారజీవితం ఆనందమయం అవుతుంది.

# గూబ గుయ్యిమనిపించింది

సాధారణంగా సన్నీలియోన్ ఏమాత్రం బ్యాలెన్స్ తప్పదు. మీడియా వాళ్ళతో చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తుంది. ఎలాంటి ప్రశ్నలు వేసినా శాంతమూర్తిలా జవాబులు ఇస్తుంది. అలాంటిది ఇటీవల ఓ రిపోర్టర్ చెంప పగలగొట్టిందట! దీనికి కారణం ఏమిటంటే..హోలీ సందర్భంగా సూరత్‌లో ఓ ఈవెంట్ నిర్వాహకులు సన్నీని ఆహ్వానించారు. అక్కడికి మీడియాను పిలవొద్దని ముందే చెప్పడంతో నిర్వాహకులు మీడియాను అనుమతించలేదు. కార్యక్రమం అంతా సరదాగా సాగింది. అక్కడ సన్నీ కొన్ని హిందీ పాటలకు డ్యాన్స్ కూడా చేసింది. తిరిగి హోటల్‌కి వచ్చేసింది. అక్కడ ఓ రిపోర్టర్ ఆమెను అడ్డుకున్నాడు. 'ఇప్పుడు నేను ఇంటర్వ్యూ ఇవ్వను' అని సన్నీ ఎంత చెప్పినా వినకుండా అసభ్యకరంగా మాట్లాడాడు. దాంతో సన్నీకి కోపం వచ్చి అతగాడి చెంప మీద ఒక్కటి ఇచ్చుకుంది. ఇంతలో సన్నీ భర్త వచ్చి సర్ది చెప్పి పంపించి వేశాడట! 'ఆ వ్యక్తి సన్నీని బాగా హర్ట్ చేసే ప్రశ్న వేశాడు. అందుకే సన్నీ బ్యాలెన్స్ తప్పింది' అంటూ సన్నీ భర్త వివరణ ఇచ్చుకోవలసి వచ్చింది.




నన్ను చూస్తూ "ఎప్పుడొచ్చారు? బావుంది మీరు రావడం. పది రోజులైనా ఉండాలి" అన్నాడు.

"ఉంటాను"

"మూడు నాలుగు రోజుల్లో కొన్ని గొడవలు, కొన్ని మాటలు, కొన్ని వాదాలు అయ్యాక - మా బావకి తెలిసింది. తమ విడాకులు తప్పవని, చిత్రను పెళ్ళి చేసుకు తీరాలని.

మరుసటి రోజు "అన్నయ్యా, ఇవి అన్నీ అయ్యాక నేను హైదరాబాద్ వస్తాను" అంది నిమ్మీ.

"అన్నీ అయ్యేదాక నేనూ సెలవుపెట్టి ఇక్కడే ఉంటాను" అన్నాను నిమ్మీతో.

"అక్కర్లేదు. నేను 'లా' కూడా చదువుకున్నాను. మనిషి లొంగిపోయాడు. మా విడాకులు, చిత్ర పెళ్ళి అన్నీ అయ్యాక ఓ నెల్లాళ్ళలో మిమ్మల్నందర్నీ కలుస్తాను. నువ్వు వదిన, పిల్లల దగ్గరకు వెళ్ళు" అని నిమ్మీ నన్ను హైదరాబాద్ పంపించేసింది.

నలభై ఐదు రోజుల తర్వాత నిమ్మీ హైదరాబాద్ వచ్చేసింది.

విషయం తెలిసి అందరి వదనాల్లో విషాదం నిండింది.

మా నిర్మలలో చిన్నప్పటి నుండి ఉన్న స్థైర్యం మాలోని బెంగను మరిచిపోయేట్టు చేసింది.

నాలుగు నెలల తర్వాత నిమ్మీ ఇక్కడ కాలేజీలో టీచర్‌గా చేరింది.

ఆ తర్వాత రెండేళ్ళకు మా చెల్లాయి, నరసింగరావు ప్రేమించుకుని పెళ్ళి చేసుకున్నారు. అతనికి ఇక్కడే ఉద్యోగం.

ఇంకో రెండేళ్ళకి నిమ్మీ తల్లి అయింది. ఆ చిన్ని పాపకు 'బంగారు పాప' అన్న పేరు పెట్టుకున్నారు.

సంవత్సరాలు గడుస్తున్నాయి. బంగారుకు ఐదేళ్ళు.

నిమ్మీ తన శాఖకు 'చీఫ్' అయిన సందర్భంలో నరసింగరావు మా అందరికీ 'ట్రీట్' ఇస్తానని చెప్పి రెస్టారెంట్‌కు తీసుకువచ్చాడు.

జనం పెద్దగా లేరు.

మాకు దూరంగా మా వేపు వీపు పెట్టుకుని మా బావ, ఎదురుగా చిత్ర, నలుగురు పిల్లలు కూచుని ఉన్నారు. అతను మమ్మల్ని చూడలేదు. మమ్మల్ని చూస్తుండగానే చిత్ర కళ్ళు మెరిశాయి. ఒళ్ళు చేసింది. వాళ్ళకు ఎదురుగా పది, పన్నెండు ప్లేట్లలో తినే పదార్థాలు ఉన్నాయి. అందరూ తింటున్నారు.

ఇంతలో ఆ హోటల్ ఉద్యోగి ఒకాయన వచ్చి, మా బావతో ఏదో చెబుతున్నాడు. మా బావ, అతను బైటికి వెళ్ళారు.

అతను అలా వెళ్ళగానే చిత్ర మా దగ్గరకు వచ్చింది. నిమ్మీ పక్కన కూచుంది.

నిమ్మీ రెండు చేతులు తన చేతుల్లోకి తీసుకుని కళ్ళకు అద్దుకుంది చిత్ర. ఇద్దరి కళ్ళల్లోనూ నిలిచిన సన్నటి కన్నీటి పొర.

చిత్ర నాకేసి చూస్తూ "మీ బావకు తగిన శాస్తి చేస్తున్నాను. అతను ఎంత అందగాడో, ఎంత తెలివైనవాడో - అంత దొంగ, అంత గీర. ఆ గీర, గోరోజనం దింపేస్తాను. ఇంకా పూర్తిగా దింపేస్తాను. నేను కావాలనే నలుగురు పిల్లల్ని కన్నాను. నాలుగేళ్ళ క్రితం నాకు ఆపరేషన్ చేయిస్తానన్నాడు. నేను ససేమిరా ఒప్పుకోలేదు. తను చేయించుకోడానికి భయం. నన్నూ, నలుగురు పిల్లల్నీ వారానికి రెండు రోజులు హోటలుకు తీసుకు వెళ్ళకపోతే, పిల్లల్తో ఇల్లు పీకి పందిరేయిస్తాను. తప్పక తీసుకు రావాల్సిందే. బాగా పెద్ద బిల్లు చేస్తాం. ఇలాగ ఆ మనిషిని చాలా విషయాల్లో క్షోభ పెట్టాను. ఆ శాస్తికి తగినవాడు" అని తన 'టేబుల్' దగ్గరకు వెళ్ళిపోయింది.

ఆ చిన్ని రెస్టారెంట్‌లోకి ఇప్పుడు చాలా మంది జనం వచ్చేశారు. పెద్దగా మాటలు, కుర్చీలు బుర్రున లాగడం, చాలా గందరగోళంగా, కోలాహలంగా ఉంది.

అయినా నా మనసు, ఆలోచనలు చాలా స్థిమితంగా, ప్రశాంతంగా ఉన్నాయి.

మా బావ ఇంకా లోపలికి రాలేదు. అన్నట్లు మా బావకి తలలో రెండు సుడులు ఉన్నాయా అని నేనిప్పటిదాకా చూడలేదు. చూడను కూడా.

సెల్: ***094408 83812***



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో థైరాయిడ్ సమస్యలకు సరైన పరిష్కారం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



మన శరీరంలో ఉండే గ్రంథులలో థైరాయిడ్ గ్రంథి అతి ముఖ్యమైనది. ఈ గ్రంథి గొంతు భాగంలో ఉంటుంది. ఇది మన మెదడులోని హైపోథెలామస్, పిట్యుటరీ గ్రంథుల నియంత్రణలో ఉంటుంది. పిట్యుటరీ గ్రంథి నుండి వచ్చే T.S.H. (థైరాయిడ్ స్టిములేటింగ్ హార్మోన్) హార్మోన్, థైరాయిడ్ గ్రంథిని ఉత్తేజపరచడం ద్వారా T3, T4 హార్మోన్లు ఉత్పత్తి అయి రక్త ప్రసరణలో కలుస్తాయి. ఇలా నిరంతరం జరిగే వ్యవస్థ విఫలమైనప్పుడు, హార్మోన్ల అసమతుల్యత ఏర్పడి, తద్వారా థైరాయిడ్ హార్మోన్ల ఉత్పత్తి ఎక్కువ లేదా తక్కువ అవటం ఖచ్చితమైన సమస్యగా పరిణమిస్తుంది. ఈ రకమైన అసమతుల్యతలు హైపోథైరాయిడ్ లేదా హైపర్‌థైరాయిడ్ మరియు గాయిటర్ అనే దీర్ఘకాలిక సమస్యలకు దారి తీస్తాయి. థైరాయిడ్ హార్మోన్లు శరీరంలోని అన్ని జీవక్రియలను ప్రభావితం చేస్తాయి. ఉదాహరణకు: జీవ వ్యవస్థలైన ఎదుగుదల, కార్బోహైడ్రేట్, కొవ్వు పదార్థాల జీవ వ్యవస్థలు, బేసల్ మెటబాలిక్ రేట్ (BMR), శ్వాస వ్యవస్థ, గుండె, నాడీ, జీర్ణ వ్యవస్థ, ముఖ్యంగా సంతానోత్పత్తి వ్యవస్థ పైన దీని ప్రభావం ఉంటుంది.

హైపోథైరాయిడిజమ్: శరీరంలో థైరాయిడ్ హార్మోన్లు తక్కువ మోతాదులో ఉత్పత్తి కావడాన్ని హైపోథైరాయిడ్ అంటారు. ఏ వయస్సు వారిలోనైనా కనిపించే ఈ సమస్య సహజంగా పిల్లలు మరియు స్త్రీలలో ఎక్కువగా కనిపిస్తుంది.

లక్షణాలు:

- **పిల్లలలో:** బుద్ధి మాంద్యం, ఎదుగుదల లోపం, జ్ఞాపకశక్తి లేకపోవడం, మలబద్ధకం, చురుకుదనం కోల్పోవడం, వయస్సుకు మించి లావుగా ఉండటం.
- **స్త్రీలలో:** రజస్వల (మెనార్కి) ఆలస్యం అవటం, ఋతుచక్రం ఆలస్యం కావడం, అమెనోరియా, నెలసరిలో అధిక రక్తస్రావం లేదా అల్ప రక్తస్రావం కావటం వంటి లక్షణాలు కనిపించవచ్చు. ఈ సమస్య వలన స్త్రీలలో అండాశయం నుండి అండం విడుదలలో లోపాలు సంభవించి, ఇది సంతానలేమికి దారితీస్తుంది. ఒకవేళ గర్భం దాల్చినా పిండం యొక్క ఎదుగుదల లోపాలు మరియు గర్భస్రావం జరిగే అవకాశం ఎక్కువగా ఉంటుంది.
- **పురుషులలో:** ఈ సమస్య గల వారిలో T.S.H. హార్మోన్ స్థాయిలు పెరగడం, తద్వారా టెస్టోస్టిరాన్ హార్మోన్ స్థాయిలు తగ్గడం మరియు శుక్రకణాలు తక్కువగా ఉత్పత్తి అయి సంతానలేమికి దారితీస్తుంది.
- బరువు పెరగడం, BMR తగ్గిపోవడం, చర్మం పొడిబారడం, జుట్టు రాలడం, బద్ధకంగా ఉండటం, చలిని తట్టుకోలేకపోవడం, అర్టికేరియా అనే చర్మ సంబంధిత వ్యాధుల వంటి లక్షణాలు కనిపిస్తాయి.

హైపర్‌థైరాయిడిజమ్: థైరాయిడ్ గ్రంథి ఎక్కువ మోతాదులో థైరాక్సిన్ (T4) విడుదల చేయడం వలన కలిగే సమస్యను హైపర్‌థైరాయిడిజమ్ అని అంటారు.

లక్షణాలు:

- **స్త్రీలలో:** ఋతుచక్రంలో తేడాలు కలగటం, మరియు అధిక రక్తస్రావం కావడం జరుగుతుంది. ఈ సమస్యతో బాధ పడే వారిలో అండాశయం నుండి అండం విడుదలలో లోపం ఏర్పడుతుంది. తద్వారా ఇది సంతానలేమికి కారణమౌతుంది. ఒకవేళ గర్భం దాల్చినా గర్భస్రావం కావడం, నెలలు నిండకముందే ప్రసవించడం, పిండం ఎదుగుదల లోపాలు, మరియు గర్భధారణ సమయంలో అధిక రక్తపోటు కలగటం వంటి సమస్యలు గమనించవచ్చు.
- **పురుషులలో:** ఈ సమస్య వలన వృషణాల ఎదుగుదలలో లోపాలు ఏర్పడటం, శుక్రకణాల ఉత్పత్తి తగ్గడం, శుక్రకణాల కదలికలు తగ్గడం వంటి సమస్యలు కలగడం వలన ఇది సంతానలేమికి దారితీస్తుంది.
- ఆహారం సరైన మోతాదులో తీసుకున్నా బరువు తగ్గడం, నిద్రలేమి, గుండెదడ, అధిక చెమటలు, విరేచనాలు, చేతులు వణకడం, నీరసంగా ఉండటం వంటి లక్షణాలు గమనించవచ్చు.

థైరాయిడ్ సమస్యలకు గల కారణాలు: ప్రకృతి విరుద్ధమైన జీవన విధానం, అధిక మానసిక ఒత్తిడి, సరైన శారీరక వ్యాయామం లేకపోవడం, పౌష్టికాహార లోపం, అయోడిన్ లోపం, థైరాయిడ్ గ్రంథిని కొద్దిగా తొలగించడం మరియు పిట్యుటరీ గ్రంథిలో వచ్చే వ్యాధుల వలన ఈ థైరాయిడ్ సమస్యలు వస్తాయి.



నిర్ధారణ పరీక్షలు: థైరాయిడ్ ప్రొఫైల్ - T3, T4, T.S.H., యాంటీ థైరాయిడ్ యాంటీబడీస్, USG ఆఫ్ థైరాయిడ్ గ్లాండ్, గొంతు యొక్క CT స్కాన్ వంటి పరీక్షలు చేయించడం ద్వారా థైరాయిడ్ వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే లభించే కాన్స్టిట్యూషనల్ హోమియోవైద్యం ద్వారా అన్ని రకాల థైరాయిడ్ సమస్యలను పరిష్కరించవచ్చు. 'హోమియోకేర్' వారి ఆధునిక కాన్స్టిట్యూషనల్ హోమియోవైద్యం ద్వారా రోగి వ్యక్తిగత స్థితిగతులకు అనుగుణమైన మందులను సూచిస్తారు. తద్వారా ఈ సమస్య రావడానికి గల మూలకారణాన్ని గుర్తించి సమస్యను పూర్తిగా నయం చేయటం జరుగుతుంది. జీవితకాలం పాటు మందులు వాడే పని లేకుండా, థైరాయిడ్ హార్మోన్ సమస్యలను సంపూర్ణంగా నయం చేయవచ్చు.



# ఆకాశం నీ హద్దురా అవకాశం వదలొద్దురా

**"సృష్టిలో మానవుడు అత్యద్భుత ప్రాణి. ఎన్నో తెలియని అపురూపశక్తులు మనిషిలో నిక్షిప్తమై ఉన్నాయి. శిఖరాలకు ఎదగాలంటే తన "లో" ఉన్న ఆ అద్భుత శక్తిని సరైన కార్యాచరణలో పెట్టాలి. అదే 'విజయం'.**

**-వివేకానంద**

దాదాపు ముప్పయ్ ఏళ్ళక్రితంనాటి పౌరాణిక చిత్రం "బాలభారతం". అందులో ఘంటసాల పాట అందరికీ తెలిసిందే. "మానవుడే మహనీయుడు/శక్తియుతుడు యుక్తిపరుడు /మానవుడే మహనీయుడు/గ్రహరాశుల నధిగమించి/ఘన తార పదము నుంచి/గగనాంతర రోదసిలో గంధర్వ గోళ తతుల దాటి../చంద్రలోకమైనా, దేవేంద్రలోకమైనా.../బొందితోజయించి మరల భువికి తిరిగి రాగలిగే../. మానవుడే మహనీయుడు."

మనిషి శక్తి సామర్థ్యాల్ని ఈ పాటలో పరిపూర్ణంగా ఆవిష్కరించిన రచయిత ఊహాశక్తి గురించి ఆలోచించండి. రోదసిలోకి ఎగిరినా, గ్రహాంతర నౌకలు కనిపెట్టినా, అగాధాలు శోధించినా, జలాంతర్గాములు ప్రవేశపెట్టినా, విశ్వసమాచారాన్ని చిన్నచిప్‌లో పొందుపరచినా, సృష్టికి ప్రతిసృష్టిచేయగల శక్తిసామర్థ్యాలు మనిషికి తప్ప, మరే ప్రాణికీ లేవు.

ఈ అద్భుతాల్ని సృష్టిస్తున్నది మనలాంటి మనుషులే. వీళ్ళంతా మరో గ్రహం నుండి దిగి రాలేదు. మన మధ్యే ఉంటూ, నిరంతర కఠోర శ్రమతో తమలో నిద్రిస్తున్న శక్తి సామర్థ్యాల్ని మేల్కొలిపి, వెలికితీసి, వెలుగులోకి తెచ్చి అసాధ్యాల్ని సుసాధ్యాలు చేస్తున్నారు. అలాంటి వ్యక్తులే మహనీయులవుతున్నారు.

**"ఏదో చేద్దామని కలగని, దాన్ని కలలాగే మరిచిపోకండి. కల సాకారం చేసుకోవడం ప్రారంభించండి. మీలో ఉన్న ప్రతిభ వెలుగు చూస్తుంది".**

**-ఎమర్సన్**

### ఆకాశం నీ హద్దురా!

"ఆకాశం నీ హద్దురా! అవకాశం వదలొద్దురా!" అన్నారు శ్రీశ్రీ. వచ్చిన అవకాశం వదులుకుంటే, చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టే. జీవితంలో ఒక్కక్షణం కోల్పోయినా వెనక్కి తీసుకోలేం. ప్రతి వ్యక్తిలోనూ ఏదో ఒక ప్రత్యేకత ఉంటుంది. ఆ శక్తిని సరైన సమయంలో వెలికి తీయగల్గడమే నైపుణ్యం. అందుకు తగిన అవకాశాలు, ప్రకృతి వనరులు మన చుట్టూ ఉన్నాయి. మన ఊహకందని ప్రకృతిని మనలో నిద్రిస్తున్న శక్తితో కలిపి, సరైన సమయంలో కార్యాచరణలో పెట్టగల్గితే అద్భుతాలు పురుడు పోసుకుంటాయి. ఎన్నోవేల సంవత్సరాల శాస్త్ర పరిశోధనలే ఈ అద్భుత ఆవిష్కరణలకు తార్కాణం.

### మనోదౌర్బల్యం వద్దు

చాలామంది నిరాశ, మనో దౌర్బల్యాలతో జీవిస్తారు. సమస్యలన్నీ తమనే పట్టి పీడిస్తున్నట్టు భావిస్తారుతప్ప, బయటపడే ప్రయత్నం చెయ్యరు. అలాంటి వారంతా, అంగవైకల్యం ఉండి అద్భుత నాట్యప్రదర్శనలిచ్చిన నాట్య మయూరి సుధాచంద్రన్‌ని గుర్తు తెచ్చుకోవాలి. నిరాశ, నిస్పృహకు గురై ఆత్మహత్యకు పాల్పడే విద్యార్థులు గుర్తుంచుకోవాల్సింది ఒక్కటే. "ఏమీ సాధించకుండా బలవంతంగా ప్రాణాలు కోల్పోవడానికేనా ఇంతటి అత్యుత్తమమైన జన్మఎత్తింది? అలాంటి ఆలోచనలున్నవారు ఈ క్షణమే వాటిని చెరిపెయ్యండి.

### అంతర్గత శక్తిని గుర్తించాలి

మీనమేషాలు లెక్కిస్తూ కూచునేబదులు మన లోపలి శక్తుయుక్తుల్ని తెలుసుకునే ప్రయత్నం చెయ్యటం ముఖ్యం. జరగబోయేది మనకు తెలియదు. గతం తిరిగిరాదు. ఇక మిగిలింది మన అంతర్గత శక్తుల్ని వెలికి తీయటమే. అదే వర్తమానం. వర్తమానంలో జీవిస్తూ, మనలో నిద్రాణమైన శక్తిని గుర్తించడమే వ్యక్తి విజయానికి తొలి అడుగు.

### ఐన్‌స్టీన్ అద్భుతసృష్టి

యాపిల్ రాలి కిందపడటం ఒక సాధారణ దృశ్యం. కానీ ఐన్‌స్టీన్ ఏ క్షణమైతే తనలోని శక్తికి కొత్త ఆలోచన జోడించి విభిన్నంగా ఆలోచించగలిగాడో అదే వర్తమానం. ఆ వర్తమానంలో ఉద్భవించినదే $E=mc2$.

అందుకే ఐన్‌స్టీన్ ఒక మాటన్నారు. "ప్రకృతి ఎప్పుడో గాని తన అపురూప రహస్యాల్ని మనకు అందించదు. దానిని అందుకోగల్గిన వారే అద్భుతాల్ని సృష్టించగలరు" అని.

### అన్నీ మన చుట్టూనే

ఇతరులు సాధించిన అద్భుత విజయాల్ని, వారి కఠోర శ్రమను అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తే మనమూ ఎంతో కొంత వాళ్ళమార్గంలో సాధన చెయ్యడానికీ, పురోగతి సాధించడానికీ అవకాశం ఉంటుంది. విజేతలకు అవకాశాలూ, వనరులూ ఆకాశం నుండి ఊడి పడలేదు. అవకాశాలు మనచుట్టూ పరిభ్రమిస్తూనే ఉంటాయి. విజేతలు మన మధ్యే సంచరిస్తారు. ఎప్పుడైనా అలాంటి వారిని గమనించారా? అరే! వీడు... మనవాడే" అని విజేతను ప్రశంసించడం అందరూ చేసేదే. ఆ విజయం వారిని ఎలా వరించిందో ఆలోచిస్తే మనలో లోపం బోధపడుతుంది.

### మనలోని లోపాలు

బద్ధకం, నిస్సత్తువ, చొరవ లేకపోవడం, నిస్స



## హోమియో లైఫ్

డా॥ A.M.రెడ్డి
పాజిటివ్ హోమియోపతి
డాక్టర్ కన్సల్టేషన్ కొరకు :
92462 82802
www.positivehomeopathy.com



# సోరియాసిస్ - హోమియో చికిత్స

దీర్ఘకాలం పాటు బాధించే మొండి చర్మవ్యాధులలో సోరియాసిస్ ముఖ్యమైనది. వాడుకలో దీనిని "కింగ్ ఆఫ్ స్కిన్ డిసీజ్" అని కూడా అంటారు. సత్వర పరిష్కారాల కోసం చూడకుండా శాశ్వత సాంత్వన చర్యలు చేవట్టి హోమియోపతిలోని కాన్స్టిట్యూషనల్ పద్ధతిలో వైద్యం తీసుకుంటే ఈ వ్యాధి మీద అంతిమ విజయం సాధించవచ్చు.

**సోరియాసిస్ అంటే :** సోరియాసిస్ వ్యాధిగ్రస్తులలో చర్మంపై దురదతో కూడిన వెండి రంగు పొలుసులు కన్పిస్తాయి. ఈ వ్యాధి ప్రభావం చర్మం మీద మాత్రమే కాకుండా గోళ్లు, తల తదితర శరీర భాగాలు కూడా వ్యాధి ప్రభావానికి లోనవ్వవచ్చు. మొదట్లో సోరియాసిస్ మచ్చలు ఎర్రగా, కమిలిపోయినట్లు కనిపించిన సమయం గడిచేకొద్దీ ఈ మచ్చల పైన చేప పొలుసులను పోలిన తెల్లని పొలుసులు మందంగా పేరుకుపోతాయి. ఆ పొలుసులను తొలగిస్తే అడుగున రక్తపు చారికలు కనిపిస్తాయి. దురద ప్రధాన లక్షణం కాదు, కానీ వాతావరణం చల్లగా ఉండి, తేమ తగ్గినప్పుడు దురద ఎక్కువ అవుతుంది.



**ఎలా వస్తుంది ?** మామూలుగా ఆరోగ్యవంతులలో చర్మం ఉపరితలం క్రింద క్రొత్త కణాలు నిరంతరం తయారవుతుంటాయి. సుమారు నెల రోజులకు ఇవి వెలుపలకు చేరుకుంటాయి. ఇలా పై పొరగా ఏర్పడినవి క్రమంగా నిర్జీవమై పొలుసులుగా ఊడిపోయి క్రింద కణాలు బహిర్గత పరుస్తాయి. సోరియాసిస్ వ్యాధిలో ఈ ప్రక్రియ అవ్వడం తప్పుతుంది. చర్మపు కణాలు వేగంగా తయారయి 3-4 రోజులకే వెలుపట పొరకు చేరుకుంటాయి. అదనపు కణ సముదాయానికి పోషక తత్వాలను అందించే నిమిత్తం రక్త సరఫరా పెరుగుతుంది. దీనితో చర్మంమీద ఎర్రని పొర తయారవ్వడం పొలుసులు ఏర్పడడం జరుగుతుంది.

**ఎందుకు వస్తుంది?** వ్యాధి నిరోధక శక్తి వికటించి స్వయం ప్రేరితంగా మారడం వలన సోరియాసిస్ వస్తుందని పరిశోధనలు చెపుతున్నాయి. దీనిని అర్థం చేసుకోవడానికి వ్యాధి నిరోధక శక్తి గురించి కొంత తెలుసుకుందాం. వైరస్, బ్యాక్టీరియా వంటివి శరీరం మీద దాడి చేసినప్పుడు వాటినుండి రక్షణ పొందడానికి మన శరీరంలో W.B.C.(తెల్ల రక్త కణాలు) అనే ప్రత్యేకమైన రక్తకణాలు పనిచేస్తుంటాయి. ఇవి అవసరమైన ప్రాంతాలకు వెళ్లి ఇన్ఫెక్షన్‌ను తగ్గించడమే కాకుండా గాయాలు మానేలా చేస్తాయి. దీనిని వ్యాధి నిరోధక శక్తి అంటారు. ఈ నేపథ్యంలో అనుబంధ అంశంగా ఇన్‌ఫ్లమేషన్ (ఎరుపుదనం, వాపు) తయారవుతుంది.

సోరియాసిస్‌లో వ్యాధి నిరోధక శక్తి అవక్రమంగా తయారవుతుంది. ఇది శారీరక కణజాలాన్ని అన్యపదార్థంగా అన్వయించుకుని దాడిచేసి ఇన్‌ఫ్లామేషన్‌ని కలిగిస్తుంది. సోరియాసిస్ వ్యాధి ప్రక్రియలో W.B.C. లోని β కణాలు యాంటీబాడీస్‌ను తయారు చేస్తాయి. ఇవి ఆరోగ్యంగా ఉండే కణాల మీద దాడి చేస్తాయి. W.B.C. లోని T కణాలు సైటోకిన్స్ అనే పదార్థాన్ని ఎక్కువ మొత్తాలలో విడుదల అయ్యేలా చేస్తాయి. సైకోటిన్స్ అనేవి చర్మకణాలు అదుపు తప్పి పెరగకుండా చేసే యంత్రాంగాన్ని దెబ్బతీస్తుంది. ఫలితంగా చర్మకణాలు అనియంత్రతంగా పెరిగి పొలుసులుగా తయారవుతాయి.

**సోరియాసిస్ మరియు వంశపారంపర్యత:** కొన్ని కుటుంబాలలో సోరియాసిస్ అనివంశికంగా నడుస్తుంది. తల్లిదండ్రులలో ఇద్దరికీ ఉంటే 30 శాతం, ఒకరికే ఉంటే 15 శాతం పిల్లలకు వచ్చే అవకాశం ఉంటుంది. అయితే కుటుంబంలో ఎవరికీ లేకపోయినప్పటికీ ఈ వ్యాధి హఠాత్తుగా మొదలవుతుంది. దీనికి జన్యుపరమైన అంశాలు కారణం. సోరియాసిస్ అంటువ్యాధి కాదు. ఒకరినుండి మరొకరికి వ్యాపించదు.

**సోరియాసిస్‌లో రకాలు ?** సోరియాసిస్ వ్యక్తమయ్యే విధానాన్ని బట్టి 5 రకాలుగా వర్గీకరించారు.

▪ ప్లేగు సోరియాసిస్ ▪ గుట్టేట్ సోరియాసిస్ ▪ పస్టులర్ సోరియాసిస్ ▪ ఇన్‌వర్సివ్ సోరియాసిస్ ▪ ఎక్ట్రోడర్మిక్.





**సోరియాసిస్‌ను తీవ్రతరం చేసే అంశాలు:** చల్లని పొడి వాతావరణం ▪ మానసిక ఒత్తిడి ▪ కొన్నిరకాల మందులు (మలేరియా మందులు, లితేలమౌ, బీటా బ్లాకర్స్, యాంటి) ▪ ఇన్‌ఫెక్షన్స్ మరియు ఇతర వ్యాధులు ▪ అలవాట్లు ▪ హార్మోన్ తేడాలు ▪ ఆహార పదార్థాలు : ఉదా : గ్లూటెన్ ఎక్కువగా ఉండే ఆహారం.

**కాంప్లికేషన్స్ :** సోరియాసిస్‌ను ఒక చర్మవ్యాధిగా మాత్రమే గుర్తిస్తే అది తప్పు. దీనివలన సాధారణంగా ప్రాణప్రమాదం జరగదు. కాని వ్యాధి తీవ్రత వలన, దీర్ఘకాలం బాధించడం వలన బాధితులు డిప్రెషన్‌కు లోనవుతారు. ఇది వ్యాధి తీవ్రతను మరింత పెంచుతుంది. సోరియాసిస్‌లో ఇలా వికటించిన వ్యాధి నిరోధక శక్తి వలన సోరియాటిక్ ఆర్థ్రైటిస్ వచ్చే ప్రమాదం ఉంది. ఈ వ్యాధికి అనుబంధ అంశంగా కల ఇన్‌ఫ్లమేషన్ వలన సోరియాసిస్‌తో బాధపడే వారికి హార్ట్‌ఎటాక్ మరియు స్ట్రోక్ వంటివి వచ్చే అవకాశం ఉంటుంది. ఇవేకాక ఈ వ్యాధిగ్రస్తులతో డయాబెటిస్ మరియు రక్తపోటుకు గురయ్యే అవకాశం కూడా ఎక్కువే.

**కాన్స్టిట్యూషన్ పద్ధతిలో సోరియాసిస్ నివారణ గురించి తెలుసుకుందాం :** కాన్స్టిట్యూషనల్ విధానం ద్వారా మందులు ఇవ్వడం అంటే ఒకవ్యక్తి మానసిక శారీరక పరిస్థితులే కాకుండా ఎమోషనల్ పరిధిని కూడా పూర్తిగా అర్థం చేసుకుని మందులు ఇవ్వడం. తర్వాత ఏయే పొటెన్సీలో ఎంత డోస్ ఇవ్వాలి అనేది ముఖ్యం.

కాన్స్టిట్యూషనల్ విధానం ద్వారా సరైన మందులు, పొటెన్సీ, డోస్ ఇచ్చినప్పుడు వ్యాధి పూర్తిగా నివారించబడుతుంది.

"వ్యాధి తీవ్రతను బట్టి చికిత్సా కాలం నిర్ధారించబడుతుంది"

హాయత, సమస్యల్ని పరిష్కరించుకోలేని సోమరితనం, నిరాసక్తత, ఎవరోవస్తారన్న ఎదురుచూపు, షార్ట్‌కట్స్, రికమండేషన్ల కోసం వెదుకులాట, గతం తలపోస్తూ కలలు కనటం, అనుభవంలేని నిర్ణయాలు, అమలు చెయ్యలేని కార్యాచరణ, అరిషడ్వర్గాలు, వ్యసనాలు... లాంటివన్నీ అందుబాటులోఉన్న అవకాశాలనుంచి మనల్ని విజయానికి దూరంగా తీసుకెళ్లే లోపాలేనని గుర్తించాలి.

మనలోని అంతర్గతశక్తి వెలికిరాకపోవడానికి ప్రయత్నలోపమే ప్రథమ అవరోధమని గుర్తించాలి.

**సమీక్ష**

అంగవైకల్యము ఉన్న వ్యక్తులు అద్భుతాలు సాధిస్తుంటే, అన్ని అంగాలూ ఉన్న మనలో విజయ సాధనకున్న లోపాలేంటో సమీక్షించుకోవాలి.

**"ప్రతి ఒక్కరూ భయం, న్యూనతా భావం విడనాడితే, అత్యున్నత స్థాయికి ఎదిగేశక్తి లభిస్తుంది. ఉన్నతంగా ఎదగాలన్న సంకల్పమే మనల్ని శక్తిమంతులుగా మారుస్తుంది.**

**-వివేకానంద**

వెయ్యిమందిలో ఒకడుగా పోటీపడి ఆ ఉద్యోగం నాకే ఎందుకు రాకూడదు? అర్హత ఉండబట్టే ఇంటర్వ్యూ వరకూ రాగల్గాను కదా అనే విశ్వాసంతో ఉండాలి.

ప్రయత్నం పట్టుదలని ప్రేరేపిస్తే, ఆ పట్టుదల ప్రతిభను వెలికితీస్తే, ఉద్యోగం మనదే అవుతుంది.

ప్రయత్నమే విజయానికి మలి అడుగు.

## హేట్సాఫ్



విజయానికి రాజముద్ర పద్మశ్రీ ఎస్.ఎస్. రాజమౌళి. కోడూరి శ్రీశైల శ్రీ రాజమౌళి. వైద్యుడి కంటే వేగంగా ప్రేక్షకుల నాడి తెలుసుకోగలిగినవాడు. సక్సెస్‌ని కేరాఫ్‌గా మార్చుకున్న ఈ జక్కన్న తన ఉలితో మలిచిన సినీ శిల్పాలన్నీ కాల్పనిక కళాఖండాలే. అపజయం ఆయన్ని చూస్తే హడలిపోతుంది.

"నా సినిమాలెందుకు హిట్టవుతున్నాయో కచ్చితంగా చెప్పలేనుగానీ"కష్టించి పనిచెయ్యడమే" నా ఈ స్థాయికి కారణం" అంటారాయన. కర్నాటక రాయచూర్‌లో జన్మించిన రాజమౌళి ఏలూరులో చదువుకున్నారు. బాల్యం నుండే సినిమా వ్యామోహం, కథా చర్చలు, ఊహలు, ఫాంటసీ, భారీతనం.. ఇవన్నీ ఆయన తపనకు అంకురాలు.

ఇంటర్ వరకూ చదువు. సినీ రంగంలో రకరకాల శాఖల్లో పని చెయ్యడం, తండ్రి చెన్నైలో సినీరచయిత కావటం, తద్వారా ప్రముఖుల పరిచయం, ఏదో సాధించాలనే పట్టుదల ఆయన్ను విజేతగా తీర్చిదిద్దాయి.

"చిత్ర పరిశ్రమలో ఎవరి కష్టం వాళ్ళది. ఎవరి ప్రయత్నం వాళ్ళది. ఎవరి విజయం వాళ్ళదే" అని హైదరాబాద్ వచ్చి తెల్సుకోవటంతో క్రమంగా పరిచయాలు పెరిగాయి. రాఘవేంద్రరావుగారి టి.వి. సీరియల్ 'శాంతి నివాసం'తో కెరీర్ ప్రారంభించి రోజుకి 18 గంటలు శ్రమించడం, రాఘవేంద్రరావుతో 'పని రాక్షసుడు' అన్పించుకోవడం, ఆ రాక్షసత్వమే 'స్టూడెంట్ నెం.1' సినిమా అవకాశం వచ్చేట్టు చేసింది. అదే ఆయన జీవితాన్ని మలుపు తిప్పింది. ఇక విజయ పరంపర ప్రారంభించాడు. 'బాహుబలి' తో ఆయన స్టామినా ప్రపంచ వీక్షకుల్ని అబ్బుర పరిచింది.

రాజమౌళి ప్రతిభకు గుర్తింపుగా భారత ప్రభుత్వం 'పద్మశ్రీ' పురస్కారం-2016 ప్రకటించడం ఆయన శ్రమకి దక్కిన గౌరవం. 'కృషితో నాస్తి దుర్భిక్షం' అన్న నానుడికి... పని రాక్షసత్వానికి.. హద్దులేని విజయాలకి ప్రత్యక్ష ఉదాహరణ రాజమౌళి. ఎందరికో అతడు స్ఫూర్తి.

-హేట్సాఫ్

**ఆలోచన**

మనలోని ఆలోచనాశక్తిని పరిపూర్ణంగా ఉపయోగించుకోకుండా స్తంభింపచేస్తే ట్రెడ్‌మిల్ మీద పరుగులా, ఉన్నచోటే ఉండిపోతాం. వాక్యానికి ఫుల్‌స్టాప్ పెట్టేస్తే మహాకావ్యాలెలా ఆవిర్భవిస్తాయి? మనలో నిద్రిస్తున్న సదాలోచనలకు ఫుల్‌స్టాప్ పెట్టకుండా కొనసాగిస్తే, ఏ క్షణాన్నైనా మనమే అద్భుతాలు సృష్టించవచ్చు.

**రేపటి తరం ఆలోచన**

ఐన్‌స్టీన్ మొదలు అబ్దుల్ కలాం వరకూ లక్షల మంది గురించి మనం చదువుకున్నాం. వారి ఆవిష్కరణల ఫలాల్ని అనుభవిస్తున్నాం.

కానీ రేపటి వేరబుల్ టెక్నాలజీ ఎన్ని అద్భుతాల్ని ఆవిష్కరించబోతోందో! రేపటి తరపు ఆలోచనలు ఊహకందని విధంగా స్మార్ట్‌వాచ్, స్మార్ట్ షూల ద్వారా ప్రకటనలు, కళ్ళజోడు ద్వారా పరిసరాల పరిస్థితులు తెల్సుకోవటం, ఐడీ కార్డు శరీరంలోనే అమర్చడం ఉంగరం-వాచీల్లో టెక్నాలజీ ఇమిడిపోవటం, మన రుచికి తగ్గ వంటల్ని స్మార్ట్‌కిచెన్ సిద్ధం చెయ్యటం, మద్యం ముట్టుకోబోతే మీకు లివర్ సమస్యలున్నాయని హెచ్చరించే టెక్నాలజీ వంటివెన్నో రావచ్చు.

**మీరు మీరుగా...**

సచిన్ టెండూల్కర్, ఎ.ఆర్.రెహ్మాన్, సుందర్ పిచ్చై, రాజమౌళి తదితరులు ప్రావీణ్యమున్న తమ తమ రంగాల్లో ఉన్నత శిఖరాలు అధిరోహిస్తున్నారు. అనుభవంలేని రంగాల్లో తలదూర్చి విజేతలు కావాలని వారు కోరుకోవటం లేదు. అభిరుచి ఉన్న రంగాల్లో విజేతలై పిన్న వయసులోనే 'భారత రత్నాలు'గా ఎదిగి విజయానికి విలాసాలవుతున్నారు. మీరు.... మీరుగా ప్రయత్నిస్తే మీలోని శక్తి, మిమ్మల్ని విశ్వవిజేతల్ని చేస్తుందేమో ప్రయత్నం మొదలు పెట్టండి.

*(ఇంకావుంది)*

### నిన్నాపగల శక్తిలేదు!

- వినయం, సంసిద్ధత, ఆదర్శం పట్ల ప్రేమ, కార్యాచరణ ఉంటే నిన్నాపగలిగే 'శక్తి'... ప్రపంచంలో లేదు.
- తెలివైన వ్యక్తి కనిపించే వాటికంటే ఎక్కువ అవకాశాలు సృష్టించుకుంటాడు.
- కోరిక ముఖ్యం గాదు. విజయ సాధనకు చేసే ప్రయత్నమే ముఖ్యం.
- అభిరుచి ఉన్న రంగంలో ఆకాశాన్ని హద్దుగా ఎంచుకో. అప్పుడు 'విజయం' నీ ప్రయాణంలో ఓ భాగమవుతుంది.
- సాధించాలనుకుంటే చాలదు. శ్రమించేశక్తి కావాలి. అది మనలోనే ఉందని గ్రహించి, ఉపయోగించుకోవటమే విజయం.
- బాగా వికసించినప్పుడే పూలు కోసుకోవాలి. ఆలస్యం చేస్తే వాడి, నేలరాలిపోతాయి.
- ప్రతికూల పరిస్థితుల్ని చక్కదిద్దే ప్రయత్నం చేసేవారు వాటిని తమకనుకూలంగా మార్చుకుని విజేతలవుతారు.
- సక్సెస్ గురించి ఆలోచించకు. శక్తివంచన లేకుండా శ్రమించు. సక్సెస్ నీకు అండగా ఉండబట్టే శ్రమించగలుగుతున్నామని గ్రహించు.
- ప్రపంచాన్ని నడిపించేది వ్యక్తులు కాదు. వ్యక్తుల ఆలోచనలే. వాటికి హద్దు విధించకు.



# కిడ్నీలో రాళ్ళు

మూత్రపిండాల్లో రాళ్ళు ఏర్పడటం అనేది ఈ మధ్యకాలంలో చాలా ఎక్కువగా జరుగుతుంది. ఒక సర్వే ప్రకారం భారతదేశంలో పురుషుల్లో 10.6% మందిలో మరియు స్త్రీలలో 7.1% మందిలో ఈ సమస్యతో బాధపడుతున్నారు. దీనికి మారిన జీవనశైలి, ప్రపంచ ఆధునీకరణ, మారిన ఆహార అలవాట్లు, స్థూలకాయం వంటివి ప్రధాన కారణాలుగా భావించవచ్చు. ఇది మన శరీరం యొక్క భారీ కర్మాగారం. ఇందులో నిరంతరం రకరకాల జీవక్రియలు జరిగిపోతూనే ఉంటాయి. వీటిని బయటకు పంపించంటంలో మూడు అవయవాలు కీలకపాత్ర పోషిస్తుంటాయి. మూత్రపిండాలు, ఊపిరితిత్తులు, చర్మం ఈ మూడు ముఖ్యమైన విసర్జక అవయవాలు. మళ్ళీ వీటిలో కూడా 90% మలినాలను విసర్జించేవి మూత్రపిండాలే. మూత్రపిండాలు రక్తంలోని విషపదార్థాలను అదనంగా ఉన్న నీటిని క్రమంగా తొలగిస్తుంటాయి. మన కిడ్నీలు ప్రతీరోజు 200 లీటర్ల రక్తాన్ని వడపోస్తాయి.

నేటి ఉరుకు పరుగుల జీవితాల్లో చాలామంది సరిపడా నీళ్ళు కూడా తాగలేకపోతున్నారు. ఫలితంగా ఈ కిడ్నీ రాళ్ళతో సతమతమయ్యే వారి సంఖ్య నానాటికీ పెరిగిపోతుంది. చాలా సందర్భాల్లో ఈ రాళ్ళు చాలా చిన్నవిగా ఉంటూ మూత్రంలో విసర్జింపబడతాయి. కొన్ని సందర్భాల్లో రాళ్ళు పరిమాణం పెద్దగా ఉండటం కాని, మూత్రనాళాల్లో చిక్కుకొని తీవ్రమైన నొప్పిని కలిగిస్తాయి.

**కారణాలు:** అధిక బరువు, ద్రవపదార్థాలు తీసుకోకపోవటం. మూత్రఅవయావాల్లో వచ్చే ఇన్‌ఫెక్షన్. నీరు తగినంత తాగకపోవడం. జన్యుపరమైన ఇన్‌ఫెక్షన్‌లు. ఎక్కువగా వేడి వాతావరణంలో ఉండటం. వంశపారంపర్యం. కొన్ని రకాల మందులు వాడటం.

**లక్షణాలు:** పొత్తికడుపులో తీవ్రమైన నొప్పి, నీరసం, వికారం, తీవ్రమైన జ్వరం, విపరీతమైన చమటలు, బరువు తగ్గడం. మూత్రంలో రక్తంపడటం (దీన్ని హిమచ్యూరియా అంటారు) మూత్రంలో మంట రావటం. మూత్రంలో చీము రావడాన్ని పైయూరియా అంటారు.




**జాగ్రత్తలు:** నీటిని ఎక్కువగా తాగాలి, నీరుగాని ఇతర ద్రవ పదార్థాలు గాని మొత్తంగా కలిపితే రోజుకు 4 లీటర్లు తగ్గకుండా తీసుకోవాలి. కిడ్నీలో అప్పటికీ ఆక్సలేట్ రాళ్ళు ఉంటే, ఆక్సలేట్ ఉండే పదార్థాలు అంటే చాక్‌లేట్, పాలకూర, సోయా, ఎండు చిక్కుడు ధాన్యాలాంటివి తీసుకోకుడదు. కాల్షియం సిట్రేట్‌కు కిడ్నీలో రాళ్ళు ఏర్పడకుండా నివారించే లక్షణం ఉంది కాబట్టి అవి శరీరానికి అందేలా ఆహార నియమాలను పాటించడం మంచిది. కూల్‌డ్రింకులను అస్సలు తాగకూడదు.



డా. మురళి అంకిరెడ్డి
M. D (Homeo)
స్టార్ హోమియోపతి

**నిర్ధారణ పరీక్షలు:** కిడ్నీ ఎక్స్‌రే, అల్ట్రాసౌండ్ స్కాన్ & కిడ్నీ పరీక్ష, రక్తపరీక్ష, మూత్ర పరీక్ష.

**హోమియో చికిత్స:** హోమియోపతిలో శారీరక, మానసిక, లక్షణాలను పరిగణలోకి తీసుకొని ఎలాంటి సర్జరీ అవసరం లేకుండానే కిడ్నీలోరాళ్ళు పరిమాణం మరియు అవి ఏ వైపున ఏర్పడ్డాయో వాటి ఆధారంగా మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. ముఖ్యంగా బెరిబెరి వల్గరీస్, సరసపరిల్ల, కల్కేరియకార్బ్, కోలోసింత్ మందులను డాక్టర్ పర్యవేక్షణలో వాడాలి.



# డయాబెటీస్ - ఆయుర్వేదం

ఎవరు చెప్పారు? డయాబెటీస్ వ్యాధి ఇక జీవితాంతం సమస్య అని, ఇప్పుడు స్టార్ ఆయుర్వేద మీకొరకు తీసుకొని వచ్చింది. ప్రపంచ ప్రామాణికమైన అత్యున్నత సౌకర్యాలు కలిగిన వైద్యం. దీనితో మీ సమస్యలన్నీ పరిష్కారమవుతాయి. ఈ రోజు భారతదేశంలో ప్రతి 100 మందిలో 14 మంది డయాబెటీస్ బారిన పడుతున్నారు. ఈ వ్యాధి దుష్ఫలితాలు. విపరీతమైన దాహం. అధిక మూత్రవిసర్జన. ఆకలి ఎక్కువగా ఉండటం, ఎంత ఆహారం తీసుకున్నా శక్తి లేక పోవడం. బలహీనంగా ఉండటం. బరువు తగ్గడం, నీరసం, నిస్సత్తువ, చూపు మందగించటం, మబ్బుగా, మసకగా కనిపించటం, ఎక్కువ అలసట, కాళ్ళు లాగడం, ఏదైనా దెబ్బలు (గాయాలు) తగిలితే త్వరగా తగ్గక పోవడం. కొన్నేళ్ళ తర్వాత శరీరం లోని గుండె, మెదడు, కాళ్ళు, చేతలలోని పెద్ద రక్తనాళాలు దెబ్బ తినడం. చిన్న రక్తనాళాలు దెబ్బతిన్నందు వల్ల కంటిలోని రెటీనా దెబ్బ తినటం. నరాల బలహీనత, కళ్లుమంటలు, మానసిక, సెక్స్ సమస్యలు.నిత్యం వాడే షుగర్ వ్యాధి నిరోధక పాశ్చాత్య రసాయనాలు చర్మంమీదమచ్చలు, తలనొప్పి, జీర్ణ సంబంధిత సమస్యలకు కారణమవుతా యి. దాంతో పాటు అవాంఛిత ఫలితాలు కలగవచ్చు. కానీ ఆయుర్వేదంతో ప్రతికూల ఫలితాలుండవు. ఇది ఎంత ప్రభావపూర్వకమో, అంత శాశ్వతంకూడా. ఇప్పుడు స్టార్ ఆయుర్వేద సరికొత్త ఫార్ములాతో మీ ముందుకు వచ్చింది. ప్రకృతిలో ఉన్న వన మూలికలనుపయోగించి, 36సం॥ల అనుభవంతో లక్షలమంది పేషెంట్లకు ఉపశమనం కలిగించిన మందులు ఇప్పుడు మీఅందుబాటులోకి వచ్చాయి. మీరు ఎన్నేళ్ళ నుండి బాధపడుతున్నారు, ఇది అనువంశి కమా లేదా మానసిక ఒత్తిడి వల్ల వచ్చిందా? రోగలక్షణాలకు మీ వ్యాధి తీవత్రకు మా నిపుణులైన డాక్టర్లు అమూలాగ్రం పరిశీలించి, మందులు ఇస్తారు. ఈ మందులు మొదలు పెట్టాక వాటిని మెల్లమెల్లగా పాశ్చాత్య రసాయనిక మందులు తగ్గించబడతాయి. ఈ అత్యాధునిక ఫార్ములాతో కూడిన మందులు వల్ల మీకు సరికొత్త జీవితం ఖాయం. డయాబెటీస్‌ను వ్యాధిగా భావించకండి. అది కేవలం మీరు చేయవలసిన జీవితవిధానాలలో మార్పులను సూచిస్తుంది. మీ జీవితంలో మార్పును తీసుకు వచ్చి దానిని కంట్రోలులో ఉంచడమే కాదు. ప్రీ-డయాబెటిక్స్‌తో పూర్తిగా తగ్గించవచ్చు. ఉదా॥అత్యాధునిక స్టార్ ఆయుర్వేద మందులతో పాటు పీచుపదార్థాలు అధికంగా తీసుకోవడం, ఉప్పు, చక్కెర సంబంధిత పదార్థాలు అధికంగా తీసుకోవడం, వ్యాయామం చేయడం ద్వారా డయాబెటీస్‌ను శాశ్వతంగా పరిష్కరిచవచ్చు. సంప్రదాయ, అత్యాధునిక టెక్నాలజీ, అత్యాధునిక మందులు 36 సం॥ల అనుభవం కలిగిన ఆయుర్వేద డాక్టర్‌లు ఇప్పుడు స్టార్ ఆయుర్వేదలో మీకు అందు బాటులోఉన్నారు. డయాబెటీస్ గురించి బాధ పడకండి. దానిని మీరు సరైన శ్రద్ధతో కంట్రోలులో ఉంచు కోకపోతే మెల్లిమెల్లిగా అది మీశరీరాన్ని కబలిస్తుంది. 5000ఏళ్ల ఆయుర్వేద వైద్య విధానం ఇప్పుడు అత్యాధునిక టెక్నాలజీ రూపంలో మీ సేవకై వచ్చింది మా స్టార్ ఆయుర్వేద.

డా.మనోహర్. M. D (Ayurveda)
స్టార్ ఆయుర్వేద



# సినీ నారాయణీయం

## (ఎమ్మెస్ నారాయణ జీవితచిత్రం) 12

**ఆ రోజు నుంచి ఆలోచించా ఎం.ఏ ఎలా కట్టాలి? భాషాప్రవీణ చేసినోళ్ళు డైరెక్టుగా ఎం.ఏ కట్టడానికి పీఓఎల్ అని మధ్యలో ఒక ఎగ్జామ్ ఉంది. ఇప్పుడు ఎంసెట్ లాంటిదన్నమాట. పీఓ ఎల్ అంటే ప్రొఫిషియన్సీ ఇన్ ఓరియంటల్ లెర్నింగ్. అది ఒక సంవత్సరం కోర్సు. నాకు ఆ బుక్ దొరకలేదు. ఎవడో మాన్యుస్క్రిప్టు ఇచ్చాడు. అది దగ్గర పెట్టుకొని చదువుకుంటూ ఫీజు కట్టేశా. ఎగ్జామ్ దగ్గరకొచ్చేసింది. హాల్‌టికెట్ రాలేదు.**

హాల్‌టికెట్ తెచ్చుకోడానికి తాడేపల్లిగూడెంలో మెయిల్ ఎక్కి వైజాగ్ వెళ్ళాలి. సరేనని వెళ్ళా. తాడేపల్లిగూడెంలో ఒక టీచరు పిఓఎల్ నోట్స్ అమ్ముతున్నాడని తెలిసి అతని దగ్గరకు వెళ్ళి ఆ పుస్తకం తీసుకున్నా. 50 పేజీల చిన్న పుస్తకం. దాన్ని పట్టుకుని రైల్వే స్టేషన్‌కు వస్తే మెయిల్ రెండు గంటలు లేటు అని చెప్పారు. నేను ప్లాట్‌ఫాం చివర కూర్చుని అక్కడే చదివేశా. నచ్చిన సినిమా ఏదైనా ఒక్కసారే చూస్తా. నా హృదయానికి హత్తుకుపోతుంది.

అలాగే ఏదైనా చదివినప్పుడు అవసరం అనుకున్నదాని మీద ఏకాగ్రతపెట్టి అదే చదువు తాను. ఇంకేవీ పట్టవు నాకు. అలాగే 50 పేజీలు చదివేశా. కంటెంట్ తెలిసిపోయింది. ఇక పరీక్ష రాసేయగలను.



### హాల్‌టికెట్ లేకుండానే పరీక్ష

వైజాగ్ వెళ్ళి హాల్ టికెట్టు అడిగాను. పోస్టు చేస్తాం, వెళ్ళిపో అన్నారు. ఆ రోజే పోస్టు చేశారు. కానీ హాల్‌టికెట్ రాలేదు. పరీక్షరోజు వచ్చేసింది. డీఎన్ఆర్ కాలేజీ, నా ఎగ్జామ్ సెంటర్. ఆ కాలేజీలో అప్పుడు బంగార్రాజుగారు ఉండేవారు. ఆయన దగ్గరకు వెళ్ళాను. నాకు హాల్‌టికెట్ రాలేదు. పరీక్ష రాయనివ్వం అంటున్నారు. నేను వైజాగ్ కూడా వెళ్ళాను. వాళ్ళు పోస్టు చేశారు. పోస్టల్ డిలే. టెక్నికల్ ప్రాబ్లం ఇది. హాల్‌టికెట్ రేపు వస్తుంది. ఇవాళ మీరు నన్ను పరీక్ష రాయనివ్వకపోతే నా జీవితంలో ఒక సంవత్సరం వేస్ట్ అయిపోతుంది. కాబట్టి మీరు నాతో పరీక్ష రాయించి పేపరు మీ దగ్గర పెట్టుకోండి. ఇది నేరం కాదు. తప్పు కాదు. నా జీవితంలో ఒక సంవత్సరం ప్రసాదించమని నేను మిమ్మల్ని అడుగుతున్నాను. రూల్స్‌లో ఒప్పుకోనివి ఉంటే వాటిని కొంచెం సడలించి మీరు కొంచెం పర్సనల్‌గా ఆలోచించి నాకు హెల్ప్ చేయండి అన్నాను. ఆ పక్కనే ఇంకొక లెక్చరర్ ఉన్నారు. పెద్దాయన ప్రిన్సిపాల్‌తో ఆయనన్నారు అలా చేద్దామండీ అని. ఆ పెద్దాయన ఎవరో నాకు తెలియదు. మొత్తానికి పరీక్ష రాయించారు. నాతో పాటు అదే పరీక్ష రాసిన ముగ్గురు విద్యార్థులు ఫెయిలయ్యారు. నేను పాసయ్యాను. ఆంధ్రా యూనివర్సిటీలో ప్రైవేటుగా ఎం.ఏ కట్టాను. ఆంధ్రా యూనివర్సిటీ స్టూడెంట్‌ని నేను. జాబ్ చేస్తూనే, డీఎన్ఆర్ కాలేజీలోనే పరీక్ష రాశాను. ప్రీవియస్ ఫస్ట్‌క్లాస్ వచ్చింది. ఫైనలియర్ సెకండ్ క్లాస్ వచ్చింది. రెండూ కలిసి సెకండ్ క్లాస్ వచ్చింది. ఎం.ఏ సెకండ్ క్లాస్‌లో ప్రైవేటు అప్పియరెన్స్. గురువు ఎవరూ లేకుండా ఆ సిలబస్ నేనే చదువుకుని రాశా. దాంట్లో లింగ్విస్టిక్ అనే ఇంగ్లీషు పేపరులో నాకు బాగా మార్కులొచ్చాయి.

### ప్రచారం చేసి ఇంప్రెస్ చేశా

ఇక్కడ కాలేజీలో గంటి జోగిసోమయాజులు గారని లింగ్విస్టిక్ రచయిత ఉండేవారు. మనం పలికే 52 అక్షరాలు మన శరీర అవయవాల్లో ఎక్కడ జన్మిస్తాయో ఆ లింగ్విస్టిక్స్‌లో రాసుంటుంది. నేను సినిమాలకి డబ్బింగ్ చెప్పేటప్పుడు, మనం బాగా చెప్పడానికీ ఈ లింగ్విస్టిక్ అనేది నాకు బాగా ఉపయోగపడింది. మీరు బ్రహ్మాండంగా చెబుతారండి అనే పేరొకటి మనకుంది. అది ఈ లింగ్విస్టిక్ ఎడ్యుకేషన్ వలన వచ్చిందే. సరే పాయింట్‌కొస్తే, ఎం.ఏ పాసయ్యాక కాలేజీలో జాబ్ కావాలి. ఎలాగ? ఇంటర్వ్యూలు పడినప్పుడే తప్ప ఈ ఉద్యోగాలు మామూలుగా రావు. సరే డీఎన్ఆర్ కాలేజీ అనేది చాలా పెద్దది. అక్కడ మనం ఉద్యోగం సంపాదించడం కష్టం. కొత్తగా ఒక కాలేజీ పెట్టారు కేజీఆర్ఎల్ కాలేజీ. మనం ట్రై చేస్తే బాగుంటుందని చెప్పి ఆ కాలేజీ సెక్రటరీ ఎవరా అని చూశాను. మింటే పద్మనాభం గారన్నారు. ఈ మింటే పద్మనాభం గారిని మనం ఇంప్రెస్ చేసి జాబ్ తెచ్చుకోవాలి. అప్పుడు ఆయన జనతాపార్టీ తరపున ఎమ్మెల్యేగా పోటీ చేస్తున్నారు. ఇక అప్పుడు నేను సినిమా పాటల ట్యూనింగ్‌లు తీసుకుని ఆయన కోసం ఎన్నికల ప్రచారం పాటలు రాసేశాను. ఆయనకు తెలియకుండానే ఒక రిక్షా వేసుకుని దాంట్లో ఒక మైక్ సెట్ పెట్టుకుని భీమవరం టౌనంతా తిరుగుతూ ఆ పాటలు పాడటం మొదలెట్టా. అది ఆయన దృష్టికెళ్ళింది. ఎవరయ్యా ఆ పంతులు? ఎవరో పాటలు పాడేస్తున్నాడంటా నామీద! అతను మనకి కావాలి అని చెప్పి నన్ను పిలిపించారు. నేను ఆయన దగ్గరకు వెళ్ళా. ఎవర్రాశారు ఈ పాటలు? అన్నారు. నేనే రాశాను అన్నాను. సరేనయ్యా బాగుంది. నువ్వు ఇలా చేసినందుకు, ఆ రిక్షాకు వాటికి, మైక్‌సెట్లకి ఎంతయింది నేనిస్తా

నన్నారు. అక్కడి నుంచి ఆ రిక్షావాణ్ణి పిలిపించి ఈయన ఎలా చెప్తే అలా చెయ్యమని ఒక కార్యకర్తకి అప్పజెప్పారు. అప్పుడు అలా చేయడంతో ఆయన దృష్టిలో నేను మంచివాడుగా ముద్ర పడ్డాను.

### 250 జీతంతో లెక్చరర్‌గా

తరువాత పద్మనాభంగారి దగ్గర అసలు విషయం బయటపెట్టా. ఏం లేదండీ. ఎం.ఏ చదువుకున్నాను. అక్కడ స్కూల్లో చెప్పే పాఠాల్లో నాకు తృప్తి రావడం లేదు. పెద్ద పెద్ద వాళ్ళకి మంచిమంచి చదువులు చెప్పాలనిపిస్తోంది నాకు. నేను బాగా చదువుకున్నానండీ. కాళిదాసు అంటే నాకు బాగా ఇష్టం అని మొదలుపెట్టా. ఏమున్నాయయ్యా, పోస్టులేం లేవు అన్నాడాయన. ఇంకా పట్టువదలకుండా అలా తిరుగుతుంటే ఆయనకి నేనంటే ఇంప్రెషన్ కలిగి, ప్రిన్సిపాల్‌తో మాట్లాడారు. మాట్లాడితే శాన్‌స్క్రిట్‌లో పార్ట్‌టైమ్ జాబ్ ఉందన్నారు. 250 రూపాయలు జీతం. నీకు కావాలంటే ఆ పోస్టులోకి రావచ్చన్నాడు. స్కూల్‌కి రిజైన్ చేసేశా. 8000 రూపాయల జీతం వదిలేసుకున్నా. రిజైన్ చేసేసి 250 రూపాయలు జీతానికి వచ్చేశా. లెక్చరర్ అవ్వాలి. అయ్యాను. ఇంతకీ ఏంటంటే అది పర్మినెంట్ కాదు. దానికి ఇంటర్వ్యూ లేదు. ఏంటి హోప్ అంటే వచ్చే సంవత్సరం మార్చిలో ఇంటర్వ్యూలు పెడతారు. దాంట్లో తెలుగు పండిట్ పోస్ట్ ఉంది. అది నీకు ఇస్తాం అన్నారు. సరే అని వెళ్ళా.

### బ్రాహ్మణుడనుకుని పర్మినెంట్ చెయ్యలేదు!

అనుకున్నట్టుగానే ఇంటర్వ్యూలు పెట్టారు. నేను బ్రహ్మాండంగా చేశాను. ఇంకా కొంత మందిని చేశారు. కానీ వేరే ఒకాయనకిచ్చారు. అప్పుడు ఏం జరిగిందంటే వైస్ ప్రిన్సిపాల్ మెంటే

**ఎనిమిది వేల రూపాయలు జీతం వచ్చే మున్సిపల్ స్కూలు టీచర్ ఉద్యోగం వదిలేసి 250 రూపాయలకి ప్రైవేటు కాలేజీలో పార్ట్ టైమ్ లెక్చరర్‌గా చేరారు ఎమ్మెస్. జాబ్ పర్మినెంట్ చేసుకునేందుకు చేసిన ప్రయత్నాలు ప్రతిసారీ బెడిసికొట్టేవి. ఆఖరికి అయిదువేలిస్తే పర్మినెంట్ చేస్తాం అన్నారు. ఆ డబ్బుకోసం అన్వేషణ మొదలెట్టారాయన. మరి ఆ డబ్బు ఎలా సంపాదించారు? ఉద్యోగం పర్మినెంట్ అయిందా లేదా?**

హర్షన్‌రావుగారు నాతోటి అన్నారు. బ్రహ్మాండంగా చేశావయ్యా ఇంటర్వ్యూ. కానీ ఈ కాలేజీ కాపులందరూ కలిసి ఆయన్ను పెట్టుకున్నారు. నీవు బ్రాహ్మణుడవు కాబట్టి నీకు రాలేదు అన్నారు. అనేటప్పటికీ నేను షాక్ అయ్యాను. కాదు సార్ నేను బ్రాహ్మణుడిలా ఉంటాను కాని బ్రాహ్మణుడిని కాను. నేనూ కాపునే అంటే ఆయన షాక్ అయ్యారు. షాకై అన్నారు. సరే వచ్చే సంవత్సరం



ఇస్తారులే, నీవు ఇలాగే శాన్‌స్క్రిట్‌లో పార్ట్‌టైమ్ లెక్చరర్‌గా కంటిన్యూ చెయ్ అన్నారు. సరే అని 250 రూపాయలతోనే ఆ సంవత్సరమంతా కంటిన్యూ అయ్యాను. ఉద్యోగం పర్మనెంట్ అవుతుందనే ధీమా ఉంది.

ఆ తరువాత సంవత్సరం యూనివర్సిటీ నుంచి వచ్చిన ప్రొఫెసర్‌గారు ఇతను బాగా ఇంటర్వ్యూ చేశారు. ఇతనికి ఇవ్వండి పోస్ట్ అని చెప్పారు. కానీ చంద్రజీ అనే మాస్టారుకిచ్చారు. అలాగా అక్కడ ఉన్నటువంటి ఆబ్లిగేషన్స్‌తో నేను లెక్చరర్ అవ్వలేకపోయా. అదే 250 లకి ఇంకో సంవత్సరం అక్కడే కంటిన్యూ చేశా.

### పదివేలు డొనేషన్ కట్టమన్నారు

ఆ తరువాత సంవత్సరానికి ఉద్యోగం పర్మినెంట్ అయ్యే అవకాశం వచ్చింది. పదివేలు కట్టమన్నారు. 250 రూపాయలు జీతంతో నేను పదివేలు డొనేషన్ ఎక్కడినుంచి తేగలను, నా దగ్గర పైసా లేదు.

అప్పుడు చెన్నశెట్టి సోమేశ్వరరావుగారని ఒక లెక్చరర్ "మీరు ఊ అనండి. డబ్బులు ఎక్కడి నుంచైనా తెచ్చుకోవచ్చు" అన్నారు. మాస్టారు భరోసా ఇచ్చారంటే, మనకి అప్పు ఇస్తారు అనే ఉద్దేశంతో వెళ్ళి సార్ ముందొక అయిదువేలు ఇస్తానండీ, మిగతాది జీతం వచ్చాక తీసుకోండన్నాను. నీవు అయిదువేలు ఇచ్చినా చాలు నీకే ఇస్తామని చెప్పి, అంతకుముందు డబ్బు తెచ్చిన వాళ్ళందరి పేర్లు కొట్టేసి నాపేరు రాసేశారు. అయిదువేలు ఎప్పుడు ఇస్తావన్నారు. ఇంకో రెండు మూడు రోజుల్లో ఇస్తానన్నాను. మినిట్స్ బుక్‌లో నా పేరు రాసేసి జాబ్ డిక్లేర్ చేశారు. కాబట్టి నేను లెక్చరర్ అయ్యా. బయటికొచ్చా. బయటికొచ్చి మాస్టారు మీ దయ వల్ల లెక్చరర్‌ని అయ్యానండీ, ఒక్క అయిదువేలు నాకు అప్పు ఇప్పించండి, జీతంలో కట్ చేసుకోండి అన్నా. నా దగ్గర డబ్బెక్కడుంది అన్నాడు. అదేంటండీ అలాగన్నారు. నీకు జాబ్ వస్తుంది కదా ఏదో స్థిరపడతావు అని చెప్పానుతప్ప నా దగ్గర డబ్బు లేదన్నాడు. సరే ఇంకో లెక్చరర్ ఎలాగోలా పోగుచేయండన్నాడు. ఎలా పోగు చేస్తామన్నాను. మీ దగ్గర గ్యాస్ స్టవ్ ఉందా అన్నాడు. ఉందన్నా. అది నాకు ఇచ్చేయండి. ఐదొందలో, వెయ్యో వస్తది. అలాగలాగ కొంచెం పోగు చేయండి. నేనన్నా వద్దులెండీ. నేనే బ్లాక్‌లో కొనుక్కున్నాను. మళ్ళీ మీకివ్వడం ఎందుకని చెప్పేసి, పత్తిపాడులో ఉన్న మా అక్కయ్య దగ్గరకెళ్ళాను. మా బావ ఒక వెయ్యి రూపాయలు ఎల్ఐసీలో లోను ఇప్పించారు. తర్వాత మెంటే సాయి మాణిక్యాలరావు గారని ఇప్పుడు డిగ్రీకాలేజీ ప్రిన్సిపాల్ అయ్యారాయన. మూడు వేల రూపాయలు ఆయన ఇచ్చారు నాకు. సరే ఇంకో వెయ్యి రూపాయలు ఎక్కడో ట్రై చేశా. అక్కడ నుంచి ఆ వచ్చే 250 రూపాయలు కన్సాలిడేటెడ్ పే. ఈ లెక్చరర్ పోస్టుకి కూడా అంతే ఇచ్చారు.

### నీలాంటి వెధవల వల్లే...

కాలేజీ లెక్చరర్ అవుదామని రిజైన్ చేసి మున్సిపాలిటీ జీతాన్ని వదిలేశాను. చీమ జీవితం చీమకు గొప్పది, కొంగ జీవితం కొంగకు గొప్పది. ఈ చీమను ఆ కొంగ తినేస్తుంది. ఆ కొంగను ఇంకోటేదో తినేస్తుంది. నాచు వెంకట్రామయ్య గారని ఆ కాలేజీకి ప్రెసిడెంట్. ఇక్కడ పోస్టు ఆయన బంధువు ఒకాయనకి ఇప్పించాలని ఆయన ట్రయల్. ఆయన నన్ను పిలిపించాడు. నువ్వు చదువుకున్నావయ్యా, బుద్ధిలేదు నీకు. ఎనిమిది వేల రూపాయలు మునిసిపాలిటీ వాళ్ళు ఇస్తుంటే ఆ పర్మినెంట్ పోస్టుకు రిజైన్ చేసి ఒక టెంపరరీ పోస్టులో 250 రూపాయలకి నువ్వు జాయినవుతావా? నువ్వు లెక్చరర్ ఎలా అయ్యావయ్యా. నీకు బ్రెయిన్ ఉందా? నీలాంటి వెధవల వల్లే నిరుద్యోగ సమస్య ఎక్కువవుతోందయ్యా అన్నాడు. అప్పుడు నేనన్నా, సార్ మీరు చెప్పిన మిగిలిన పాయింట్లన్నీ గొప్పవండీ, కానీ నిరుద్యోగ సమస్య ఎక్కువవుతుంది నీలాంటి వాళ్ళ వల్ల అనడం మాత్రం తప్పుసార్ అన్నా.

(ఇంకావుంది)

-కూనపరాజు కుమార్
సెల్: 99899 99599




**"మీ రాజ్యంలో మీసమున్న మొనగాడే లేడా?" వీరధర్మ అడిగాడు.**

**ఆనందుడు విరక్తిగా నవ్వాడు. "గర్తవాటికలో నువ్వు చూసిన కపాలాలన్నీ మీసాలున్న మొన గాళ్ళవే!"**

**"అతని బలం మీకు తెలుసు. నా బలం నాకు తెలుసు!" వీరధర్మ చిరునవ్వుతో అన్నాడు. మీ కుమార్తెలను రాజు చెర నుండి తప్పించే ప్రయత్నం చేస్తాను. మీరు ఈ పరిసరాలలో ఉండటం ప్రమాదం అనుకుంటాను." "అవును నాయనా, వెదకి వేటాడుతారు."**

"సురక్షితంగా ఎక్కడ ఉండగలరో తెలుసా మీకు?"

ఆలోచన ఆనందుడి నుదురు మీద నాగేటి చాళ్ళలా గీతలు గీసింది. "ఇక్కడికి రెండుకోసుల దూరంలో చిన్న నది ఉంది. అది మదగజ సామ్రాజ్యానికి ఎల్ల. నదికి ఆవలి గట్టు నుండి సుదేహ రాజ్యం ప్రారంభమవుతుంది. భటులు నది దాటే ప్రయత్నం చేయరు. రెండు రాజ్యాల మధ్య ఆ నియమం ఉంది."

"బాబాయిగారూ మీ ఇద్దరినీ నా అశ్వం సువేగుడు నదిని దాటిస్తుంది."

వృద్ధ దంపతులు ముఖాలు చూసుకున్నారు.

"నువ్వు తోడుగా వస్తే బాగుంటుంది, నాయనా..." పూర్ణమ్మ అంది.

"మీ ఇద్దరినీ అశ్వం మీద కూచోబెట్టి, నేను నడవాలి. నడవగలను. కానీ, వేగం తగ్గుతుంది. అది ప్రమాదం. మీరు సాధ్యమైనంత త్వరగా ఈ రాజ్యం ఎల్ల దాటాలి. మీ రక్షణ బాధ్యత నా గుర్రానికి అప్పగిస్తాను! సువేగుడు మీ మీద ఈగ కూడా వాలనివ్వడు!" వీరధర్మ నవ్వుతూ అన్నాడు. "సువేగా!"

అశ్వం చకచకా అడుగులు వేస్తూ దగ్గరగా వచ్చి, ఆగింది.

వీరధర్మ అశ్వాన్ని నిమిరాడు. "బాబాయిగారినీ, పిన్నిగారినీ నది దాటించి, త్వరగా తిరిగి రావాలి."

సువేగుడు చిన్నగా సకిలించింది.

"పిన్నీ..." అంటూ వీరధర్మ చేతిని చాచాడు. పూర్ణమ్మ మెల్లగా లేచింది, ఆ చేయి పట్టుకుని. కాసేపట్లో పూర్ణమ్మా, ఆమె వెనుక ఆనందుడూ అశ్వం మీద ఆసీనులు చేయబడ్డారు.



"బాబాయిగారూ, మీరు జాగ్రత్తగా కూర్చుంటే చాలు..." ఆనందుడు చిరునవ్వు నవ్వాడు.. "పూర్వాశ్రమంలో యీ ఆనందుడు అశ్వశిక్షకుడు నాయనా!"

"పిన్నిగారిని భద్రంగా పట్టుకోండి. సువేగుడిది వాయువేగం!" వీరధర్మ అన్నాడు.

"ఆ అనుభవం కూడా ఉంది, నాయనా! పూర్ణను పుట్టింటి నుండీ ఎవ్వరికీ తెలీకుండా ఇలాగే గుర్రం మీద మనోవేగంతో తీసుకొచ్చేసి, మనువాడాను!" ఆనందుడు నవ్వాడు.

"ఇలాగే నవ్వుతూ ఉండండి. త్వరలో మీ అమ్మాయిలను కౌగిలించుకుంటారు!" వీరధర్మ నవ్వుతూ అన్నాడు. "సువేగుడికి దారి చూపాలి."

"పడమరగా వెళ్ళాలి. కొంచెం దూరం వెళ్ళాక దారి తిన్నగా కనిపిస్తుంది."

"పదండి! అక్కడి దాకా నేనూ వస్తాను" వీరధర్మ గుర్రం మీద తేలికగా చేతిని వేశాడు. గుర్రం ముందుకు కదిలింది.

"బాబాయిగారూ...మీ అమ్మాయిల పేర్లు..." గుర్రం పక్కనే నడుస్తూ అడిగాడు వీరధర్మ.

"పెద్ద పిల్ల గిరక; చిన్నది గిరిజ నాయనా.."

"పేర్లు చక్కగా ఉన్నాయి" వీరధర్మ మెప్పుగా అన్నాడు.

"ఇద్దరూ చక్కని చుక్కలు. అందుకే చక్కని పేర్లు పెట్టాం!" పూర్ణమ్మ అంది.

"నాయనా ధర్మా... నది దాటాక నీ గుర్రాన్ని..." ఆనందుడు అన్నాడు.

"నది దాటగానే కాదు; మీ గమ్యస్థానం చేరాక, వచ్చిన దారిలో వదిలిపెట్టండి. సువేగుడు నన్ను ఇక్కడే కలుసుకుంటుంది..."

"భయం లేదా, నాయనా?" పూర్ణమ్మ అడిగింది.

"ఎవరికి పిన్నిగారూ?"

"గుర్రానికి నాయనా.."

"సువేగుడు మేలుజాతి గుర్రం. నన్ను కంటికి రెప్పలా చూసుకుంటుంది! ఆందోళన పడకండి. నన్ను క్షేమంగా చేరుకుంటుంది. సువేగుడు జవనాశ్వం. వాయువేగం! చూస్తారుగా!"

"నదికి సమీపంలో ఒక కుగ్రామం ఉంది. ఆ గ్రామంలో నా చిన్ననాటి మిత్రుడి కుటుంబం ఉంది. అక్కడ తల దాచుకుంటాం. గ్రామం పేరు 'జలదుర్గం'. నీ రాక కోసం, మా చిట్టి తల్లుల రాక కోసం ఎదురు చూస్తూ ఉంటాం..!" ఆనందుడు అన్నాడు.

"అలాగే! మీ పిల్లలు క్షేమంగా ఉండాలని దేవుడిని ప్రార్థించండి!" వీరధర్మ చిరునవ్వు నవ్వాడు.

## నవ్యవీక్లి-లక్ష్మీనారాయణ జైని మెమోరియల్ ఛారిటబుల్ ట్రస్ట్ సంయుక్త నిర్వహణలో

# ప్రథమ బహుమతి రూ.50,000 పొందిన నవల

### జరిగిన కథ

వైశాలిక రాజ్య యోధుడు వీరధర్మ. రాజపరివారం కుట్ర వల్ల కన్నతల్లిని పోగొట్టుకుంటాడతడు. తిరిగి వారికి తగినశాస్తి చేస్తాడు. సంపూర్ణాయుస్సు సాధించే లక్ష్యంతో బయలుదేరతాడు. మార్గాంతరంలో ఎన్నో కష్టాలు, అనుభవాలు చవిచూస్తూ చివరకు శ్వేత మరాళ మార్గదర్శనంతో పర్వతశిఖరంపై ఉన్న తాపసి చిరంతన యోగిని ప్రసన్నం చేసుకుంటాడు. యోగి ద్వారా మరణ రహస్యం గ్రహించి పునరాలోచనలో పడతాడు. మదగజనగరంలో వృద్ధ దంపతుల్ని ప్రాణాపాయ శిక్ష నుండి రక్షించి వారి కుమార్తెల్ని కూడా కాపాడతానని అభయం ఇస్తాడు. ఆ తర్వాత....

"నాయనా ధర్మా, మా కుటుంబానికి రక్షకుడిగా నిన్ను ఆ దేవుడే పంపించాడు! నువ్వు క్షేమంగా ఉంటే మేమందరం క్షేమంగా ఉన్నట్టే. నీ క్షేమం కోసం ప్రార్థిస్తాం."

"అలాగే!"

ఆనందుడు వీరధర్మ వైపు తదేకంగా చూశాడు. "ధర్మా, నీకో ముఖ్య విషయం చెప్పాలి. మా మదగజ నగరానిది సార్థక నామధేయం. రథగజ తురగ పదాది దళాలతో కూడి ఉండే చతురంగ బలంలో మా రాజుది గజ బలం. ఈ రాజ్యం ఏనుగుల సంస్థానం. గజ సంతానానికి ఆటపట్టు ఈ ప్రాంతం! నగరంలో నలభైకి పైగా మగ మదగజాలున్నాయి. మావటి వాళ్ళు మానవ రూప దానవులు. ఆ మదగజాలకు క్రూరత్వాన్ని నూరి పోశారు!

"ఒక్కొక్క ఏనుగు ఒక్కొక్క పర్వతం! తొండంతో సింహాన్ని కూడా ఒడిసిపట్టి విసిరివేయగలిగిన సామర్థ్యం ఆ ఏనుగులది! రాజుగారి మాటను కాదన్న వాళ్ళను కడతేర్చేది ఆ ఏనుగులే! వాటి విషయంలో, మావటీల విషయంలో జాగరూకత అవసరం నాయనా. ఆ ఏనుగులు నగర వీధుల్లోకి వస్తే ప్రజలు కకావికలైపోతారు. నువ్వు...నువ్వు జాగ్రత్తగా ఉండాలి నాయనా.."

"జాగ్రత్తగా ఉంటాను! మీరు క్షేమంగా వెళ్ళండి!" వీరధర్మ నవ్వుతూ అన్నాడు.

పూర్ణమ్మ వీరధర్మ వైపు దీనంగా చూసింది. "నాయనా, క్రూర సింహం ఉండే గుహలోకి వెళ్తున్నావు. ఏ తల్లి కన్న బిడ్డవో...ఈ తల్లి కన్నబిడ్డల కోసం బలైపోకు తండ్రీ..."

"పిన్నిగారూ, మా అమ్మ నన్ను పై నుండి దీవిస్తూనే ఉంటుంది. మీరు



# అతనితో నటించాలనుంది

అప్‌కమింగ్ హీరోయిన్లు ఫలానా హీరోతో నటించాలనుందని చెప్పడం కామన్. కానీ ఓ స్టార్ హీరోయిన్ ఓ హీరోతో నటించాలని ఉందంటూ బహిరంగంగా చెప్పడమే ఇప్పుడు హాట్ టాపిక్. ఆ హీరోయిన్ ఎవరో కాదు మిల్కీబ్యూటీ తమన్నా. ఆ హీరో నాని. తమన్నా ఇప్పటి వరకూ దాదాపు అందరు స్టార్ హీరోల తోనూ చేసింది. అదే సమయంలో కొందరు కుర్ర హీరోలతో కూడా జత కట్టింది. కానీ నేచురల్ స్టార్ నానితో మాత్రం చేయలేదు. అదే బాధగా ఉంది అంటోంది తమ్ము. నానితో సినిమా చేయడానికి నేను ఎప్పుడైనా రెడీ అంటోంది. నాని నటన చూశా? లేక అతని సక్సెస్ రేటు చూశా? ఇంతకీ తమన్నా అతగాడితో ఎందుకు నటించాలనుకుంటోంది? అని చాలా మంది అనుమానాలను వ్యక్తం చేస్తున్నారు.



ఇక్కడి నుండి దీవిస్తూ ఉండండి. ఒకరి దీవెన కవచం. ఒకరి దీవెన ఖడ్గం!" అంటూ వీరధర్మ అశ్వాన్ని అదిలించాడు. అశ్వం ముందుకు కదిలింది.

●●●

వీరధర్మ గర్తవాటికను సమీపించాడు. చెల్లా చెదురుగా పడున్న మానవ కపాలాలూ, చేతుల ఎముకలూ ఎండలో తెల్లగా మెరుస్తున్నాయి. చిటారు కొమ్మల మీద ఓపికగా కూర్చున్న రాబం దులు రెప్పలు కదిలిస్తూ శబ్దాలు చేశాయి. ఈ గర్త వాటిక రాబందుల విందు భోజనశాల! వీర ధర్మ తనలో నవ్వుకున్నాడు. ఈ పూట తను ఆ రాబందుల నోటి కూడు దూరం చేశాడు!

దట్టంగా నీడను పరిచిన చెట్టు క్రిందికి వెళ్ళి, విశ్రాంతిగా కూర్చున్నాడు వీరధర్మ. తను ఆలస్యం చేయకుండా మదగజ నగర రాజు జీవంతకుడిని చూడాలి. గిరికనూ, గిరిజనూ రక్షించాలి. ముఖ్యంగా, దేహంలో మహాబలం, గుండెలో హాలాహలం ఉన్న జీవంతకుడిని చూడాలి! ఆయన మహారాజుగారు. తను సామాన్యుడు. ప్రవాసి. దర్శనం లభిస్తుందా? వీరధర్మ చిరునవ్వుతో అనుకున్నాడు. జీవంతక మహారాజుగారి దర్శనం తనకి అయాచితంగా, అత్యంత సులభంగా లభిస్తుంది. తనకు తెలుసు. అతని భటులే స్వయంగా తనను తమ ప్రభువు సన్నిధికి తీసుకెళ్తారు!

తను ఇక్కడ ఉంటే చాలు! రాజుగారి దర్శన భాగ్యం తనను అన్వేషిస్తూ, అదే వస్తుంది! నది వైపు నుండీ వచ్చే సువేగాశ్వం కోసం, నగరం వైపు నుండీ వచ్చే మదగజం కోసం తాను ఎదురు చూస్తూ విశ్రాంతి తీసుకోవాలి.

●●●

అలసటగా మూసిన వీరధర్మ కనురెప్పలు ఉన్నట్టుండి స్పందించాయి. గిట్టల చప్పుడు, కొంచెం దూరం నుండీ అతని చెవుల్ని సోకు తోంది. సువేగుడు వస్తోంది! వీరధర్మ కళ్ళు విచ్చు కున్నాయి. ఎదురు చూసిన సువేగాశ్వం అతని ముందు ప్రత్యక్షం కాలేదు.

పర్వతాల్లాంటి రెండు నల్ల ఏనుగులూ, గున్న ఏనుగుల్లాంటి నలుగురు వ్యక్తులూ తన ముందున్నారు. వృద్ధ దంపతుల శిక్షను సఫలం చేయడానికి వచ్చిన యమకింకరులు! భటుల చేతుల్లో పొడవాటి ఈటెలున్నాయి. గిట్టల చప్పుడు ఆగింది. వీరధర్మ తల తిప్పి చూశాడు. సువేగాశ్వం పది అడుగుల దూరంలో నిలుచుని, చెవులు రిక్కించి, కళ్ళు ఇంతలు చేసుకుని చూస్తోంది.

నలుగురు భటులూ మదించిన ఏనుగుల్లా నడుస్తూ, వీరధర్మ దగ్గరగా వచ్చారు. గిరజాల జుట్లు, గుబురు కనుబొమలు నలుగురి ముఖాల మీదికి పాకిన గొంగళి పురుగుల్లా ఉన్నాయి. వాటి క్రింద నెత్తురులో ముంచినట్టున్న కళ్ళు. ఉబ్బిన ట్లున్న నల్లటి పెదవులు. వీరధర్మ వాళ్ళ వైపు చిరునవ్వుతో చూశాడు.

"ఎవర్నువ్వు?" ఒక భటుడు గద్దించాడు.

"పేరు కావాలా? ఊరు కావాలా?"

"రెండూ కావాలి చెప్పు!" రెండవ భటుడు ఉరిమాడు.

"పేరు మరిచిపోయాను. ఊరు లేదు!" వీర ధర్మ నవ్వాడు.

"పొగరా! నాలుక తెగిపోతుంది! జాగ్రత్త!" మూడవ వ్యక్తి హుంకరించాడు.

"వాడి పేరూ, ఊరూ మనకెందుకురా? అడ గాల్సింది అడుగుదాం!" నాలుగవ భటుడు వీర ధర్మ దగ్గరగా జరుగుతూ అన్నాడు. "అక్కడ పాతిపెట్టిన నేరగాళ్ళను చూశావా?"

"చూశాను.."

"ఎవరో వాళ్ళను తవ్వి తీశారు. ఎవరో చూశావా?"

"చూశాను."

"ఎవరు?"

"నేనే!"

"ఆ!ఆ!ఆ!" నలుగురూ ఒకేసారి అన్నారు.

"ఎంత ధైర్యంరా నీకు? ఎందుకు తప్పించావు వాళ్ళని?"

"ఆపదలో ఉన్న వృద్ధులు; ఆదుకున్నాను!"

నలుగురూ ముఖాలు చూసుకున్నారు. చూపు లతో సంభాషించుకున్నారు. నాలుగు ఈటెలూ ఒకేసారి వీరధర్మ వక్షం మీద ఆనాయి.

"నువ్వు చేసింది సామాన్య నేరం కాదు. రాజ ద్రోహం! రాజ్య ధిక్కారం! శిక్ష మా ప్రభువులు విధిస్తారు! లే!" ఒక భటుడు గద్దించాడు.

మరొకడు బల్లెం అలాగే ఉంచి కిందికి వంగి వీరధర్మ ఖడ్గాన్నీ, బాకునీ స్వాధీనం చేసుకు న్నాడు. "లే!"

వీరధర్మ వినయంగా లేచి నిలుచున్నాడు. ఆరు చేతులు అతడిని ఒడిసి పట్టుకున్నాయి. నాలుగో భటుడు వీరధర్మ వెనుక వైపు వెళ్ళి, అతని చేతుల్ని వెనక్కి విరిచి బంధిస్తున్నాడు. వీరధర్మ ముఖం మీద చిరునవ్వు.

●●●

ఇనుప కవాటాలు పెద్దగా చప్పుడు చేస్తూ తెరుచుకున్నాయి. చీకటి గుయ్యారంలా ఉన్న నేల మాళిగ ప్రత్యక్షమైంది. వీరధర్మ కళ్ళు చించు కుంటూ చూశాడు. ఇరుకుగా ఉన్న మెట్లు లీలగా మసకమసకగా కనిపిస్తున్నాయి. పెడరెక్కలు విరిచి కట్టి, అడుగులు దగ్గర దగ్గరగా అక్కడక్కడే పడే విధంగా, దొంగ గొడ్డుకు కట్టినట్టు కాళ్ళను బంధించి గర్తవాటిక నుండీ మొరటుగా లాగుతూ, తోస్తూ తీసుకు వచ్చిన తనను భటులు తమ ప్రభువు సన్నిధికి ఎందుకు తీసుకెళ్ళలేదు? చెరసాలకు ఎందుకు తీసుకు వచ్చారు?

వీరధర్మ ఆలోచనలను చెల్లాచెదురు చేస్తూ భటులందరూ ఒకేసారి అతన్ని మెట్లమ్మట క్రిందికి తోశారు. తూలి పడబోతూ, అతి ప్రయత్నం మీద నిలదొక్కుకునే ప్రయత్నం ఫలించకపోవడంతో వీరధర్మ మెట్ల మీదికి వాలిపోయాడు. అతని శరీరం మెట్టు మీద నుంచీ మరో మెట్టు మీదికి దొర్లుకుంటూ వెళ్తోంది. వీరధర్మ ముందు జాగ్ర త్తతో తల పైకెత్తి, అలాగే ఉంచుకున్నాడు. నేల మాళిగ నేల మీదికి చేరి, లేచే ప్రయత్నం చేస్తున్న వీరధర్మను భటులు మొరటుగా లేవదీశారు. ఎగ తాళిగా పళ్ళు ఇకిలించారు. తలకు దెబ్బ తగల కుండా కాపాడుకున్న వీరధర్మ శరీరానికి కలిగిన

కొద్దిపాటి బాధను నిర్లక్ష్యం చేస్తూ పళ్ళు గట్టిగా బిగబట్టాడు.

"రాజుగారి ముందు ప్రవేశపెట్టకుండా చెర సాలకు తీసుకు వచ్చారేం?" వీరధర్మ ప్రశ్నించాడు.

"ఈ అవతారంతోనా?" ఒక భటుడు వీరధర్మ శరీరాన్ని చేత్తో చూపిస్తూ భళ్ళున నవ్వాడు."

"రాజుగారి దర్శనానికి వెళ్ళాలంటే, నిన్ను సింగారించాలి, మొనగాడా! అందంగా అలంకరిం చకపోతే, ప్రభువులు నిన్ను కన్నెత్తి చూడరు!" రెండవ భటుడు వీరధర్మను గోడ దగ్గరగా నెట్టుతూ అన్నాడు.

రాతిగోడ మొరటుగా, చల్లగా వీరధర్మ వీపుకు తగిలింది. అతని ముందు నిలుచున్న భటుడు ఎడమచేత్తో వీరధర్మ పీకను పట్టుకుని గోడకేసి నొక్కాడు. అతని కుడి చెయ్యి చివాలున పైకి లేచింది. చిన్న బాకు మసక చీకట్లో మెరిసింది. బాకు కొన వీరధర్మ ఎడమ కంటి చివర సూదిలా గుచ్చుతూ ఆనింది.

"కదిలావో, కన్నెగిరిపోతుంది!" భటుడు బెది రింపుగా అన్నాడు. "రాతి బొమ్మైపో, మొగుడా! ఊపిరుండాలంటే, ఊపిరి బిగపట్టి నించో!"

రెండవ భటుడు వీరధర్మను వదిలి, దూరంగా వెళ్ళాడు. కాసేపట్లో నేల మీద లాగబడుతున్న గొలుసులు శబ్దం చేశాయి. ఇనుప గొలుసులను లాక్కొచ్చిన భటుడు వీరధర్మ ముందు నేలమీద కూర్చున్నాడు. కత్తి మొన వీరధర్మ కంటికొలికి దగ్గరగా కదిలింది. రెండుకాళ్ళకూ, పాదాలపైన గుండ్రటి ఇనప కడియాలు చుట్టుతున్నట్టు వీర ధర్మ గ్రహించాడు. రెండు కడియాలనూ కలు పుతూ, పాదాల మధ్య మూరెడు పొడవు గొలుసు! గమన నిరోధకం! వీరధర్మ తనలో అనుకున్నాడు. కాసేపట్లో చేతులు రెండూ, మణికట్ల దగ్గర ఇనుప కంకణాలతో ఇరికించబడ్డాయి; కాళ్ళలాగే. అయితే అతను ఊహించనిది మరొకటి జరిగింది. పొగరు మోతు ఆబోతుకు అర్రుచుట్టూ తగిలించినట్టు, అతని కంఠం చుట్టూ కంఠాభరణంగా, పలుపు లాగా ఇనప కడియం తగిలించబడింది! కత్తి కొన కంటి కొన నుండీ దూరంగా జరిగింది. కంఠాన్ని చుట్టిన కడియం నుండీ బరువైన గొలుసు తాడులా వేలాడుతోంది.

మెట్ల మీద అడుగుల చప్పుడు. ఎవరో వస్తు న్నారు. కారాగార అధికారిలా ఉన్న వ్యక్తి, పొడ వాటి తాళం చెవులగుత్తిని చేత్తో పట్టుకుని దగ్గ రగా వచ్చాడు.

"నిందితుడిని కొలువు కూటంలో వెంటనే ప్రవేశపెట్టమని ప్రభువుల ఆజ్ఞ!" అన్నాడతను.

వెంటనే వీరధర్మ ఊహించని సంఘటన మరొకటి జరిగింది. అతని ముందు నిలుచున్న భటుడి పిడికిలి, ఇనప సుత్తిలా వీరధర్మ పెద వుల మీద వాలింది. పెదవులు పగిలినట్టున్నాయి. కారసాగిన రక్తాన్ని వీరధర్మ నాలుక రుచి చూసింది. రెండవ భటుడు ఎదురుగా జరిగి, చిరు నవ్వుతో చూశాడు. అతని చెయ్యి పాము పడగలా కదిలింది. వీరధర్మ ఎడమ కన్ను పగిలినట్టు అని పించింది. కంటి చుట్టూ చర్మం ఉబ్బుతున్నట్టని పిస్తోంది. వీరధర్మ ఆగ్రహం వేడి నిట్టూర్పు రూపంలో వెలుపలికి దూకింది.

"రెండు దెబ్బలూ, నీ వేషధారణలో ముఖ్యమైన నగలు! ప్రభువులు చూడటానికి! మా పనితనాన్ని మెచ్చుకోడానికి!" ఒక భటుడు అన్నాడు నవ్వుతూ. మిగిలిన ఇద్దరూ పగలబడి నవ్వారు.

తన కంఠాన్ని బంధించిన గొలుసు ముందుకు బలంగా లాగబడుతోంది; ఆబోతును బంధించిన తాడులా! వీరధర్మ ముందుకు కదిలాడు.

●●●

సభ కిక్కిరిసి ఉంది. చరిత్రలో మొదటిసారిగా, శిక్ష విధించబడిన అపరాధులను తప్పించి రాజ ద్రోహానికి పాల్పడిన వ్యక్తిని చూడటానికి సభా ప్రవేశానికి అర్హత కలిగిన వాళ్ళంతా వచ్చేశారు.

అందరి కళ్ళూ సంకెళ్ళతో బంధించబడి, అడు గులో అడుగు వేస్తూ వస్తున్న నిందితుడి మీదే ఉన్నాయి. మహారాజు జీవంతకుడి కళ్ళు చంద్ర నిప్పుతో నిండిన గిన్నెల్లా ఎర్రగా, రెప్పపాటు మరిచిపోయి వీరధర్మనే చూస్తున్నాయి. వీరధర్మ చూపులూ మహారాజు మీదే...

పెద్ద కిరీటంలోంచీ భుజాల క్రింది దాకా జారిన, ఉంగరాలు తిరిగిన గిరజాల జుట్టు. ఆబోతు అర్రులా బలిసి, తలకూ, భుజాలకూ మధ్య ఇరు క్కుని, కుచించుకుపోయిన కంఠం. కంఠం నుంచీ వేళ్ళాడుతూ వెడల్పాటి పీఠంలా ఉన్న రొమ్మును కప్పివేసిన రకరకాల స్వర్ణాభరణాలు. నిమ్మ కాయల్ని మోస్తూ నిలబడగలవు అనిపించేలా కనిపిస్తున్న మెలితిరిగిన మీసాలు. వెడల్పాటి ముఖం. లావుపాటి పెదవులు. కట్టుకున్న బంగారు రంగు వస్త్రాన్ని ముందుకు తోస్తున్న బానలాంటి బొజ్జ. బొజ్జను అదుపాజ్ఞలలో ఉంచుతున్నట్టు చుట్టుకున్న బంగారు పట్టీ. జబ్బలనూ, ముంజేతులనూ ధగధగలాడి స్తున్న నగలు. ఎర్రమట్టి రంగు శరీరం బాగా బలిసిన పాములా మెరుస్తోంది. అతని ఎడమ భుజం మీద నుంచీ ఎర్రటి అంగ వస్త్రం కిందికి జారింది.

"మా సమీపానికి రావాలి!" జీవంతక మహా రాజు కంఠం కీచుగా ధ్వనించింది. పిట్ట ఘనం; కూత కొంచెం! వీరధర్మ తనలో నవ్వుకున్నాడు.



## ప్రియాంక టైం బాగుందా?

ప్రతి సంవత్సరం అత్యంత ప్రతిభావంతుల పేర్ల జాబితా ప్రకటించడం 'టైం ఇంటర్నేషనల్ మ్యాగజైన్' ఆనవాయితీ. ఇప్పటి వరకూ ఎంతో మంది ప్రతిభావంతులు ఈ జాబితాలో చోటు సంపాదించుకున్నారు. ఈ సంవత్సరం ఈ జాబితాలో ప్రియాంకాచోప్రా ఉండ వచ్చన్న ఊహాగానాలు బలంగా వినిపిస్తున్నాయి. హాలీవుడ్‌లో తన నటనతో మంచి పేరుతెచ్చుకుంది ప్రియాంకా! ఇదే కనుక నిజమైతే ఈ సంవత్సరం భారతదేశ సినిమా హీరోయిన్లలో అత్యంత ప్రతిభా వంతురాలైన ఉమెన్‌గా ఆమె నిలుస్తుందంటున్నారు.

భటులు వీరధర్మను మొరటుగా తమ ప్రభువుల ముందుకు తీసుకు వెళ్ళారు. వీరధర్మ రాజు ముఖంలోకి ధైర్యంగా చూశాడు. పగిలిన పెదవులనూ, కారి, గడ్డకట్టిన రక్తాన్నీ, వీరధర్మ ఎడమ కంటి చుట్టూ వాచిపోయిన భాగాన్నీ తృప్తికరంగా చూస్తూ ఉండిపోయాడు జీవంతకుడు.

"ఎవరు నువ్వు?" జీవంతకుడు ఉరిమాడు.

"పేరు వీరధర్మ..?"

"వీర-ధర్మ!" జీవంతకుడు గొల్లున నవ్వాడు. "మిత్రమైన పేరు! నీలో ఏది ఉంది? వీరత్వమా? ధర్మమా?"

"వీడిది నేతిబీరకాయ నామధేయం ప్రభూ!" మహామంత్రి వెటకారంగా నవ్వుతూ అన్నాడు. సభలో నవ్వులు...

"చెప్పమంటారా?" సభను నిశ్శబ్దం ఆవరించాక, అడిగాడు వీరధర్మ.

"ఊ!" జీవంతకుడు గంభీరంగా అన్నాడు.

"వీరత్వానికి వీరత్వం; ధర్మానికి ధర్మం-రెండూ ఉన్నాయి..."

"చిత్తం ప్రభూ!" మహామంత్రి ఉత్సాహంగా అన్నాడు. "అపరాధి మాట తీరూ, ప్రవర్తనా చూస్తే అలాగే అనిపిస్తోంది!"

"అపరాధీ! చేసిన రాజద్రోహ నేరాన్ని అంగీకరిస్తున్నావా?" జీవంతకుడు ప్రశ్నించాడు.

"పండుటాకుల్లాంటి వృద్ధ దంపతులను ఘోరమైన స్థితి నుండీ రక్షించాను. దానిని నేరంగా అంగీకరించను! అది నేరం కాదు!" వీరధర్మ అన్నాడు.

జీవంతకుడి కళ్ళు మరింత ఎరుపెక్కాయి. "మూర్ఖుడా! నువ్వు నేరాన్ని అంగీకరించినా, అంగీకరించకపోయినా మేము విధించే శిక్ష ఒక్కటే! అహ్హహ్హా!"

"ప్రభువులు ధర్మం తప్పరు. అపరాధిని అడిగి, ఆలకించే ధర్మాన్ని పాటిస్తారు! శిక్ష విధించడంలో ఆచారం పాటిస్తారు!" మహా మంత్రి అన్నాడు. "ప్రభూ..." అన్నాడు రాజు వైపు సాభిప్రాయంగా చూస్తూ.

"వీడు చేసింది అపరాధం కాదు, మహామంత్రీ;




జీవంతకుడి ఎర్రటి కళ్ళు మరింత ఎర్రబడ్డాయి. "వీడిది నిలువెత్తు అహంకారం మహామంత్రీ!"

"చిత్తం! సందేహం లేదు ప్రభూ!"

"అపరాధీ! నువ్వు చేసిన అపరాధం ఎంత తీవ్రమైందో తెలుసా?" రాజు ప్రశ్నించాడు.

"నా దృష్టిలో, నేను చేసింది అపరాధం కాదు; సహాయం!" వీరధర్మ ధైర్యంగా అన్నాడు. "ఆత్మ పరిశీలన చేసుకోండి. అపరాధం చేసింది మీరు! అన్నెం పున్నెం ఎరుగని ఆడపిల్లల్ని.."

"నోర్ముయ్!" రాజు జీవంతకుడి కీచు కంఠం కర్ణకఠోరంగా గింగురుమంది. "మహామంత్రీ వీడు ఎక్కడివాడు?"

"అపరాధీ, నువ్వు చేసిన దుస్సాహసం, ఆచరించిన మహాపరాధం నువ్వు యీ రాజ్యానికి చెందిన వాడివి కావని చెప్తున్నాయి! ఏ రాజ్యం నీది?" మహామంత్రి గద్దించాడు.

"నాది వైశాలిక నగరం..."

"వైశాలిక..." జీవంతకుడు వెక్కిరింతగా అన్నాడు. "ఏదో గుప్పెడు రాజ్యమై ఉంటుంది!"

మహాపరాధం! 'గజగర్త శిక్ష' విధించబడిన రాజద్రోహులను గర్తం నుండీ తప్పించాడు! మా మహా సామ్రాజ్యంలో ఉరితీతలూ, గొంతు కోతలూ లేవుగా! ఈ అపరాధికీ అదే గజగర్త శిక్ష విధిస్తున్నాం!" జీవంతకుడి కంఠాన్ని సభాభవనం గోడలు ప్రతిధ్వనించాయి.

సభలో దద్దరిల్లిన చప్పట్లు ఆ ప్రతిధ్వనిని మ్రింగివేశాయి.

"అపరాధికి శిక్ష తక్షణం అమలు జరపండి! తీసుకు వెళ్ళండి!" జీవంతకుడు హుంకరించాడు.

భటులు విసురుగా వీరధర్మను వెనక్కి తిప్పారు. అతని కంఠాన్ని బంధించిన ఇనప గొలుసును ముందుకు లాగాడు దానిని పట్టుకున్న భటుడు.

"ఆగండి!" రాజాజ్ఞ భటుల కాళ్ళకు బంధం వేసింది.

ఆగి, తిరిగి వినయంగా చూశారు.

"ఈ అహంకారి గర్తలో పాతిపెట్టిన అపరాధులను తప్పించి, మొట్టమొదటిసారిగా దారుణమైన నేరం చేశాడు. ఒక దారుణ నేరాన్ని, ఒక మహాపరాధాన్ని మా ప్రజలకు పరిచయం చేశాడు! అది మన రాజధర్మ భవితకు ప్రమాదం! ఇలాంటి మహా నేరానికి యీ జీవంతక సార్వభౌములు విధించే శిక్షను నగరంలో ప్రజలం దరూ-పిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు, వృద్ధులు, వికలాంగులు-అందరూ కళ్ళారా చూడాలి! మా రాజ్యంలోని అందరికీ ఆ శిక్ష ఒక గుణపాఠం కావాలి! ఒక హెచ్చరిక కావాలి!

"జయహో ప్రభూ! జయహో!" మహామంత్రి ఉత్సాహంగా అరిచాడు. "ఔను మహాప్రభూ! ఈ అపరాధికి ప్రభువులు విధించే శిక్ష భవిష్యత్తు తరాలకు ఒక హెచ్చరిక కావాలి! ఈ తరానికి కనువిప్పు కావాలి!"

"మా ఆశయం అదే కద!" జీవంతకుడి కంఠంలో గర్వం మృత్యు ఘంటికలా మ్రోగింది. "ఈ అపరాధికి శిక్ష గర్త వాటికలో కాదు; రాజవీధిలో మా నగరి మహాద్వారం ముందు జరగాలి!"

"హా హా హా! అద్భుతమైన తీర్పు ప్రభూ!" మహామంత్రి ఉత్సాహంగా అన్నాడు. "నేరానికి తగిన నేర్పుతో విధించిన శిక్ష!"

"ఈ జీవంతక సార్వభౌముల తీర్పులన్నీ అలాగే ఉంటాయి, మహామంత్రీ!" జీవంతకుడు గర్వంగా అన్నాడు. "ఆ ఆనందుడినీ, వాడి భార్యనూ బంధించి తేవాలి! రాజ్యమంతా గాలించే ఏర్పాట్లు చేయండి! వాళ్ళ శిక్ష కూడా రాజవీధిలో, అందరి ముందూ కార్యరూపం ధరించాలి!"

"చిత్తం!"

జీవంతకుడు చేతిని పైకెత్తి, చూపుడు వేలితో భటుల్ని నిర్దేశిస్తూ ఇలా అన్నాడు. "ఈ అపరాధిని వీధి వీధీ తిప్పండి! వీడు చేసిన నేరాన్నీ, విధించబడిన శిక్షనూ వివరిస్తూ, ఆపకుండా చాటింపు వేస్తూ బలిపశువును ఊరేగించినట్టు వీణ్ణి ఊరేగించండి!"

భటులు వినయంగా తలలు వాల్చి, వీరధర్మను లాక్కుంటూ వెళ్ళిపోయారు.

"మహామంత్రీ ఈ సామ్రాజ్య చరిత్రలో మొట్టమొదటిసారిగా రాజప్రాసాదం మహాద్వారం ముందు కార్యరూపం ధరించే శిక్షను మేము ప్రత్యక్షంగా తిలకించాలి. అపరాధిని మోకాళ్ళ దాకా పూడ్చమనండి. పెడరెక్కలు విరిచి కట్టమనండి. మా రాజ్యానికి మహా గర్వకారణమైన మా ప్రియమైన మదపుటేనుగులు అన్నీ, ఒక దాని తర్వాత ఒకటి చొప్పున ఆ అహంకారిని తొక్కాలి! నుజ్జుగా తొక్కాలి! మోకాళ్ళ నుండీ తల దాకా శరీరం నుజ్జు నుజ్జు అవుతూ ఉంటే వాడు అనుభవించే వినూత్న నరకయాతనను మేము సపరివారంగా నయనానందకరంగా చూడాలి!"

జీవంతకుడి మాటలు సభా భవనంలో మారు మ్రోగుతూ, ద్వారం దాటబోతున్న వీరధర్మ చెవుల్ని తాకాయి, కర్కశంగా.

"చిత్తం ప్రభూ...తమ ఆజ్ఞ.." మహారాజు వైపు మొదటిసారిగా భయం భయంగా చూస్తూ అన్నాడు మహామంత్రి.

**(ఇంకా వుంది)**






## మార్జాల దేవాలయం

కుక్కలకో గుడి, కోతులకో గుడి ఉన్నప్పుడు మరి పిల్లికెందుకూడదు అనుకున్నారు జపనీయులు. అంతే పిల్లికీ గుడి కట్టేశారు. జపాన్, సెటగయా నగర సరిహద్దులలో "గొటుకూ-జి" అనే గుడి ఉంది. ఈ గుడిలో "మనేకి నెకో" (సైగ చేయు పిల్లి) అనే పిల్లి విగ్రహాన్ని ప్రతిష్ఠించి దైవంగా పూజిస్తున్నారు. అసలెందుకు ఈ పిల్లిని దైవంగా పూజిస్తున్నారో తెలిపే కథ కూడా ప్రచారంలో ఉంది.

అనగనగా ఒకరోజు ఒక రాజు గారు సెటగయా నగరంలోనుంచి వెళుతూ అలసిపోయి, సేదతీరడానికి ఒక చెట్టు కింద ఆగాడట! అది గమనించిన ఒక పిల్లి ఆ రాజుకు సైగ చేసి వేరే చోటుకు అతడిని తీసుకువెళ్ళింది. కొద్ది క్షణాల తర్వాత గాలీవానతో కూడిన వర్షం పడటం, ఇంతకుముందు ఆ రాజు నిలుచున్న ఆ చెట్టుమీదే పిడుగు పడటం జరిగింది. అది చూసిన ఆ రాజుగారు పిల్లిని తమ అదృష్ట దేవతగా భావించి కోట్లకొలది డబ్బు పెట్టి అక్కడ ఆ పిల్లికి ఒక గుడి కట్టించి, తమ కుటుంబ దేవాలయంగా మార్చుకున్నాడట. అప్పటి నుంచి ఆ గుడి, సైగ చేసే పిల్లి జపాన్ ప్రజలకు ఇష్ట దైవంగా మారింది. అదృష్టం, ఐశ్వర్యం తీసుకువస్తుందన్న గట్టి నమ్మకంతో జపాన్ దేశ ప్రజలు తమ ఇళ్ళల్లో, షాపుల్లో, వ్యాపార కేంద్రాల్లో ఈ పిల్లి బొమ్మను తప్పక ఉంచుకుంటారు.

## పిల్లల ముచ్చట

బుడిబుడి అడుగులతో, ముద్దుముద్దు మాటలతో, ఆటపాటలతో మురిపించే చిన్నారులంటే ఎవరికి మాత్రం ఇష్టం ఉండదు. కానీ ఆ ఇష్టం కాస్తా పిచ్చిగా మారితే! ఆ పిచ్చి కాస్తా పరాకాష్ఠకు చేరితే! దీనికి ఉదాహరణగా జాన్ మహ్మద్‌ను చెప్పుకోవచ్చు.

పాకిస్థాన్‌లోని బెలూచిస్థాన్ రాష్ట్రానికి చెందిన జాన్ మహ్మద్ వైద్యుడు. ఆయనకు పిల్లలంటే ఇష్టం. ఆ ఇష్టం ఎంతవరకూ వెళ్ళిందంటే, ఇప్పటివరకూ మూడు పెళ్ళిళ్ళు చేసుకుని 35 మందికి తండ్రయ్యాడు. అంతటితో ఆగకుండా వందమంది పిల్లలు కావాలంటున్నాడు. అందుకు నాలుగో పెళ్ళికి కూడా సిద్ధమేనంటున్నాడు జాన్. అలాగని అతడు స్థితిమంతుడా అంటే అదీ కాదు. వైద్యంతోపాటు కుటుంబాన్ని పోషించడానికి చిన్న చిన్న వ్యాపారాలు కూడా చేస్తున్నాడు. కుటుంబాన్ని పోషించడానికి నెలకి దాదాపు లక్ష రూపాయల వరకు ఖర్చవుతుందట మరి. మొత్తం కుటుంబం అంతటినీ ఓ చానెల్ వాళ్ళు వీడియో తీసి సోషల్‌మీడియాలో పోస్ట్ చేశారు. ఇప్పుడీ వీడియో వైరల్‌గా మారింది. ఈ పెద్ద కుటుంబాన్ని ఇప్పటికే మిలియన్ల మంది వీక్షించారు.

## చాలెంజ్



సోషల్ మీడియాలో రకరకాల చాలెంజ్‌లు. ఐస్ బకెట్, బెల్లీ బటన్.. ఇలా రకరకాలు. అవన్నీ సామాజిక మాధ్యమాల్ని ఒక ఊపు ఊపేశాయి. వీటిలో కొన్ని మంచి పనుల కోసం ఉపయోగపడితే, మరి కొన్ని నెటిజన్ల సరదా కోసం వెలుగులోకి వచ్చాయి. ఇప్పుడు మరో కొత్త చాలెంజ్ తెరపైకి వచ్చింది.

మామూలుగా స్త్రీలు జీరో సైజ్ కోసం ఆరాటపడుతుంటారు. అయితే ఇప్పుడు సరికొత్తగా చైనాలో ఏఫోర్ సైజ్ కోసం తెగ ముచ్చటపడిపోతున్నారు. ఏఫోర్ అనేది పేపర్ కదా! మరి బాడీషేప్‌కి, పేపర్‌కి సంబంధమేమిటి? అనుకుంటే పొరపాటే. ఇది నడుము సైజు. చైనా యువతులను ఏఫోర్ మేనియా పట్టుకుంది. నడుముకు ఏఫోర్ పేపర్‌ని అడ్డుపెట్టుకుని ఎంత ఫిట్‌గా ఉన్నామో చూసుకుంటున్నారు. ఫోటోలు దిగి సోషల్ మీడియాలో పోస్ట్ చేస్తున్నారు. ఆ ఫోటోలకు వచ్చే లైక్స్, కామెంట్లతో సంబరపడిపోతున్నారు అక్కడి యువతీమణులు. ఇలా ఏఫోర్ నడుము కోసం తిండి తగ్గించుకొని, ఇబ్బందులు కొని తెచ్చుకుంటున్నారని ఈ చాలెంజ్‌పై వ్యతిరేకత కూడా వ్యక్తమవుతుంది. సైజ్ కోసం ఎన్ని పాట్లో చూడండి.

## వృశ్చిక హోలీ



హోలీ అంటేనే రంగులు. చిన్నా పెద్దా తేడా లేకుండా ప్రతి ఒక్కరూ రంగులు చల్లుకుంటూ సందడి చేస్తారు. అయితే ఉత్తర ప్రదేశ్‌లోని ఆ గ్రామంలో మాత్రం రంగులు చల్లుకోరు. ఆ రోజున విషపూరితమైన తేళ్ళతో ఆడుకుంటారు. విడ్డూరంగా ఉంది కదూ!

ఉత్తరప్రదేశ్‌లోని కాన్పూర్ జిల్లా సౌంతనా గ్రామంలోని ప్రజలు హోలీ పండుగను వినూత్నంగా జరుపుకుంటారు. ఆ రోజున గ్రామంలోని భైసన్ దేవీ ఆలయం వద్దకు ఊరి ప్రజలంతా చేరుకుంటారు. పాగ్ పేరిట డప్పులు వాయిస్తూ, జానపద గీతాలు ఆలపిస్తూ తేళ్ళను చేతులు, కాళ్ళపై వేసుకుని నృత్యాలు చేస్తారు. అసలు ఆరోజున పాగ్ మొదలవుతుందనగానే యువతీ యువకులందరూ కలిసి ఆలయ సమీపంలో ఉన్న తేళ్ళను వెదికేందుకు వెళతారట. పట్టుకున్న తేళ్ళను అలా ఒంటి మీద వేసుకుని ఆరోజున ఎంతసేపు నృత్యం చేసినా అవి ఏమీ చేయవట. దాదాపు 70 ఏళ్ళ నుంచి ఈ వేడుకలు జరుపుతున్నామని, ఇప్పటివరకూ ఎవరినీ తేలు కరిచిన సందర్భం లేదని గ్రామస్థులు చెబుతున్నారు.

-నర్మద వాసిరెడ్డి

**'అడుగో... జుబ్బా రాజ్యానికి చక్రవర్తి అయిన మహాసుల్తాన్ సోదరుడు రహంతుల్లా...' నిలువెత్తున ఉన్న ఒక పర్సనాలిటీని చూపిస్తూ చిన్నకంఠంతో చెప్పాడు గార్డు.**

**'ఎక్కడినించో ఒక బంగారు పిచ్చికను పట్టుకు వచ్చాట్ట. ఈ మంటల హడావుడిలో ఆ పిచ్చిక తప్పించుకుపోయిందిట. ఘనీసుల్తాన్ జనాన్ని వెంట బెట్టుకుని వీధులన్నీ తెగ తిరుగుతున్నాడు..' ఘనీసుల్తాన్ అనే పెద్ద మనిషిని కూడా చూపిస్తూ వివరించాడు.**

ఏ పని మీద తను అక్కడికి వచ్చాడో అది పూర్తి అయిపోయినట్లు తెలిసిపోయింది నఫీజుకి. జాబిలమ్మ తప్పించుకున్నది. ఆమెను ఎత్తుకొచ్చిన వెధవ పిచ్చికుక్క మాదిరి సందుల వెంటా గొందుల వెంటా పరుగులు తీస్తున్నాడు. ఇంకా తను అక్కడే ఉండడం దేనికి?

సిద్ధంగా పట్టుకున్న చేతిలోని బక్కెట్‌ని విసురుగా కిందికి వదిలేశాడు అతను. 'అదేమిటి? ఏమయింది నీకు?' అని ఆశ్చర్యంగా అడుగుతున్న సెక్యూరిటీ గార్డు మాటల్ని వినిపించుకోకుండా పరుగు పరుగున శ్యామ్‌సుందర్ దగ్గరికి వచ్చేశాడు.

అప్పటికి మంటలు పూర్తిగా అదుపులోకి వచ్చేయటం వల్ల ఘాజీ పట్టణంలో కొంచెం ప్రశాంతత కనిపించడం మొదలు అయింది.

అయితే అది ఆ పట్టణంలో నివసించే వారికి మాత్రమే. రహంతుల్లా అనుచరులు, ఘనీసుల్తాన్ మనుషులు అందరూ గుంపులు గుంపులుగానే కనిపిస్తున్నారు.

'జాబిల్లి ఎక్కడికి పారిపోయి ఉంటుందని నీ భావన?' నఫీజుని అడిగాడు శ్యామ్‌సుందర్.

'నేను ఈ చుట్టుపట్ల పుట్టి పెరిగి పెద్దవాడిని అయివుంటే మీ ప్రశ్నకు సమాధానం చెప్పి ఉండే వాడిని' అన్నాడు నఫీజు.

నవ్వేశాడు శ్యామ్‌సుందర్. 'నా అభిప్రాయం ఏమిటంటే, మనం ఆ పిల్ల జాడల్ని ఎలా కనిపెట్టగలం?' తన మాటలకు అర్థాన్ని వివరించాడు.

సమాధానం చెప్పటానికి క్షణం కూడా ఆలోచించలేదు నఫీజు. 'ఘనీసుల్తాన్ జనాన్నికాని, రహంతుల్లా మనుషుల్ని గాని ఫాలో చేయాలి. ఆటోమేటిక్‌గా జాబిలమ్మ అడ్రసు తెలిసిపోతుంది' అన్నాడు.

పది క్షణాల పాటు ఆలోచించి తల ఊపాడు శ్యామ్‌సుందర్. 'మనం ఇసుకలో పడుకోబెట్టి వచ్చిన వాడికి తెలివివచ్చే ఉంటుంది. వాడు వచ్చి తనకు జరిగిన సత్కారాన్ని గురించి ఘనీసుల్తాన్‌కి చెప్పుకుంటే చాలా ప్రాబ్లం అవుతుంది. డైరెక్ట్‌గా చూశాడంటే డెఫినెట్‌గా గుర్తు పట్టేస్తాడు' అన్నాడు.

'రోట్లో తలపెట్టి రోకటి పోటుకు భయపడటం దేనికిసాబ్? ఇంతదూరం వచ్చిన తర్వాత ఇంకా మనం వాళ్ళకి భయపడటం అనవసరం. అటోఇటో తేల్చేసుకోవటం చాలా మంచిది' అంటూ ఖర్జూర చెట్టు దగ్గర నుంచి లేచి నిలబడ్డాడు నఫీజు.



# డేర్ డెవిల్

-మధుబాబు

24



మెచ్చుకోలుగా చూస్తూ అతని భుజం తట్టాడు శ్యామ్‌సుందర్. 'లెటజ్ గో' అంటూ తిరిగి ఎడారి వైపు నడక మొదలు పెట్టాడు.

●●●

ఖరీదైన తన మోటార్ వెహికల్ డోర్ మీద గబగబా ఎవరో చేతులతో తట్టిన సవ్వడి విని, విండో గ్లాస్‌ని కిందికి దించాడు కునికిపాట్లు పడుతున్న మహాసుల్తాన్.

'హుజూర్. మనం వెంటనే సిటీలోకి వెళ్ళి పోవాలి. ఆలస్యం చేయకూడదు' వినయంగా చెప్పాడు బయట నిలబడి ఉన్న బాడీగార్డు.

'సిటీలో పరిస్థితి ఏమిటి? మంటలు తగ్గి పోయాయా?' అడిగాడు మహాసుల్తాన్.

'ఆ సంగతి ఇంకా తెలియలేదు హుజూర్. కాని మనం ఇక్కడ ఒంటరిగా ఉండటం మాత్రం క్షేమం కాదనిపిస్తోంది' కొంచెం తొందరపడుతూ అన్నాడు ఆ గార్డు.

అప్పటివరకూ ఆ వెహికల్‌కి వెలుపలే నిలుచుని ఉన్నాడు డ్రయివర్. గబుక్కున డోర్‌ని తెరిచి స్టీరింగ్ ముందుకు చేరుకున్నాడు.

'ఏమిటి అంతతొందర? ఏమిటి విశేషం?' అని విసుగునిండిన కంఠంతో క్వశ్చన్ చేయబోయి, ఆ మాటల్ని వెంటనే ఆపేశాడు మహాసుల్తాన్.

తాము ఎక్కివచ్చిన ఒంటెల్ని ఒక ఇసుకదిబ్బ దగ్గర వదిలి, వేగంగా పరిగెత్తుకు వస్తున్న ఆయుధ ధారులు అనేకమంది కనిపించటమే అందుకు కారణం.

కనులు చిట్లించి మరీచూసి, ఉన్నట్లుండి చిన్నగా నవ్వేశాడు మహాసుల్తాన్.

'వాళ్ళు మన వాళ్ళే. రహంతుల్లా తన సేఫ్టీ కోసం నియోగించుకున్న ప్రైవేట్ సైన్యం. మనల్ని జాగ్రత్తగా సిటీలోకి తీసుకుపోవటానికే' అంటూ అదిరిపడి మాటల్ని ఆపేశాడు.

పరిగెత్తుకు వస్తున్న వాళ్ళు ఉన్నట్లుండి తమ వద్ద ఉన్న ఆయుధాల్ని ప్రయోగించటమే అందుకు కారణం.

చెవులు చిల్లులు పడే శబ్దాలు చేయటం మొదలు పెట్టాయి అవి. తమ ఆయుధాల్ని ఉపయోగించే అవకాశం మహాసుల్తాన్ అనుచరులకు లభించలేదు.

మహాసుల్తాన్ కారుకు పది గజాల దూరంలో ఉన్న వెహికల్స్ రెండూ సర్వనాశనం అయిపోయాయి. ఆయన వెహికల్‌కి ఉన్న విండోగ్లాసులు కూడా బద్దలై పోయాయి. అంతకుముందు వరకూ విండో దగ్గర నిలబడి ఉన్న బాడీగార్డు మొదలు నరికిన చెట్టు మాదిరి కిందికి పడిపోయాడు.

డోర్‌హేండిల్ మీద చెయ్యివేశాడు మహాసుల్తాన్. 'ద్రోహం. వంచన. వాళ్ళని సర్వనాశనం చేస్తాను' పళ్ళు పటపటమని కొరుకుతూ కిందికి దిగబోయాడు. సూటిగా వచ్చి ఆయన ఎడమ భుజం మీద దిగబడ్డాయి రెండు బుల్లెట్లు.

కారు డోర్ తెరువక ముందే కళ్ళు బైర్లు కమ్మి సీటు కిందకి జారిపోయాడు ఆయన.

'చంపండి చంపేయండి. కారుతో సహా సర్వనాశనం చేసేయండి' అని కేకలు పెడుతూ మరింత వేగంగా రావటం మొదలు పెట్టారు ఆయుధాలు ఉపయోగించటం మొదలుపెట్టిన సైనికులు.

ఇంజన్ స్టార్ట్ చేశాడు మహాసుల్తాన్ డ్రైవర్. అద్దాలు పగిలి పోయినా లెక్కచేయలేదు. పక్క భాగంలో దిగబడుతున్న బుల్లెట్లను లక్ష్యపెట్టలేదు. యాక్సిలేటర్ బలంగా అదిమి పట్టుకున్నాడు.

చెవులు చిల్లులు పడేటట్లు శబ్దం చేసింది కారు. ఇసుక తెరలు సృష్టిస్తూ ఎడారి మధ్య భాగంలోకి దూసుకుపోయింది.

'పట్టుకోవాలి. ప్రాణాలు తీసేయాలి. పారిపోనీయ కూడదు' అని ఒకరినొకరు హెచ్చరించుకుంటూ, ఇసుకదిబ్బ దగ్గర వదిలిన తమ ఒంటెల దగ్గరికి పరుగులు తీశారు సైనికులు.

●●●

'వాళ్ళవల్ల అయ్యే పనికాదు. విమానం మాదిరి దూసుకుపోతోంది ఆ కారు. దాన్ని చేజ్ చేయటానికి అటువంటి వాహనాలే ఉండాలి. ఈ ఒంటెలు దేనికీ పనికిరావు' ఇసుక దిబ్బకు వంద గజాల దూరంలో నుంచి ఆ దృశ్యాన్ని చూస్తూ కామెంట్ చేశాడు నఫీజు.

చెవులు చిల్లులు పడేటట్లు వికృత ధ్వనులు చేస్తూ ఎడారి మధ్య భాగంలోకి పరుగులు తీస్తున్న ఒంటెల దళాన్ని చూస్తూ, అతని మాటలకు తల ఊపాడు శ్యామ్‌సుందర్.

'ఇప్పుడు ప్రశ్న ఏమిటంటే పారిపోతున్న కారును వాళ్ళు పట్టుకోగలరా లేదా అనేదికాదు. ఆ కారులో ఉన్న పెద్దమనిషి ప్రాణాలతో ఉండి ఉంటాడా?' లేదా అని అడిగాడు.

అందుకు తన అభిప్రాయాన్ని వెల్లడించే అవ

## జరిగిన కథ

జుబ్బా కొండల్లో నిక్షిప్తమైన నిధికోసం జుబ్బా రాజ్య మహాసుల్తాన్ అన్వేషిస్తూ ఉంటాడు. ఫిలోలజి సబ్జెక్టు చదివే జాబిల్లికి పురాతన లిపిలో ఉన్న పత్రాలిచ్చి అధ్యయనం చేయమంటాడు మహాసుల్తాన్. అతడి సోదరుడు రహంతుల్లా ఆ నిధిని కాజేసేందుకు జాబిల్లిని కిడ్నాప్ చేస్తాడు. అతడి చెర నుంచి తప్పించుకున్న జాబిల్లి ఘనీసుల్తాన్ మనుషులకు దొరికిపోతుంది. గూఢచారి శ్యామ్‌సుందర్, నఫీజు ఇద్దరూ జాబిల్లిని వెతుక్కుంటూ ఘాడీ పట్టణం వస్తారు. జాబిల్లి అక్కడే ఉందని తెలుసుకుని ఆమె జాడ కనిపెట్టే ప్రయత్నాలు ముమ్మరం చేస్తారు.

ఆ తర్వాత....

కాశం నఫీజుకి లభించలేదు. గుంపులు గుంపులుగా తన వెనుక ఉన్న అనుచరుల్ని, ఘనీసుల్తాన్ మనుషుల్ని పెద్ద కంఠంతో హెచ్చరిస్తూ ఆ ప్రదేశంలోకి వచ్చేశాడు రహంతుల్లా.

నాశనమైపోయిన రెండు వెహికల్స్‌ని, ప్రాణాలు వదిలిన బాడీగార్డుల్ని చూసీ చూడటంతోనే సంతోషంతో చిందులు తొక్కినంత పనిచేశాడు.

'నా సోదరుడిని అణగదొక్కి సింహాసనాన్ని దక్కించుకోవటం చాలా కష్టమైపోతుందన్న అనుమానంతో, దేశంకాని దేశానికి పోయి ఆ పికిలి పిట్టని పట్టుకు వచ్చాను. ఇంత తేలికగా పని జరిగిపోతుందని ముందే తెలిసి ఉంటే పొరపాటున కూడా ఆ పని చేసేవాడిని కాదు' సంతోషంగా అన్నాడు.

'ఇంకా మీ సోదరుల వారు మీ చేతికి చిక్కలేదు కదా హుజూర్' వినయంగా అన్నాడు ఘనీ సుల్తాన్.

'ఒంటరిపక్షి... కాపాడటానికి వెంట బాడీగార్డులు లేరు. ఎంత వేగంగా వెళ్ళినా, ఎక్కడో ఒకచోట ఆ కారు ఆగిపోక తప్పదు. వెంటపడి తరుముతున్న నా సైనికులకు దొరికి పోకా తప్పదు. జుబ్బా సింహాసనం ఇక నాదే' సగర్వంగా ఎనౌన్స్ చేశాడు రహంతుల్లా.

'వాడి మాటల్లో నిజం ఉంది శ్యామ్‌సాబ్. ఇప్పుడు గనుక వాడు వెళ్ళి సింహాసనం మీద కూర్చుంటే ఆ ముసలి సుల్తాన్ వాడిని ఏమీ చేయలేకపోవచ్చు' ఆ గుంపులకు కనిపించకుండా దిబ్బ చాటుకు జరిగి కూర్చున్న నఫీజు అన్నాడు శ్యామ్ సుందర్‌తో.

'వాళ్ళూ వాళ్ళూ ఎలా కొట్టుకున్నా మనకి అనవసరం. మనం మన పనిమీద కాన్‌సన్‌ట్రేట్ చేయాలి. మన నెక్స్ట్ స్టెప్ ఏమిటో డిసైడ్ చేసుకోవాలి' అన్నాడు శ్యామ్‌సుందర్.

'రహంతుల్లాని అనుసరించటమే బెస్ట్. పైకి ఎన్ని మాటలు చెప్పినా వాడు జాబిలమ్మని వెతకటం మానడు' అన్నాడు నఫీజు.

తల ఊపాడు శ్యామ్‌సుందర్. 'మంచి ఒంటెల్ని రెండింటిని సంపాదించాలి. అందుకు మన దగ్గర పైసలు ఉండాలి. అవి తప్ప అన్నీ ఉన్నాయ్ మన దగ్గర' పాంటు జేబులు తడుముకుంటూ చిన్నగా చెప్పాడు.

తన జేబుల్లో నుంచి గుప్పెడు నాణేలు తీసి అతనికి చూపించాడు నఫీజు. 'మనం చేసిన ఎడ్వెంచర్‌కి సంతోషించి దానోబూ నాకు ఇచ్చిన సొమ్ము ఇది' అవి తన దగ్గరికి ఎలా వచ్చాయో వివరిస్తూ చెప్పాడు.

చిన్నగా నవ్వి అతని భుజం తట్టాడు శ్యామ్ సుందర్. 'రెండు ఒంటెలు అవసరం లేదు. ఒకటి చాలు. ఆహారం కూడా కావాలి. చీకటి సమయంలో కప్పుకోవటానికి రెండు కంబళీలు కూడా అవసరమే' అంటూ ఎడారి ప్రయాణానికి అవసరమైన లిస్టు చదివాడు.

**జుబ్బారాజ్య నేతగా బాధ్యతలు చేపట్టాడు రహంతుల్లా. మహాసుల్తాన్ హంతకులను పట్టి శిక్షిస్తానని ప్రజలకు వాగ్దానం చేశాడు. ఆ మాటలు నమ్మలేదు మహాసుల్తాన్ కూతురు. తన తండ్రిని చంపింది తన బాబాయేనని గ్రహించింది. అతడిని మట్టుపెట్టేందుకు ఒక భూతం సహాయం కోరింది! మరి ఆ భూతం ఆమెకు సాయం చేసిందా?**

తన సైనికుల చేతిలో హతమారిపోయిన బాడీగార్డుల శరీరాల్ని అలాగే ఇసుకలో వదిలిపెట్టి సిటీలోకి బయలుదేరాడు రహంతుల్లా. అతనికిగాని, అతని అనుచరులకు గాని, అందరికంటే వెనుకగా నడుస్తున్న ఘనీసుల్తాన్‌కి గాని కనిపించకుండా తాము కూడా సిటీలోకి పయనమైనారు నఫీజు, శ్యామ్‌సుందర్.

•••

ఎనిమిది అడుగులలోతు వెయ్యిగజాల వైశాల్యం కలిగి ఉన్న ఒక ఒయాసిస్ దగ్గర వెలసింది జుబ్బా పట్టణం.

ఆ పట్టణానికి రెండు ఫర్లాంగుల దూరంలో మహాసుల్తాన్ నివసించే కోటవంటి పెద్ద పాత కాలపు భవంతి నిర్మాణం ఉంది.

శుభ్రంగా ఉన్న వస్త్రాలను ధరించి రంగురంగుల జెండాలను పట్టుకుని ఆ భవనం దగ్గర నిలబడ్డారు జుబ్బా పట్టణంలో నివసించే ఆడ మగ ముసలి ముతక ప్రజలందరూ. పెద్దపెద్ద గొంతుకలతో తమ నూతన పరిపాలకుడికి జేజేలు పలికారు.

'ఘాడీ పట్టణంలో జరిగిన అగ్నిప్రమాదాన్ని తమకు అనుకూలంగా మలచుకుని, నాకు దైవ సమానుడైన నా సోదరుడిని అన్యాయంగా హత మార్చారు ఎవరో శత్రువులు. వారి ఆచూకీ కనిపెట్టటానికి నా సైనికులు ఎడారి అంతా గాలిస్తున్నారు. ఆ దుర్మార్గులు ఎంతటివారైనా, ఎంతమంది ఉన్నా పట్టుకుని మీ అందరూ చూస్తూ ఉండగా తలలు నరికిస్తానని మీ అందరి సమక్షంలో ప్రమాణం చేస్తున్నాను. మీరందరూ నన్ను ఆశీర్వదించండి' వినయంగా తలవంచుతూ చెప్పాడు రహంతుల్లా వారందరికీ.

ఆకాశం అదిరిపోయేటట్లు మరోసారి బిగ్గరగా అతనికి జయజయధ్వానాలు చేశారు జుబ్బా పౌరులు.

'జాబిలమ్మ వాడికి దొరకలేదు. మహాసుల్తాన్ కూడా చేతికి చిక్కలేదు. ఆ రెండు పనులు జరిగే వరకూ వాడి చంచాలు ఎడారిలో తిరుగుతూనే ఉంటారు. ఎవరికీ అనుమానం రాకుండా భలే కవర్ చేసుకున్నాడు' అన్నాడు నఫీజు. గుమికూడి ఉన్న జనానికి వెనుకగా, ఎడారిగాలి మొఖాలకు తగలకుండా పెద్దపెద్ద తలపాగాలు చుట్టుకుని, తమ మొఖాలను తలపాగా అంచులతో చక్కగా మరుగు పరుచుకున్నారు నఫీజు, శ్యామ్‌సుందర్.

'ఇప్పటివరకూ వీడు ఏ పని చేసినా మహాసుల్తాన్‌కి తెలియకుండా రహస్యంగా చేస్తూ వస్తున్నాడు. ఇప్పుడు ఆ భయంపోయింది. మనం చాలా జాగ్రత్తగా ఉండాలి. ఏ క్షణంలో ఏం జరుగుతుందో చెప్పలేం' అన్నాడు శ్యామ్‌సుందర్.

'డోన్ట్‌వర్రీ శ్యామ్‌సాబ్. వాడి బిల్డింగ్‌ని కవర్ చేసే చోటుని సెలక్ట్ చేసుకుని కూర్చుందాం' అంటూ నెమ్మదిగా తమ ముందున్న గుంపును వదిలి దూరంగా బయలుదేరాడు నఫీజు.

జుబ్బా నగరానికి నీరు సరఫరా చేసే ఒయాసిస్‌కి కొంచెం అవతలగా ఉన్నది పెద్ద ఖర్జూరచెట్ల గుంపు.

తెల్లటి పువ్వులుపూచే చిన్నచిన్న ఎడారి పొదలు ఆ చెట్ల కింద చాలా దట్టంగా పెరిగి కనిపిస్తున్నాయి.

'మనం ఈ పొదల్లో మకాం పెడదాం. ఆ బిల్డింగ్ ఇక్కడికి క్లియర్‌గా కనిపిస్తుంది' ఆ పొదల్ని చూపిస్తూ అన్నాడు శ్యామ్‌సుందర్. ఆ చెట్లకు మధ్యభాగంలో కనిపించిన చిన్నపల్లపు ప్రదేశంలో తాము తెచ్చుకున్న కంబళీలు పరిచాడు నఫీజు. తమ నీటి సంచుల్ని' రొట్టెల ప్యాకెట్లను కూడా అక్కడే పెట్టాడు.

'చీకటిపడే వరకూ నేను ఒక కునుకు తీస్తాను. మీరు బిల్డింగ్‌ని వాచ్‌చెయ్యండి. చీకటి పడిన తర్వాత నేను డ్యూటీ ఎక్కుతాను' అంటూ శ్యామ్ సుందర్ సమాధానం కోసం ఎదురు చూడకుండా కంబళీలమీద ముడుచుకు పడుకున్నాడు నఫీజు.

చెట్లగుంపు ముందు భాగంలోకి పోయి, పొదల మధ్య కూర్చున్నాడు శ్యామ్‌సుందర్. దృష్టినంతా ముఖద్వారం మీదనే కేంద్రీకరించి వెయిట్ చెయ్యటం మొదలు పెట్టాడు.

•••

తన పాదరక్షల్ని కంబళీలకు దూరంగా వదిలి, వట్టి పాదాలతోనే పడుకున్నాడు నఫీజు.

సాయం సమయంలో పాదాల దగ్గర ఏదో కదిలినట్లు అనిపించి, ఒక్కసారిగా కళ్ళు తెరిచాడు.



పాదాలవైపు చూసుకునేసరికి ఝల్లుమన్నది అతని శరీరం. దాసోజు కొడుకును కాటు వేయబోతుం డగా తాను బరిశె విసిరి ఏ పాము ప్రాణాలు తీశాడో, సరిగ్గా అటువంటి పామే అతని పాదాలకు ఆరు అంగుళాల దూరంలో చుట్టలు చుట్టుకుంటోంది.

చెమటలు పట్టేశాయి నఫీజుకి. గొంతు ఎండుకు పోయినట్లుగా అనిపించింది.

తనలో ఏ మాత్రం కదలిక కనిపించినా, వేగంగా తల విసిరి కొడుతుంది అది. చిటికెలో ప్రాణాలు తీసేస్తాయి.

దానికి అనుమానం రాకుండా శ్యామ్‌సుందర్‌ని పిలిచే అవకాశం ఉందేమోనని తల పక్కకు తిప్ప బోయాడు.

సరిగ్గా అదే సమయంలో అతను విశ్రాంతి తీసుకుంటున్న ఆ పల్లపు ప్రదేశానికి పాతిక అడు గులు అవతల నుంచి వినవచ్చింది ఒక కంఠం.

నల్లటి నాలుకల్ని వేగంగా కదిలిస్తూ నఫీజు పాదాల వంకే చూస్తున్న పాము తల చటుక్కున తిరిగింది ఆ శబ్దం వినవచ్చిన వైపు.

'వద్దు బేటీ, అటుపోవద్దు అసలే రోజులు బాగో లేవు. మనం మనకోటను వదిలి బయటికి రావ టమే పెద్ద తప్పు' అంటోంది ఆ కంఠం.

మగవారి గొంతు కాదు అది. ముప్పది సంవ త్సరాలకు పైబడిన ఒక ప్రౌఢ స్త్రీ కంఠం.

శ్యామ్‌సుందర్‌ని పిలవాలన్న కోరికను వెంటనే మర్చిపోయాడు నఫీజు. తన పాదాల దగ్గరే సిద్ధంగా ఉన్న పామును గురించి కూడా పట్టించుకోకుండా చెవులు రిక్కించాడు.

'నేను ప్రార్థన చేసుకోవాలి. నాకు ఏకాంతం కావాలి' అంటూ వినవచ్చింది ఇంకో కంఠం.

తియ్యగా ఉంది అది. అప్పుడప్పుడే పాడటం నేర్చుకుంటున్న కోయిల మాదిరిగా ధ్వనిస్తోంది.

'చిన్నపిల్ల. బహుశా ఆరేడు సంవత్సరాల వయసు ఉంటుంది' తనలో తను వెంటనే అనుకు న్నాడు నఫీజు.

'ప్రార్థన చేసుకోవాలంటే మన కోటలో చేసుకో వచ్చు. ఇలా చెట్ల కిందా ఇసుక గుట్టల దగ్గిరా చేసుకోవాల్సిన అవసరం లేదు. నా మాటవిను తల్లీ. వెళ్ళిపోదాం వెనక్కి' బతిమాలుకోవడం మొదలు పెట్టింది ప్రౌఢ కంఠం.

'కోటలో బాబాయి ఉన్నాడు. నా ప్రార్థన వింటే నన్ను కూడా చంపించేస్తాడు' అంది చిన్నకంఠం.

'తప్పుతల్లీ. బాబాయి నీకు పూజ్యనీయుడు. నీ తండ్రి గారిని హతమార్చిన వాళ్ళమీద పగ తీర్చు కుంటానని ఇందాక అందరి ఎదుటా ప్రమాణం చేశాడు. నువ్వూ విన్నావుగా' అన్నది పెద్ద కంఠం.

'అబద్ధాలు. అన్నీ వట్టి కట్టుకథలు. నా తండ్రి గారిని బాబాయే చంపించి ఉంటాడు. సందేహం లేదు. మా కోటను తను తీసుకోవటానికి చాలా కాలం నుంచి ప్రయత్నాలు చేస్తున్నాడు' కోపంగా అన్నది చిన్నగొంతు.

'తప్పమ్మా. అటువంటి మాటలు మాట్లాడ కూడదు. మీ బాబాయి వింటే నీకు చాలా ప్రమాదం' భయంగా హెచ్చరించింది పెద్దగొంతు.

'నాకు తెలుసు. అందుకే ప్రార్థన చేసుకోవ టానికి ఇటుగా వచ్చాను'

'ఏమని ప్రార్థిస్తావు తల్లీ?'

'అది ఎవరికీ చెప్పకూడదు. నువ్వు వెళ్ళి దూరంగా కూర్చో. నా ప్రార్థన పూర్తైన తర్వాత పిలుస్తాను వెళ్ళు' కచ్చితమైన మాటలతో పెద్ద కంఠాన్ని హెచ్చరించింది చిన్నగొంతు.

తన పాదాల దగ్గర చుట్టలు చుట్టుకొని ఉన్న మృత్యువును గనుక చూసి ఉండకపోతే, నవ్వుతూ పైకిలేచి, తనుకూడా దూరంగాపోయి ఉండేవాడు నఫీజు.

దూరంగా పోవటం మాట దేవుడెరుగు. అంగు ళంలో ఆరోవంతు అవతలికి జరిగిన వెంటనే తల విసరటానికి సిద్ధంగా కనిపిస్తోంది ఆ పాము.

ఆమెను చూసేసరికి.

ముట్టుకుంటే మరక పడేంతగా మెరిసిపోతోంది శరీరం. చంద్రబింబం మాదిరి ఉన్నది మొఖం.

'భగవంతుడా... ప్రమాదం ముంచుకు వచ్చి నప్పుడు నా పేరు మీద సహాయం అర్థించమని నా తండ్రి చెప్పారు' చేతులు జోడించి తల వంచు కుని ప్రార్థన మొదలు పెట్టింది ఆ బిడ్డ.

'నాకు సహాయం చెయ్యటానికి నీ దూతని వెంటనే పంపించు. నీ దూతని పంపించటానికి వీలు పడకపోతే ఒక మంచి భూతాన్నయినా సరే వెంటనే పంపించు. దయ్యం వంటి మా బాబా యిని ఎదిరించటానికి భూతాలే బాగుంటాయి'.

## పూర్ణబిందువు




చిగురులా, పువ్వులా
రసరమ్య గీతికలా
అతని భార్య.
ముత్యాల్లా, మంచుకణికల్లా
పిల్లలు.
అతడొక పున్నమి చంద్రుడు
సంసార కావ్యంలో
గుడిగంటలా నిస్వనించే
పూర్ణబిందువు

తనువుకి తరువుకు మాదిరిగా
ఋతుచక్రం ఉండదు.
తరలిపోయిన వసంతం
తిరిగి వచ్చి చిగురించదు
వేసే ప్రతీ అడుగూ శిశిరంవైపే.

ఇకమీదట ఉన్నత శిఖరాల నుంచి దూకే
జలపాతాలుండవు.
ఆనవాళ్ళుగా చారికలే మిగులుతాయి.
నాగరికత జారుడుమెట్ల మీద
ధనరాశుల పాకుడు రాళ్ళమీద
ప్రయాసపడుతూ సంతానం
ఇక తన శాసనం చెల్లని నాణెమే,
తన రాజ్యాంగం శిథిల సింహాసనమే!

పూర్ణబిందువులాంటి తాను
'విసర్గ'గా విభాజ్యమై
రెండు కన్నీటి బొట్లుగా
రాలి ఇంకిపోతాడు

మూడో తరానికి చాకిరీ చేస్తూ
అరిగిపోతూ, విరిగిపోతూ
'అర్థాంగి' అరసున్నాలా....!

అంతేమరి-
జీవితం చక్రం కాదు
సరళంగా, వక్రంగా సాగే రేఖ
ఏదో బిందువు వద్ద తెగిపోతుంది.




-డా. వై.రామకృష్ణారావు
సెల్: 89857 43964

'నువ్వు చేసుకునే ప్రార్థన ఏదో ఇక్కడికి దూరంగా చేసుకోతల్లీ ఇటువైపు వచ్చి నన్ను ఇబ్బందుల్లో పెట్టకు' అని నఫీజు తనలో తను అనుకుంటూ పాము మీద దృష్టి కేంద్రీకరించ బోతుండగా, పల్లపు ప్రదేశానికి సరిగ్గా ఆరు అడు గుల దూరంలోకి వచ్చి, ఒక ముళ్ళపొద ముందు మోకరించి కూర్చున్నది ఆరు సంవత్సరాల వయస్సు ఉన్న ఒక బాలిక.

మతిపోయినంత పని అయింది నఫీజుకి

పాము బారినపడకుండా తన పాదాల్ని ఎలా ఇవతలకి లాక్కోవాలో తెలియక అయోమయా వస్థలో ఉన్న నఫీజుకి ఆగలేదు నవ్వు. తనకు తెలియ కుండానే బిగ్గరగా నవ్వేశాడు అతను.

అతని ఎడమ పాదం మీద తన దృష్టి కేంద్రీ కరించి ఉంది ఆ పాము. అనుకోనివిధంగా విన వచ్చిన ఆ విచిత్రమైన శబ్దాన్ని ఆలకించి తల పైకి ఎత్తింది.

ఎంత బిగపట్టుకున్నా నవ్వు ఆగకపోవటంతో

నవ్వుతూనే ఉన్నాడు నఫీజు. నవ్వుతున్నప్పుడు కూడా తన బాలెన్స్‌ని కోల్పోలేదు. ముందుకు వంగి ఉన్న పాము తల ఉన్నట్లుండి పైకిలేవగానే వెంటనే కంటికి కనిపించనంత వేగంతో పాదాల్ని వెనక్కి లాగేసు కున్నాడు.

తను మోసపోయాననుకున్నది కాబోలు, బుస్సు మని రొద చేస్తూ తల ముందుకు విసిరింది పాము.

అటువంటి ప్రమాదం ఉంటుందని నఫీజుకి తెలుసు. డిస్కవరీ చానెల్లో అటువంటి సన్నివే శాల్ని చాలాసార్లు చూసి ఉండటంవల్ల, కొంచెం కూడా తడబడలేదు. మెరుపుకంటే వేగంగా చేతిని ముందుకు జాచి ఆ పాము మెడ ఒడిసి పట్టు కున్నాడు.

తల వంచుకుని తదేకంగా ప్రార్థన చేస్తున్న బిడ్డకి ఆ పాముచేసిన శబ్దం, నఫీజు నవ్వు రెండూ వినిపించి పల్లంలోకి చూసింది.

'హాయ్‌బేబీ ఎలా ఉన్నావు? క్షేమమేనా?' ఆమెకు కనిపించకుండా మాయం అవటానికి అవసరమైన టైములేక పోవడంవల్ల, పరిగెత్తడం మొదలుపెడితే, అరిచి కేకలు పెడుతుందని, భయం కలగటం వల్ల, నిదానంగా నిలబడుతూ మృదువుగా అడిగాడు నఫీజు.

'నువ్వు వచ్చావు. నువ్వు భూమిలో నుంచి వచ్చావు. పాముని పట్టుకుని వచ్చావు కాబట్టి దూతవి కాదు. భగవంతుడు నా ప్రార్థన ఆలకించి భూతాన్నే పంపించాడు' పొద దగ్గరనుంచి లేచి నిలబడి ఆనందంగా అన్నది ఆ బిడ్డ.

తల గిర్రున తిరిగినట్లయింది నఫీజుకి. తను భూతం కాదని అంటే ఆ బిడ్డ భయంతో బిగ్గరగా కేకలు పెడుతుంది. బిల్డింగ్ దగ్గరవున్న వాళ్ళకి విన బడితే తమ కొంప మునిగిపోతుంది.

'భూతాన్నే బేబీ. వట్టిభూతాన్ని కాదు. మహా మడ్డి భూతాన్ని. అల్లాఉద్దీన్ అద్భుత దీపం కథలో దీపం భూతం మాదిరి తలవంచి అభివాదం చేస్తూ ఒప్పుకున్నాడు.

చంద్రబింబం వంటి తన అందమైన మొఖం అమితమైన సంతోషంతో మరింత అందంగా మారి పోతుండగా, చప్పట్లు కొట్టింది ఆ బిడ్డ.

'నా పేరు బేబీ కాదు. నదియా. మహాసుల్తాన్ నా తండ్రి. నేను పుట్టగానే నా తల్లి చనిపోయింది. నా తండ్రికి నేను ఒక్కదాన్నే' ఉన్నట్లుండి కళ్ళు నీటితో నిండి పోతుండగా చెప్పింది ఆ బిడ్డ.

అప్పటివరకూ దూరంగా కూర్చుని ఉన్న ఒక పెద్దావిడ అర్జంటుగా అటుకేసి వస్తూ ఉండటాన్ని గమనించాడు నఫీజు. చీమలు జెర్రులు పాకినట్లు జలదరించింది అతని శరీరం.

ఎంతో ప్రయత్నంమీద తన కలవరాన్ని తన లోనే దాచి పెట్టుకున్నాడు. 'భగవంతుడు నా మీద ఎంతో అభిమానం చూపిస్తున్నాడు బేబీ' అన్నాడు బిడ్డతో.

'నా పేరు బేబీ కాదు. నదియా అని చెప్పాను కదా" తన విచారం నుంచి వెంటనే బయటపడి అతనికి తన పేరును గుర్తు చేసింది ఆ బిడ్డ.

దగ్గరికి వచ్చేసింది పెద్దావిడ. 'ఎవరు? ఎవరు నువ్వు? ఏం చేస్తున్నావు ఇక్కడ?' అని అడుగుతూ అంతటితో ఆగకుండా పక్కకు తిరగబోయింది. కోటవంటి బిల్డింగ్ దగ్గర ఉండే కాపలా వారిని పిలవటానికి.

'ఆగు జమేలీ, ఆగిపో. ఇతను మనిషికాదు. భూతం. భగవంతుడు నా ప్రార్థన విని నాకు సహాయం చేయటానికి పంపించిన మడ్డి భూతం. ఇసుకలో నుంచి వచ్చాడు. చేతిలో ఎంత పెద్ద పామును పట్టుకున్నాడో చూడు' అంటూ ఆమెను హెచ్చరించింది బిడ్డ.

కాపలా వాళ్ళని పిలవటానికి తెరిచిన నోరు తెరిచినట్లుగానే ఉండిపోయింది జమేలీకి. తన చెవుల్ని తానే నమ్మలేనట్లు గుడ్లు మిటకరిస్తూ చూసింది నఫీజు వంక.

తలవంచి ఆమెకు కూడా ఒక సలాం చేశాడు అతను. 'ఏమిటి నీ ఆజ్ఞ అందమైన నదియా?' అని బిడ్డని అడిగాడు.

'మా బాబాయిని వెంటనే చంపి అవతల పారేయ్' తడుముకోలేదు బిడ్డ.

'తప్పు తల్లీ. అలా మాట్లాడకూడదు తప్పు' వెంటనే వారించింది జమేలీ.

'అలాగా, అయితే చంపబోకు. పెద్ద పందికొక్కుగా మార్చేసి తీసుకుపోయి జుబ్బా కొండల్లో వదిలేయ్' తన ఆజ్ఞను కొంచెంగా మార్చింది నదియా.




తీవ్రంగా బాధపడిపోతున్నట్లు దీనాతిదీనంగా మొఖంపెట్టి తల విదిలించాడు నఫీజు.

'ఏమిటి ఆలోచిస్తున్నావు? ఎందుకు ఆలస్యం?' అసహనంగా అడిగింది నదియా.

'అందగత్తెల్లోకల్లా మహా అందగత్తె అయిన నదియా బేబీ అనుమతి ఇస్తే ఒక చిన్న విజ్ఞాపన చేసుకుంటాను' తల వంచుకుంటూ దీనంగా అన్నాడు నఫీజు.

'నువ్వు చెప్పదలుచుకున్నది ఏమిటో వెంటనే చెప్పేయ్. నేను ఏమీ అనుకోను. నీకు అనుమతి ఇస్తున్నాను' హుందాగా అన్నది నదియా.

'భూతాల్లో కెల్లా మహామడ్డి భూతాన్ని నేను. నాకు మెదడు సరిగ్గా లేదు. జ్ఞాపకశక్తి చాలా తక్కువ. మా గురువులు నేర్పిన మంత్రాలన్నిటినీ ఎప్పుడో మర్చిపోయాను. ఒక్క పాముల్ని పట్టుకు తిరగటం తప్ప నాకు వేరే విద్యలు ఏమీ గుర్తు లేవు. మీ బాబయ్య గారిని పందికొక్కుగా మార్చటం నా వల్లకాదు' చిన్న కంఠంతో చెప్పాడు నఫీజు.

నిరాశగా చూడటమో, అసహనంగా తల విది లించటమో ఏదీ చేయలేదు నదియా. ముందుకు అడుగువేసి అతని ఎడమచేతిని పట్టుకున్నది అను నయంగా.

కుడిచేతిలో మెలికలు తిరుగుతున్న పామును వెంటనే దూరంగా పెట్టి పట్టుకున్నాడు నఫీజు.

ఆందోళనగా చూసిన జమేలీ కనుల్లో ప్రత్యక్షం అయిన రిలీఫ్ అతనికి కనిపించింది.

'బాధపడకు భూతం. మరేం పరవాలేదు. భగ వంతుడు నిన్ను పంపించాడు. నాకు అదే సంతోషం. ఇంతకీ నీకు పేరు ఏదైనా ఉన్నదా?' అడిగింది నదియా.

నఫీజు అంటాయి నాతోటి భూతాలు. కోపం వచ్చినా, ప్రేమ పెరిగినా ఒరేయ్ నఫీజుగాడా అని కూడా పిలుస్తాయి' చెప్పాడు అతను.

'ఇంత పెద్దభూతాన్ని పట్టుకుని అరేయ్ ఒరేయ్ అనటం ఏమీ బాగోదు. నిన్ను నఫీజూ అనే పిలు స్తాను' చెప్పింది నదియా.

'తల్లీ చీకటి పడిపోతోంది. ఆలస్యం అయితే బాబయ్యగారికి వర్తమానం వెళుతుంది' ఉన్నట్లుండి హెచ్చరించింది జమేలీ.

'పద నఫీజూ. భవనంలోకి పోదాం' నఫీజు చెయ్యి వదలకుండా చెప్పింది నదియా.

'అయ్యబాబోయ్. నేను ఎందుకు నదియా?' ఆందోళన నటిస్తూ అడిగాడు నఫీజు.

'మడ్డిగా ఉన్నావు. స్నానం చేద్దువు గాని. మంచి దుస్తులు తెప్పిస్తా. మంత్రాలు మర్చిపోయావు కదా. నీ అంతట నువ్వు ఏమీ చేయలేవు' చెప్పింది నదియా.

తలతిప్పి జమేలీ వైపు చూశాడు నఫీజు.

'ఇవాల్టికి నీ భూతాన్ని ఇక్కడే వదిలేద్దాం తల్లీ. రేపు వచ్చి మన వెంట తీసుకుపోదాం. నీ భూతాన్ని నువ్వు నేను తప్ప వేరెవరూ చూడ కూడదు' అన్నది జమేలీ.

రెండు క్షణాలు ఆలోచించి తల ఊపింది నదియా.

**(ఇంకావుంది)**

# వైన్ మంచిది కాదు

పరిమిత మోతాదులో వైన్ తాగితే గుండె ఆరోగ్యానికి మంచిదన్న విషయం గతంలో నిర్వహించిన కొన్ని అధ్యయనాల్లో వెల్లడైంది. అయితే ఈ అభిప్రాయం తప్పంటున్నాయి తాజా అధ్యయనాలు. వైన్ తగు మోతాదులో తీసుకుంటే గుండె ఆరోగ్యంగా ఉంటుందన్న కొందరి మాటలను ఈ అధ్యయనాలు తోసి పుచ్చాయి. గుండె జబ్బుతో బాధపడుతున్న కొందరి మీద వీరు అధ్యయనం చేశారు. వీరిలో కొందరికి తగు మోతాదులో కొన్ని రోజుల పాటు వైన్ ఇచ్చి అనంతరం వారి ఆరోగ్యాన్ని పరిశీలించారు. వైన్ తాగని వారిలోనూ, తాగిన వారిలోనూ ఎలాంటి మార్పునూ వీరు గమనించలేదు. వైన్ తాగినంత మాత్రాన గుండె ఆరోగ్యంగా ఉంటుందన్న విషయం కచ్చితంగా చెప్పలేమని వీరు అంటున్నారు.






# సన్నబడాలనుకుంటున్నారా? కిచెన్ శుభ్రం చేయండి

సన్నబడటానికీ, కిచెన్ శుభ్రంగా ఉండడానికీ లింకు ఏమిటి? అని ఆశ్చర్యం కలగడం సహజమే! వంటగది శుభ్రంగా ఉంటే బరువు తగ్గడం సులభం అంటున్నారు పరిశోధకులు. బరువు తగ్గే క్రమంలో ఉన్న కొంతమంది మహిళల మీద ఆస్ట్రేలియాలోని న్యూ సౌత్ వేల్స్ యూనివర్సిటీ వారు పరిశోధనలు నిర్వహించారు. వంటగదిలో చెత్తా చెదారం, సింకు అపరిశుభ్రంగా ఉండటం, ప్లాట్‌ఫాం మీద చిందరవందరగా వంటపాత్రలు, పొయ్యి మీద ఈగలు, చీమలు ఇవన్నీ కూడా తెలియకుండా మానసిక అశాంతి కలిగిస్తాయని వారు అంటున్నారు. అపరిశుభ్రంగా ఉన్న వంటగదిలో కూర్చుని లేదా దానిని చూస్తూ భోజనం చేసేవారిలో ఒత్తిడి, ఆందోళన వారికి తెలియకుండానే పెరిగిపోతాయనీ, దాని వల్ల భోజనాన్ని బాగా నమిలి మింగకుండా, త్వరత్వరగా తినడం లేదా తినవలసిన దాని కన్నా ఎక్కువగా తినడం చేస్తారన్న విషయం పరిశోధనలో వెల్లడైంది. పరిశుభ్రంగా ఉన్న వంటగదిలో భోజనం చేసేవారు గది పరిసరాలు చూస్తూ, శుభ్రతను ఆనందిస్తూ నెమ్మదిగా భోజనం చేస్తారనీ, దీంతో తాము ఎక్కువ సేపు భోజనం చేస్తున్నామన్న భ్రమలో తినవలసిన దాని కన్నా కొద్దిగా తక్కువ తింటారనీ వారు చెబుతున్నారు. ఒక్క వంటగదే కాకుండా భోజనం చేసే గది, టేబులు, దాని పరిసరాలు పరిశుభ్రంగా, అందంగా ఉంచుకోవాలని వారు సూచిస్తున్నారు. బరువు తగ్గే క్రమంలో ఉన్న వారు పరిశుభ్రతను కచ్చితంగా పాటించాలని వారు సూచిస్తున్నారు.

# అతిగా పనిచేస్తే అనర్థం

కొందరు పని ఒత్తిడి కారణంగా అదనపు గంటలు పనిచేస్తే మరికొందరు అదనపు ఆదాయం కోసం ఎక్కువ గంటలు పనిచేస్తుంటారు. ఈ విధంగా అదనంగా పనిచేయడం అనర్థదాయకం అంటున్నారు టెక్సాస్ యూనివర్సిటీ పరిశోధకులు. వారానికి 45 గంటలు కన్నా ఎక్కువ పనిచేసే వారిలో గుండె సంబంధ వ్యాధులు త్వరగా వచ్చే అవకాశాలు ఎక్కువ అన్న సంగతి వీరి పరిశోధనలో వెల్లడైంది. వారానికి 55 గంటలు పనిచేసే వారిలో గుండె సంబంధ వ్యాధులు వచ్చే అవకాశాలు 16 శాతం పెరుగుతాయని స్పష్టం చేస్తున్నారు. 65 గంటలు పనిచేసేవారిలో ఈ అవకాశాలు 35 శాతం పెరుగుతాయని వారు హెచ్చరిస్తున్నారు. ఆఫీసులు, కార్యాలయాల్లో పనిచేసే సుమారు రెండు వేల మంది మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. దాదాపు 43 శాతం మంది గుండెకు సంబంధించి రకరకాల సమస్యలతో బాధపడుతుండటాన్ని వీరు గుర్తించారు. వీరందరూ వారానికి 45 గంటల కన్నా ఎక్కువ గంటలు పనిచేయడం వీరి దృష్టికి వచ్చింది. పనిగంటలు పెరుగుతున్నకొద్దీ శారీరక శ్రమ, ఒత్తిడి, ఆందోళన, రక్తపోటు వంటివి ఎక్కువ కావడంవలనే గుండెనొప్పి, గుండెపోటు వచ్చే అవకాశాలు ఉన్నాయని స్పష్టం చేస్తున్నారు.



# పిల్లల్లో ఊబకాయానికి కారణం

పిల్లల్లో కనిపించే ఊబకాయానికి కారణం యాంటీబయాటిక్స్ వాడడమే అంటున్నారు ఫిలడెల్ఫియా యూనివర్సిటీ పరిశోధకులు. నెలల వయస్సులో ఉన్న పిల్లలకు మోతాదుకు మించి యాంటీబయాటిక్స్ వాడటం వలన వారు ఐదారు సంవత్సరాల వయస్సు వచ్చేసరికి ఊబకాయులుగా మారతారన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. చిన్న పిల్లలు ఏ కొద్దిపాటి అనారోగ్యానికి గురైనా ముందు యాంటీబయాటిక్స్ వేస్తుంటారనీ, ఈ మందులు తాత్కాలిక ఉపశమనం కలిగించినా పెద్దయ్యే కొద్దీ వారి ఆరోగ్యం మీద తీవ్రమైన దుష్ప్రభావాన్ని చూపుతాయనీ హెచ్చరిస్తున్నారు. యాంటీబయాటిక్స్ ఒకటి లేదా రెండు సార్లకు మించి వాడటం అనర్థదాయకమని వారు స్పష్టం చేస్తున్నారు. వైద్యులు వీటిని వాడమని సూచించినా వాడకుండా ఉండడమే మంచిదని, ఎక్కువ మోతాదులో పిల్లలకు వీటిని వాడటం వల్ల చర్మ సంబంధ సమస్యలు వచ్చే అవకాశాలు ఉన్నాయని కూడా పరిశోధకులు చెబుతున్నారు.



**“ఎవరైతే నిన్ను సంతోషపెడతారో వాళ్ళను ప్రేమించు, వాళ్ళతో సన్నిహితంగా మెలుగు. కానీ, ఎవరైతే నువ్వు లేకుండా సంతోషంగా ఉండలేరో వాళ్ళను మరింత ప్రేమించు, వాళ్ళతో మరింత సన్నిహితంగా మెలుగు!”**

**తను రాస్తున్న కథకు ఆఖరి వాక్యంగా దాన్ని రాసి సంతృప్తిగా నిట్టూర్చాడు కల్యాణ్.**

**“దీప్తీ! కాఫీ ఇవ్వనా?” అడిగాడు, ఆమె పడుకుని ఉన్న గదిలోకి వెళ్ళి.**

“వద్దు. మీరొకసారి నా పక్కన కూర్చోండి” పిలిచింది ఆమె.

కల్యాణ్ వెళ్ళి పరిమళ పక్కనే, మంచం అంచు మీద కూర్చున్నాడు.

“నాకొకసారి సంధ్య కూతురు, కీర్తనను చూడాలనుంది ఉదయ్” అంది ఆమె అకస్మాత్తుగా. ఆశ్చర్యపోతూ ఆమె వైపు చూశాడతను. కీర్తన ఓ పాఠకురాలిగా తనకు ఫోన్ చేయడం, ఆమె ఫొటో అచ్చం సంధ్య ఫొటోలా ఉండటం... అన్నీ దీప్తితో చెబుతూనే ఉన్నాడతను.

కానీ, అకస్మాత్తుగా ఆమె అలా అడిగేసరికి, ఏం బదులు ఇవ్వాలో అర్థం కానట్లు చూస్తుండిపోయాడు.

సరిగ్గా అప్పుడే కాలింగ్‌బెల్ మోగిన చప్పుడైంది.

“ఎవరో వచ్చారు. చూసొస్తానుండు దీప్తీ” అంటూ, ఆమె గదిలో నుండి బయటకు వచ్చి తలుపు తెరిచాడు. శరీరంలోని నెత్తురంతా గుండెలోకి పరిగెత్తుకెళ్ళినట్టు ఒక భావోద్వేగం అతన్ని అవాక్కయ్యేలా చేసింది. ఎదురుగా ఉన్న ముగ్గురు వ్యక్తుల్నీ చూడ్డంతోనే!

వాళ్ళు - యోగకీర్తన, లలిత్, సంధ్యామాధవి!!

తెల్లచొక్కా, లుంగీ కట్టుకుని ఉన్న ఆ అరవై యేళ్ళ ఉదయ్ కల్యాణ్‌ని రెప్పవాల్చకుండా చూస్తోంది కీర్తన.

‘ఎందుకు టెన్షన్‌గా ఉన్నారు? రచయితలేమీ వేరే లోకం నుండి ఊడిపడ్డ వాళ్ళు కాదు. వాళ్ళూ మామూలు మనుషులే’.

తొలిసారి అతనితో ఫోన్లో మాట్లాడినప్పుడు అతడన్నమాట! కానీ అతడు మామూలు వ్యక్తి కాదు. చాలా అసాధారణ వ్యక్తి. ఒక మహోన్నత వ్యక్తిత్వం.

“ను... ను...వ్వు... కీర్తనవి కదా?” అన్నాడు కల్యాణ్ విస్మయంలోంచి తేరుకుని.






అవునన్నట్లుగా చిరునవ్వు నవ్వింది కీర్తన. మా మమ్మీ 'సంధ్య'. మీకు పరిచయం చేయ నక్కర్లేదనుకుంటాను" అంది తన తల్లిని చూపిస్తూ.

ఉదయ్ గతుక్కుమన్నాడు! "అదే మొన్నొకరోజు మీరు మా ఇంటికి వచ్చారు కదా" అంది కీర్తన.

"లోపలికి రండి" అతను ఆహ్వానించాడు. గుమ్మందాటి, ఇంటి లోపల అడుగుపెడ్తుంటే, ఆ ముగ్గురిలోనూ ఒకే భావన. ఒక దేవాలయంలోకి అడుగుపెడుతున్న పవిత్ర భావన. ప్రేమ దైవత్వ మైతే ఉదయ్ కల్యాణ్ ఒక నిజమైన ప్రేమికుడు. ఓ దేవుడు.

చిన్న హాలు అది. సోఫాలో కూర్చున్నారు ముగ్గురూ. వాళ్ళకెదురుగా ఉదయ్ కూర్చున్నాడు.

మౌనం. అవ్యక్తమైన భావధారలు ఒకరి హృదయం నుండి మరొకరి హృదయంలోకి ప్రస రిస్తున్నాయి. ఆ మౌనంలో..

"ఇప్పుడే దీప్తినడిగాను కాఫీ ఇవ్వనా అని. వద్దంది. మీకు కలిపి తెస్తాను." అంటూ లేవ బోతున్న ఉదయ్‌తో, "ప్లీజ్ ఉదయ్. కూర్చోండి. అవేం వద్దు" అంది సంధ్య. చప్పున, ఆమెకెందుకో ఆ మాట అంటుండగానే దుఃఖం గొంతుకు అడ్డుపడింది.

కన్నకూతురూ, కాబోయే అల్లుడూ ఉన్నారని ఆలోచిస్తోంది గానీ, లేకుంటే ఒక్కఉదుటున పరి గెత్తుకెళ్ళి ఉదయ్‌ని పట్టుకుని ఏడ్వాలనీ, అతని పాదాలపై పడి క్షమించమని ప్రాధేయపడాలనీ ఉంది. ఆ కోరికను బలవంతంగా నియంత్రించు కుంటోంది. కానీ ఆ నియంత్రణ ఎక్కువసేపు నిలిచేలా లేదు!

"చెప్పు కీర్తీ.. ఈ మధ్య నా కథలేమైనా చది వావా?" అనడిగాడు కల్యాణ్. వాతావరణం భావోద్వేగాలతో 'భారంగా' మారిపోతుండటం ఇష్టం లేక, తేలిక చేయాలని.

'మీ మీద ద్వేషంతో కొన్ని చదవలేదు' అని అందామనుకుంది కీర్తన. కానీ స్రవించడానికి సిద్ధంగా ఉన్న ఆమె నయనాలలోని 'తడి ఒత్తిడి' వల్ల ఆమె పెదవులు తెరచుకోవడం లేదు.

ఆమె సమాధానం చెప్పకపోవడాన్ని అతను అర్థం చేసుకున్నాడు. తన మీది అసహ్యం ఇంకా అలాగే ఉందేమో అనుకున్నాడు.

"మాట్లాడు కీర్తీ" అంటూ మెల్లిగా కీర్తన చెవిలో చెప్పి, మోచేత్తో మృదువుగా నొక్కాడు పక్కన ఉన్న లలిత్. అప్పుడు పెదవి విప్పేందుకు ప్రయ త్నించింది కీర్తన. కానీ పెదాలకంటే ఆమె నయనాల్లోని అశ్రు కణాలు ముందు విచ్చుకు న్నాయి. టపటపా రాలిపోతున్నాయి కన్నీళ్ళు, చెంపల మీదుగా.

"థాంక్యూ, థాంక్యూ ఫర్ ఎవ్రీథింగ్" అంది. ఒకేఒక్క మాట. కానీ ఆమె గుండె లోతుల్లోంచి వచ్చింది. హృదయం తట్టుకోలేని ఆర్ద్రతతో, ఉన్న చోటు నుంచి లేచి అతని వైపు అడుగులు వేస్తోంది. అప్పటికి, సంధ్య కూడా బరస్ట్ అయి పోయింది. దట్టంగా అలుముకున్న మేఘ మాలి కలు, కుండపోత వర్షాన్ని కురిపిస్తున్నట్టు ఆవిడ కళ్ళలోంచీ నీటి సెలయేళ్ళు. "నన్ను క్షమించు ఉదయ్" అన్న అక్షరాలు ఆవిడ గుండెగోడల్ని చీల్చుకుని పెదవుల నుంచి వెలువడాలని ఆత్రుత పడుతున్నాయి.

ఉదయ్‌కల్యాణ్‌కి అంతా అర్థమైపోయింది. లలిత్ ముఖంలోకి చూశాడు "అన్నీ చెప్పేశావా" అన్న అర్థంతో! లలిత్ తలదించుకున్నాడు అవు నన్నట్టు.

ఆనకట్ట తెగిన నదుల్లా, ఒక్క ఉదుటున కల్యాణ్‌ని సమీపించి చెరో భుజాన్నీ గట్టిగా పట్టే సుకుని వెక్కివెక్కి ఏడ్చేస్తున్నారు. కీర్తనో పక్క, సంధ్య మరో పక్క.. నిజం తెలియడంతో జరిగే ఆ 'ఏమోషనల్' కొద్దిసేపటికి సద్దు మణిగింది. అది అలా సద్దుమణిగే వరకూ, కల్యాణ్ ఆ ఇద్దరి తల లపై చేతులు వేసి ఆప్యాయంగా నిమురుతూనే ఉన్నాడు.

"నిజానికి నా గురించిన వివరాలేవీ మీ ఇద్ద రికీ తెలియాలని నేను కోరుకోలేదు. కానీ లలిత్ చెప్పేసినట్టున్నాడు. మీకు మంచి జరగాలనే తాపత్రయంలో నేనెప్పుడైనా మీ మనసుల్ని గాయపరిస్తే నన్ను క్షమించండి!" కల్యాణ్ అలా మనస్ఫూర్తిగా చెబ్తుంటే, సంధ్య తల అడ్డంగా

### జరిగిన కథ

తన తండ్రిని సజీవదహనం చేసిన వారిపై ప్రతీకారం తీర్చుకోవడానికి రవి హంతకుడుగా మారి మూడు హత్యలు చేస్తాడు. కాలేజీ రోజుల్లో తన ప్రియురాలు సంధ్య కూతురు కీర్తనే రవి నెక్స్ట్ టార్గెట్ అని తెలుసుకున్న కల్యాణ్ రవికి నచ్చజెపుతాడు. అంతర్మథనంతో రవి ఆత్మహత్య చేసుకుంటాడు. లలిత్, యోగకీర్తనలకు పెళ్ళి చేయాలని పెద్దలు నిర్ణయిస్తారు. రచయిత కల్యాణ్ గతాన్ని కీర్త నకు వివరిస్తాడు లలిత్. ఆమె అపోహలు తొలగిపోతాయి. మానవత్వం మూర్తీభవించిన గొప్ప వ్యక్తిగా కల్యాణ్‌ను గుర్తిస్తుంది కీర్తన.

ఆ తర్వాత.....

ఊపేస్తూ, "లేదు ఉదయ్, నువ్వు కాదు క్షమించమని అడగవలసింది, నేను. ఒక్క విషయానికి కాదు. అనేకానేక విషయాలకు క్షమించమని అడగాలి. క్షమించగలిగే మహోన్నత హృదయం, మంచితనం నీకున్నాయి కానీ, క్షమించమని అడిగే అర్హత కూడా నాకు లేదు. కానీ ఒక్కటి నిజం. నీలాంటి మనసున్న వ్యక్తి 'తొలి ప్రేమ'ను నేనైనందుకు, ఆడదానిగా నా జన్మ సార్థకమై, నాలోని స్త్రీత్వపు అహం సంతృప్తి చెంది ఉండవచ్చునేమో గానీ, నేను నీకు చేసిన ద్రోహానికి, నువ్వు క్షమిస్తే తప్ప బ్రతికే అర్హత లేదు నాకు. నన్ను, క్షమించు ఉదయ్. అయామ్ సారీ. అయామ్ సో... సో... సో... సారీ... ఫర్ ఆల్ దట్ డిడ్ టు యు." పక్కన కూతురూ, కాబోయే అల్లుడూ ఉన్నారన్న నిజాన్ని కూడా విస్మరిస్తూ భావోద్వేగపు పరాకాష్ఠలో అలా చెప్తూ, మళ్ళీ విపరీతంగా ఏడ్చేస్తోంది సంధ్య.



లేదు సంధ్యా! నేనేమీ త్యాగం చేసినట్టుగానో, 'నిన్ను క్షమించేసి' ఏదో గొప్ప ఉదాత్తత ప్రదర్శిస్తున్నట్లో అనుకోవడం లేదు నేను. 'నిజమైన ప్రేమ'లో ఎదుటి వ్యక్తిని హృదయం అంతటి తోనూ, జీవితాంతం ప్రేమించగలిగే గుణం ఉంటుంది. ప్రేమించడం అంటే సుగుణాలతో పాటు చిన్న చిన్న లోపాల్ని కలిపి ప్రేమించడం. అదే ట్రూ లవ్‌కి అసలైన అర్థం. తప్పొప్పుల చిట్టాపద్దులు రాసేది నిజమైన ప్రేమ కాదు నా దృష్టిలో" అన్నాడు కల్యాణ్.

"నీకు తెలుసా? కొన్ని క్షణాలు ఎన్నటికీ కరగవు. కొన్ని భావాలను ఎవరూ అపహరించలేరు. కొన్ని ఎమోషన్లను ఎన్నటికీ దాచిపెట్టి ఉంచలేం! అలాగే కొందరు వ్యక్తుల్ని ఎన్నటికీ మర్చిపోలేం. నేను నిన్నెన్నటికీ మర్చిపోలేను సంధ్యా' అన్నాడు గాఢతతో. ఆ మాటలు భావుకతతో చెప్పినవే కావనీ అందులో నిజం ఉందనీ ఆమె హృదయానికి తెల్సు. 'అశ్రుకణాల సమూహాల'తోనే తన కృతజ్ఞత చెప్పింది సంధ్య.

'ఈ సన్నివేశం మరీ బరువెక్కిపోతోంది. నేను నా కథల్లో కూడా ఇంత ఎమోషనల్ సన్నివేశాలు పండించలేదు. రండి. నా పరిమళను చూద్దురుగానీ" అంటూ నవ్వేస్తూ, వాళ్ళు ముగ్గుర్నీ పరిమళదీప్తి ఉన్న గదిలోకి తీసుకువెళ్ళాడు కల్యాణ్.

"దీప్తీ! ఇంతకుముందే కదా అంటున్నావ్, సంధ్య కూతురుని చూడాలని ఉందని, ఇదిగో తనే కీర్తన" అంటూ మొదట కీర్తనను చూపించాడు డాక్టర్ దీప్తికి.

బెడ్‌మీద, మెడ కింది శరీర భాగాలన్నీ అచేతనమైన స్థితిలోనే, కీర్తనను తదేకంగా చూసి, "అచ్చం మన కాలేజీ రోజుల్లో సంధ్య ఎలా ఉండేదో అలానే ఉంది ఉదయ్. జెనెటికల్ జిరాక్స్ కాపీ!" అంది సంభ్రమంతో.

"ఎలా ఉన్నావ్ సంధ్యా?" అంటూ సంధ్యను ఆత్మీయంగా పలకరించింది.

"నేను బావున్నాను పరిమళా. నువ్వెలా

**కాలింగ్ బెల్ మోగింది. తలుపు తెరిచాడు కల్యాణ్. ఎదురుగా ఒకనాటి అతడి ప్రియురాలు, ఆమె కుమార్తె! ఆశ్చర్యపోయాడతను. తేరుకుని లోనికి ఆహ్వానించాడు. లోనికి అడుగుపెట్టగానే వారిలో ఏదో తెలియని ఓ పవిత్ర భావన కలిగింది. దుఃఖం ఆపుకోలేకపోయారు. అశ్రువులు ధారలు కడుతున్నాయి. వారెందుకలా ఎమోషనల్ అయ్యారు?**

ఉన్నావ్?" అంది సంధ్య.

"ఇదిగో ఇలా. మంచానికంటుకుపోయి కదల్లేక, కదలడం అంటే ఏంటో తెలీక, ప్రతీదానికీ ఉదయ్ మీద ఆధారపడుతూ, అతని రక్తం పీల్చేసుకుంటూ, మరణం కోసం స్వాగత హస్తాలు చాచి.."

ఆమె ఆ మాటల్ని విషాదంతో చెప్పలేదు. నవ్వుతూనే చెప్పింది. కానీ అవి అక్కడి వాళ్ళ గుండెల్ని పిండేసాయి. సంధ్య కళ్ళలో తడి ఊరిపోతోంది. కాలేజీలో పరిమళ ఎలా ఉండేదో గుర్తు తెచ్చుకుంటుంటే దుఃఖం ఆగటం లేదు. ఎదురుగా మంచం మీద అచేతనంగా పడి ఉన్న ఆమె ఓ గొప్ప కంటి వైద్య నిపుణురాలనీ, ఆమె చేసిన శస్త్రచికిత్సతోనే, ఉదయ్ ఈ రోజు చూడగలుగుతున్నాడనీ.. అన్నీ స్మృతిపథంలో మెదిలి హృదయం భారమైపోయింది.

'కీర్తన పెళ్ళి పరిమళా. మొదటి శుభలేఖ మీకే ఇవ్వాలని వచ్చా" చెప్పింది సంధ్య. ఆ తర్వాత, ఎందుకో సంధ్య, కల్యాణ్, పరిమళలను కొన్ని క్షణాలు ఒంటరిగా వదిలివేస్తూ ఆ గది నుండి బయటకు నడిచి, హాల్లోకి వచ్చేశారు కీర్తన, లలిత్.

ఇప్పుడు పరిమళ గదిలో, పరిమళతో పాటు సంధ్యా, ఉదయ్ మాత్రమే ఉన్నారు.

ఏవేవో జ్ఞాపకాలు ఆ ముగ్గురి హృదయాల్లోనూ సుళ్ళు తిరుగుతున్నాయి. కొద్దిసేపటి తర్వాత ఉదయ్‌తో సంధ్య చెప్పింది. "నేను వెళ్ళిరానా ఉదయ్" అని. అతను తల ఊపుతూ చిరునవ్వు నవ్వాడు. సంధ్య కదలబోతుంటే, 'నీ.. నీకు ఏదీ గుర్తురాలేదు కదూ సంధ్యా? ఏమీ అడగాలనిపించటం లేదా?" అన్నాడు కల్యాణ్. ఆమె

## రెజీనా పనైపోయిందా?

ఇప్పటి హీరోయిన్లు పట్టుమని ఐదారు సంవత్సరాలు మాత్రమే సినిమాలు చేయగలుగుతున్నారు. ఈ కాలంలో వీలైనన్ని ఎక్కువ సినిమాలు చేయడానికే ప్రయత్నిస్తున్నారు. ఇదంతా కొత్త హీరోయిన్ల ట్రెండ్. వీరికి భిన్నంగా ఉంది రెజీనా కెరీర్! రెజీనా కెరీర్‌లో ఇప్పటి వరకూ ఒక్కటంటే ఒక్క బ్లాక్ బస్టర్ లేకపోవడంతో టాలీవుడ్‌లో ఆమెతో సినిమాలు చేయడానికి పెద్దగా ఎవరూ ముందుకు రావడం లేదట! ఒక్క సినిమా మాత్రమే విడుదలకు సిద్ధంగా ఉండగా, ఇంత వరకూ మరో సినిమాకి సైన్ చేయకపోవడంతో టాలీవుడ్‌లో రెజీనా పనైపోయిందనే అంటున్నారు. దీని మీద రెజీనా నోరు విప్పకపోతే, ఈ పుకార్లే నిజమవుతాయని ఆమె సన్నిహితులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.

అడుగు నిలిచిపోయింది. 'లేదు' అన్న సమాధానమే ఆమెలో ఉందని అతనికి తెలుసు. ఇక అప్పుడు అతనే చెప్పాడు. "నీకప్పుడు చెప్పాను, నీకిద్దామని ఓ లేఖ రాశానని. రాశాక దాన్ని ఓసారి చదువుదామని చూస్తే అక్షరాలు కనిపించలేదన్నాను? అదే సంధ్య నాకు అంధత్వం మొదటిసారి బయటపడ్డప్పటి ఆ క్షణాలు...?"

"అవును?" ఆమెకు గుర్తొచ్చింది.

"ఆ లేఖ గురించి నన్ను అప్పుడూ అడగలేదు నువ్వు. ఇప్పుడూ అడగాలనిపించటం లేదా?" ఆ ప్రశ్న ఆమె మనసుని సూటిగా తాకింది.

"ఆ... ఆ... అదా... ఇంకా నీ దగ్గర ఉందా ఉదయ్?" ఆమెలో, ఆ వయసులో ఒకప్పటి ఆ తొలి ప్రేమ తాలూకు ఉద్వేగం! చాలా చిత్రంగా ఉంది ఆ ఎమోషన్! కానీ వెంటనే "వద్దు ఉదయ్. ఇప్పుడు ఆ లేఖను చదివితే నా గుండె కొట్టుకోవడం ఆగిపోతుందేమో. నీ ప్రేమ అనే గొప్ప వెలుగు ముందు నేను మాడి మసై పోతాను" సంధ్య కళ్లల్లో నీటి తెర.

"అది నీకివ్వడం కోసం చెప్పలేదు. నీకసలు గుర్తుందా అని అడగాలనిపించిందెందుకో" ఆమె మరింత ఉద్వేగపడిపోతూ "లేదు కల్యాణ్! నాకా ఉత్తరం కావాలి. ప్లీజ్ ఇవ్వు. ఆ అక్షరాల ప్రేమ మధువుతో నా గుండె తడిసి ముద్దవ్వాలి. ఆ తడిలోనే అది ఆగిపోయినా పర్లేదు. ఇవ్వు ప్లీజ్" అని బతిమాలింది హఠాత్తుగా.

ఒక పాలిథిన్ షీట్‌లో భద్రపరిచిన ఆనాటి ఆ లేఖను ఆమెకు అందించాడప్పుడు ఉదయ్.

'తపాలా శాఖ వాళ్ళు ఆలస్యంగా ఉత్తరాలు బట్వాడా చేస్తారంటారు. కానీ వాళ్ళ కంటే ఆలస్యంగా, నాలుగు దశాబ్దాల పైబడిన, ఈ ఉత్తరం నీకు చేరుతోంది. ఎట్టకేలకు ఇది, ఎవరికోసం రాయబడిందో ఆ వ్యక్తికి బట్వాడా అయ్యింది" అన్నాడు ఉదయ్ చిరునవ్వు నవ్వుతూ.

సంధ్య ఆ పాలిథిన్ షీట్‌లోంచి ఆ ఉత్తరాన్ని బయటికి తీస్తుంటే దానితోపాటు మరింకేదో కనిపించింది. ఆమె భృకుటి ముడిపడింది.

"జ్ఞాపకాలు సంధ్యా, ప్రోది చేసుకున్న మధుర స్మృతులు..."

అది.... అది ఉదయ్, సంధ్య కలిసి మధ్యాహ్నం క్లాసులు లేవని, ఊర్వశి థియేటర్‌కి వెళ్ళిచూసిన సినిమా తాలూకు బాల్కనీ టికెట్!!

ఆ టికెట్ ముక్కను చూడ్డంతోనే సంధ్య కళ్ళల్లోంచి జలజలా రాలిపోయాయి కన్నీళ్ళు.

ఆ కన్నీళ్ళలోంచే ఆ ఉత్తరాన్ని చదివింది సంధ్య. అది చదువుతున్నంత సేపూ, చదివేశాక కూడా ఆమె కళ్ళు స్రవిస్తూనే ఉన్నాయి!!

ఆ ఉత్తరంలో అతడు రాసిన భావాల ప్రభావం నుండి బయటపడ్డానికి చాలా సమయం పట్టింది.

మరికాసేపటి తర్వాత లలిత్, కీర్తన, సంధ్యలు తిరిగి వెళ్ళిపోతూ కార్లో కూర్చుంటుంటే "శ్రీకాంత్ రాలేదేం సంధ్యా?" అనడిగాడు కల్యాణ్.

"అ... అదీ... ఆయనకేదో ముఖ్యమైన బోర్డు మీటింగ్ ఉందట" అబద్ధం చెప్పింది సంధ్య.



డ్రైవర్ కారు స్టార్ట్ చేయబోతున్న ఆఖరి క్షణంలో, ఉదయ్ చేయి అందుకుని కరచాలనం చేస్తున్నట్టుగా మృదువుగా నొక్కి, "థాంక్యూ ఉదయ్" అంది సంధ్య. ఆ ఒక్క థాంక్స్ అన్న పదంలోనే తన గుండెలోని కృతజ్ఞతా భావాన్నంతా నింపి.

ఆమె స్పర్శ దాదాపు నలభై ఏళ్ళ కిందట, తొలిసారి ఆమె ఓణీ అంచు తనకు తగిలినప్పటి జ్ఞాపకాలలోకి తోసేసిందతడిని. అదీ ఓ క్షణం సేపే!

కారు కదిలి వెళ్తుంటే 'ఇప్పుడు నువ్వింతగా థాంక్స్ చెబుతున్నావ్‌గానీ, ఆ తర్వాత జరగబోయే ఓ పరిణామానికి మాత్రం కృతజ్ఞత చెప్పవు సంధ్యా" అని పైకి అనలేదు ఉదయ్. లోలోన అనుకున్నాడు.

•••

లలిత్, కీర్తనల వివాహం వైభవోపేతంగా జరిగింది. రాజకీయ ప్రముఖులు, పారిశ్రామిక వేత్తలు, తెలుగు సినీ, టీవీ రంగాలకు సంబంధించిన సెలబ్రిటీలు ఇలా ఎంతో గొప్పగొప్ప వాళ్ళు ఆ వివాహానికి హాజరైనా, పెళ్ళి దుస్తుల్లో, లలిత్ పక్కన కల్యాణవేదిక మీద కూర్చున్న కీర్తన కళ్ళు మాత్రం కల్యాణ్ కోసం ఎదురు చూస్తున్నాయి.



పరుపును చూసి భయపడటాన్ని క్లినోఫోబియా అంటారు.

ఇంకొన్ని నిమిషాల్లో తన భార్య కాబోతున్న కీర్తనతో, "కల్యాణ్‌గారి కోసం చూస్తున్నావా కీర్తీ" అనడిగాడు లలిత్.

"వస్తారంటావా?" సందేహంగా అడిగింది కీర్తన.

"తప్పకుండా వస్తారు".

పురోహితులు పెళ్ళి మంత్రాలు చదువుతున్నారు. కీర్తన, కల్యాణ్ రాక కోసం ఆశగా ఉత్కంఠగా ఎదురు చూస్తోంది. ఎంత గొప్ప గొప్ప వాళ్ళొచ్చినా కల్యాణ్ గారే తన దృష్టిలో అత్యంత ముఖ్యమైన, ఆత్మీయమైన, విశిష్ట అతిథి! తర్వాత మరో నిమిషానికి ఆమె నేత్రాలు ఆనందంతో, సంతృప్తితో విచ్చుకున్నాయి!!

•••

రాత్రి పది గంటల సమయం.

క్రిస్టల్ గ్లాసుల్లో నిండిన ఖరీదైన స్కాచ్ విస్కీ ఆ నలుగురి స్నేహితుల నెత్తురులో ప్రవేశిస్తోంది. తన విలాసవంతమైన వీకెండ్ విల్లాలో తన భాగస్వాములు ముగ్గురితో కలిసి సరదాగా గడుపుతున్నాడు శ్రీకాంత్‌వర్మ. ఆయనకిప్పుడు చాలా నిశ్చింతగా ఉంది. మొన్నటివరకు కీర్తనకు ప్రాణహాని ఉందనే భయంతో ఉన్నాడు. ఇప్పుడది తొలగిపోయింది. హంతకుడు చచ్చాడు! కీర్తన వివాహమూ జరిగిపోయింది.

విస్కీలోకి ఐస్‌క్యూబ్స్ కలుపుతుంటే శ్రీకాంత్ వర్మ మొబైల్ మోగింది.

"హలో?" చెప్పాడు ఫోన్ అందుకుని.

"దిసీజ్ డీసీపీ మౌర్య".

"చెప్పండి సర్".

"మిస్టర్ శ్రీకాంత్‌వర్మా, కొన్నినెలల క్రితం బాలానగర్‌లోని మీ గోడౌన్స్ అగ్నిప్రమాదానికి గురయ్యాయి కదా?"

"అవును. ఇప్పుడా విషయం ఎందుకు?" శ్రీకాంత్‌వర్మ నుదురు ముడుచుకుంది.

"ఆ అగ్నిప్రమాదంలో వెంకటేశ్వర్లు అనే ఒక వాచ్‌మెన్ కాలి చనిపోయాడు. అతని చావు ప్రమాదవశాత్తూ జరగలేదనీ, అదొక కోల్డ్ బ్లడెడ్ మర్డర్ అని తెలిపే ఆధారాలూ, సాక్ష్యాలూ కొన్ని లభించడంతో ఆ కేస్ రీ ఓపెన్ అయింది" అవతల డీసీపీ మౌర్య చెబుతున్నాడు.

"వ్వాట్?" తను కూర్చున్నచోట భూమి తిరగబడిపోయినట్టు అదిరిపడ్డాడు శ్రీకాంత్‌వర్మ.

"యస్. ఆ హత్యచేసిన వాళ్ళు ఎవరో, దాని వెనుక మోటివ్ ఏంటో త్వరలోనే ఇన్వెస్టిగేషన్‌లో



## ప్రపంచ సుందరి కంట తడి?

కంటతడి పెట్టవలసిన కష్టం ప్రపంచసుందరికి ఏం వచ్చింది? అనే అనుమానం రావచ్చు. కానీ ఈ కంటతడి దుఃఖంతో కాదు. ఆనందంతో వచ్చింది. ఈ పాటికే ఆ ప్రపంచసుందరి ఎవరో అర్థమై ఉంటుంది. ఆమె మరెవరో కాదు మాజీ ప్రపంచసుందరి ఐశ్వర్యారాయ్! ఆమెకు కన్నీళ్ళు రప్పించింది ఆమె కూతురు ఆరాధ్య.

తన తల్లి త్వరగా కోలుకోవాలంటూ ఆరాధ్య ఇచ్చిన చిన్న కార్డు చూసి ఐష్ కన్నీటి పర్యంతమైంది. సినిమా షూటింగ్‌లో స్వల్ప అనారోగ్యానికి గురైన ఐష్ షూటింగ్ క్యాన్సిల్ చేసుకుని ఇంట్లోనే ఉండిపోయింది. తల్లి పడుతున్న బాధ చూసిన ఆరాధ్య స్కూల్‌కి వెళ్ళిన తరువాత ఈ కార్డ్ తయారు చేసిందట! సాయంత్రం స్కూలు నుంచి తీసుకు వెళ్ళడానికి వచ్చిన తల్లికి ఆ ప్లేకార్డ్ ఇచ్చింది! అది చూసి ఐష్ కళ్ళు చెమర్చాయి. ప్రపంచసుందరి కంటతడి వెనుక ఇంత కథ జరిగింది అంటున్నారు బాలీవుడ్ జనాలు.

తేలిపోతుంది".

"………. ………… ………"

"అంతదాకా విస్కీ తాగి ఎంజాయ్ చేయండి. ఫర్లేదు. ఆ తర్వాత ఎలాగూ ఊచలు లెక్కపెట్టాలి కదా హోమిసైడ్ ఛార్జెస్ కింద. మీ స్నేహితులు ముగ్గురికీ ఈ శుభవార్త చేరవేయండి'.

"… … …"

"బైదివే! త్వరలోనే పరిశోధనలో తేలిపోతుందని అంటే వారాల్లోనో, నెలల్లోనో కాదు. గం…ట…లు!! లేదా నిమిషాలు కూడా కావచ్చు. వారెంట్స్ కూడా సిద్ధంగా ఉన్నాయి మరి. బై". ఫోన్ పెట్టేశాడు డీసీపీ మౌర్య.

భయం, చల్లని నీటి తడిలా, వర్మ వెన్నులో పాకింది. స్వేదంతో ముఖం అంతా తడిసిపోయింది.

అతడికెందుకో చాలా సంవత్సరాల క్రితం, ఉదయ్ విషయంలో తను చేసింది గుర్తొచ్చింది. ఒక వేళ అదీ బయటపడిపోతుందా?

ఉదయ్‌కి చూపు పోవడానికి విధి కాదు కారణం. మిథైల్ ఆల్కహాల్‌లాంటి ఓ విషం అని ఎవ్వరికీ తెలీదింతవరకూ!!

ఉదయ్ కళ్ళు మసకగా కనిపించడానికి ముందు, కొన్నాళ్ళ క్రితం మామూలు కళ్ళకలక వస్తే ఒక డాక్టర్‌ని కలిశాడతను. ఆ డాక్టర్‌ని తను 'మానేజ్' చేసేసి, కళ్ళల్లో వేయకూడని, ఆప్టిక్ నర్వ్‌ని దెబ్బతీసి చూపు పోగొట్టే టాక్సిన్‌ని కంటి చుక్కలుగా ఇప్పించాడు!!

కేవలం సంధ్య దృష్టిలో ఉదయ్‌ని 'చిన్నవాడి'గా మార్చేందుకు, ఒక భయంకరమైన కుట్రతో అతణ్ణి అంధుడిని చేసేశాడు!!

డీసీపీ మౌర్య ఆ కుట్రని కూడా ఛేదించేశాడా?

అప్పటిదాకా చాలా ఉల్లాసంగా ఉన్న తమ స్నేహితుడు ఎందుకు అంత ఆందోళనకు గురయ్యాడో అర్థం కాక, "ఏమైంది శ్రీ?" అంటూ అడిగారు!!

సరిగ్గా అప్పుడే శ్రీకాంత్‌కి ఛాతీలో సన్నగా నొప్పి ప్రారంభమైంది!!

●●●

అందమైన సాయం సమయం.

పడమరవైపు ఆకాశం నారింజరంగు పులుముకుంటోంది. చల్లని గాలి తెరలు మంద్రంగా వీస్తున్నాయి. సంధ్యా సమయంలో ఆకాశాన్నీ, కుంగిపోతున్న పసుపు పచ్చ సూర్యుడినీ చూడ్డమంటే ఎంతో ఇష్టం పరిమళ దీప్తికి. చక్రాల కుర్చీలో కూర్చోబెట్టి, ఇంటిముందున్న ఆ చిన్ని పూలతోటలోకి తీసుకు వచ్చాడామెను, ఉదయ్.

ఆ సాయం సంధ్యను చూస్తూ తాదాత్మ్యం చెందడం లేదు పరిమళ.

"ఏంటి దీప్తీ, సంధ్యా కాంతులంటే నీకిష్టమని, బయటకు తీసుకొస్తే, నువ్వేంటి నన్ను చూస్తున్నావ్?" అనడిగాడు ఉదయ్ చల్లని చిరునవ్వుతో. ఆమెకు కుడివైపు పచ్చని పచ్చికలో కూర్చుని ఉన్నాడతను.

"నాకెందుకో ఈ రోజు నిన్నే చూడాలనిపిస్తోంది ఉదయ్.." ఓ కొత్త భావోద్వేగపు ఆర్తి కనిపిస్తోందామె స్వరంలో.

అతను విచలితుడై, "దీప్తి, ఆర్ యు ఓకే?" అనడిగాడు ఒకింత అలజడిగా.

"నాకేం ఉదయ్. బాగున్నాను. అవునూ, ఈ మధ్యే కొత్త నవలొకటి రాశానన్నావ్".

"అవును. ఈ రోజే పూర్తయింది. దాని పేరు "లవ్ డబ్.."! అది పూర్తిగా స్వీయకథ. నా జీవితాన్ని యథాతథంగా రాశాను" చెప్పాడు ఉదయ్.

"లవ్‌డబ్" చక్కగా ఉంది నవల పేరు" అభినందన పూర్వకంగా చూసింది దీప్తి.

"థాంక్యూ…"

"పూర్తిగా నీ జీవిత గాథా?"

"నువ్వూ, నేనూ, సంధ్యా, కీర్తనా, శ్రీకాంత్, లలిత్ అందరం ఆ కథలో ఉన్నాం".

"మన జీవిత కథనే నవలగా మలిచావా? నాకు చదివి వినిపించవూ ప్లీజ్…" ఉత్తేజితమైపోతూ, ఎలా రాశాడో తెలుసుకోవాలన్న ఆత్రుతతో చిన్నపిల్లలా అడిగింది డాక్టర్ దీప్తి.

"స్క్రిప్ట్ తెస్తానుండు" అంటూ ఇంట్లోకి వెళ్ళి తన గదిలో ఉన్న ఆ నవల తాలూకు కాగితాల్ని తెచ్చాడు ఉదయ్.

ఆమె ఆసక్తిగా వింటోంది. ఉదయ్ చదవసాగాడు.

'లవ్‌డబ్ నా గుండె చప్పుడు…

"ఏయ్! ఆ దేవుడు కంటికి కనిపించి, నాపై వరాల జల్లు కురిపిస్తానంటే నేనేం కోరుకుంటానో తెలుసా?

నా మెడపై వెచ్చగా తగిలే నీ ఊపిరి సవ్వడితో ప్రతి ఉదయం నేను నిద్ర మేల్కొనాలనీ…

ఈ క్షణం కరిగిపోతే, ఈ జన్మజారిపోతే ఎక్కడ అదృశ్యమౌతావో అన్న ఆత్రుతతో నిన్ను గుండెకు హత్తుకోవాలనీ…

'లబ్ డబ్…'

'లబ్ డబ్…'

'లవ్ డబ్'

'మ్యూజిక్ ఆఫ్ ది హార్ట్' మొదలయింది…

(అయిపోయింది) 



## సరదాగా

### పార్కింగ్

ఓ షాపింగ్ కాంప్లెక్స్ ముందు రాజు తన ఆటోకున్న ముందు చక్రం విప్పుతూ కూర్చున్నాడు. ఆ చుట్టుపక్కలంతా ట్రాఫిక్‌జామ్ అవటంతో కానిస్టేబుల్ పరిగెత్తుకు వచ్చి "ఏంటయ్యా ఇది? నీ వల్ల చూడు ఎంత దూరం ట్రాఫిక్ నిలిచి పోయిందో? అసలు ఏమైంది ఆటోకి? ఆ చక్రం ఎందుకు విప్పుతున్నావు?" అని అడిగాడు. "మీరే కదా సార్! ఇక్కడ టూవీలర్ మాత్రమే పార్క్ చేయాలని బోర్డుపెట్టారు. అందుకే ముందు టైరు విప్పుతున్నాను!" అంటూ రాజు అక్కడున్న బోర్డు చూపించాడు.

### ఒక ప్రశ్న?

రఘురామయ్య గారి ఇల్లు సందడిగా ఉంది. ఈసారి కుటుంబమంతా కలిసి ఉగాది పండగ జరుపుకోవాలని రఘురామయ్యగారి ఆర్డరు. కొడుకులూ, కోడళ్ళూ, కూతుళ్ళూ, అల్లుళ్ళూ, మనవలూ, మనవరాళ్ళతో ఇల్లంతా ఒకటే హడావిడి. ఆటపాటలతో, నవ్వులతో, కేరింతలతో పండుగ వాతావరణం నెలకొంది. తెల్లారుజామున లేచి తలంట్లు, పూజాపునస్కారాలు, ఉగాది పచ్చడి అన్నీ అయ్యాయి. అందరూ దేవాలయానికి కలిసికట్టుగా వెళ్ళి, పంచాంగశ్రవణం కానిచ్చేసి తమ తమ ప్రార్థనలు విన్నవించుకున్నారు ఆ భగవంతుడికి. మధ్యాహ్నం అరిటాకు భోజనాలూ, ఆకూ, వక్కా అయ్యాయి. సాయంత్రమైంది. తెల్లారితే మళ్ళీ ఎవరి స్థానాలకు వాళ్ళు వెళ్ళాల్సిందే కదా! ఈ సాయం వేళ అందరం కలిసి కాసేపు కథా కాలక్షేపాలు చేద్దాం అన్నారు రఘురామయ్యగారు. అందరూ సరేనన్నారు. ఆ ఇంటికి మహా ఇల్లాలు పార్వతమ్మగారు కాసేపు ఉగాది పర్వదిన విశేషాలు తెలియజేశారు. కొడుకులూ, అల్లుళ్ళూ తమ ఉద్యోగ సాధకబాధకాల గురించి, కోడళ్ళూ, కూతుళ్లూ తమతమ కాలక్షేపాల గురించీ చెప్పారు. మనవలు, మనవరాళ్ళు తమ స్నేహితులు, ఆటపాటల గురించి విభిన్న హావభావాలతో కడుపుబ్బా నవ్వించారు. అన్నీ అయ్యాయి. 'ఇంకేం చెయ్యాలి' గోల మొదలైంది. రఘురామయ్యగారు చిన్నగా గొంతు సవరించుకుని, 'ఇప్పుడు నేనొక మ్యాజిక్ చేస్తాను. మీరు దాన్ని చేయగలరా? ఎవరూ చేయలేకపోతే నేను చేసి చూపెడతాను' అన్నారు. అందరూ సరే అన్నారు. రఘురామయ్యగారు "19 సంఖ్యను తీసుకోండి. దాంట్లోంచి ఒకటిని తీసివేస్తే అది 20 అవుతుంది. ఎలా?" అడిగారు. కుటుంబమంతా రకరకాల ప్రయత్నాలు చేసింది. కానీ ఎవ్వరూ చేయలేకపోయారు. ఆఖరికి రఘురామయ్యగారు మ్యాజిక్ చేసి చూపించారు. ఎలాగో మీరూ ప్రయత్నించి చూడండి.

**సమాధానం**

రోమన్ సంఖ్యావిధానంలో 19ని XIX ఇలాగే కదా రాస్తాం. మరి దీంట్లోంచి 1 తీసేస్తే, XX, 20 అవుతుంది కదా!

Jayadev

# అడపా దడపా నవ్వబ్బా












# క్రికెట్ క్రీడాకారిణి దారుణ హత్య

**'క్రికెట్ క్రీడాకారిణి శివాని దారుణ హత్య'.**

**టీవీలో వార్త విని వాల్యూమ్ పెంచాడు అసిస్టెంట్ రాము.**

**'ఉదయం మైదానానికి వెళ్ళి వార్మ్అప్ చేస్తుండగా దారుణ హత్యకు గురయింది. భారత మహిళా జట్టు కెప్టెన్‌గా ఎంపిక అయ్యే తరుణంలో ఈ సంఘటన మహిళా క్రికెట్‌కు తీరనిలోటని వ్యాఖ్యానిస్తున్నారు ప్రముఖులు'.**

ఆ వార్తను ఏకాగ్రతతో విన్నాడు డిటెక్టివ్ శరత్. ఈలోగా తలుపు చప్పుడైంది. ఇన్‌స్పెక్టర్ విజయ్ లోపలికొచ్చి శరత్ ఎదురుగా కూర్చున్నాడు.

'శివాని హత్య వార్త తెలిసిందా?'

'తెలిసింది'.

'ఆ కేసు నువ్వు టేకప్ చేయాలి. ఎలాంటి ఆధారాలు లేవు. సీసీ కెమేరాలు కూడా ఆ రోజు పని చేయలేదు. ఎవరో ఆమెను విచక్షణా రహితంగా పొడిచి వెళ్లిపోయారు. జాగిలం మైదానం చుట్టూ తిరిగిందితప్ప ఏం ట్రేస్ చెయ్యలేదు. ఆయుధం దొరకలేదు. శివానీ తప్ప మరొకరు లోపలకు వెళ్లటం వాచ్‌మన్ చూడలేదు' అన్నాడు విజయ్.

రాము వైపు చూసి హత్యా స్థలం చూద్దాం. తోటి ఆటగాళ్లను, కోచ్‌ను, తల్లిదండ్రులను ప్రశ్నిద్దాం' అన్నాడు శరత్.

•••

మైదానంలోకి 'అఫీషియల్‌గా ఒక ఎంట్రన్స్ ఉంది. మైదానం చుట్టూ కంచె. అది దాటి ఎవరైనా సులభంగా లోపలకు రావచ్చు' విజయ్‌తో అన్నాడు శరత్.

మైదానం చివర పెవిలియన్‌లో ఆటగాళ్ల గదులు, బాత్‌రూమ్‌లున్నాయి. పెవిలియన్‌లో హతురాలి కిట్ పరిశీలించాడు. అసాధారణమైనదేం లేదు. పెవిలియన్ పక్కగా చెట్టుదగ్గర హత్యాస్థలం చూశాడు.

'ఇటునుంచి వెళ్లి మైదానం చుట్టూ పరుగెత్తింది కుక్క' చెప్పాడు విజయ్.

మైదానం వైపు చూశాడు శరత్.

'ఆమె శవాన్ని గుర్తించి ప్రాక్టీసుకొచ్చిన ఆటగాళ్లే అందరికీ హత్య విషయం చెప్పారు' అన్నాడు విజయ్.

•••

'ఉదయం అందరికంటే ముందే వస్తుంది శివాని. మేము వచ్చేసరికి వార్మ్అప్ అయిపోతుంది. ఆమె కన్నా ముందు రావాలనుకుంటాం కానీ కుదరదు. కనీసం ఆ ఒక్కరోజైనా ముందు వచ్చి ఉంటే బాగుండేది' అంది రమ కన్నీళ్లతో.

'మావి పక్కపక్క ఇళ్ళే. మేం కలిసి బయలు దేరతాం. కానీ శివానీ మాత్రం మాకన్నా ముందే వెళ్తుంది' చెప్పింది మెర్సీ.

'ఆమె అంటే గిట్టనివారున్నారా? ఎవరితోనైనా ప్రేమ వ్యవహారం, భేదాభిప్రాయాలు లాంటివేమైనా ఉన్నాయా?' అడిగాడు శరత్.

ఇద్దరూ తలలు అడ్డంగా ఊపారు.

'ఆటలో భేదాభిప్రాయాల్ని మైదానంలోనే వదిలేస్తాం. ద్వేషించేంతగా ఏమీ లేవు. ఆమెకు క్రికెట్ తప్ప మరేం తెలియదు' చెప్పారిద్దరూ.

'ఎవరూ వెంటపడలేదా?'

'ఇద్దరూ ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

బ్యాడ్మింటన్ ప్లేయర్ భరత్ వెంటపడినా, ఆమె ఇంట్రెస్ట్ చూపించలేదు.

•••

'శివానీని ఇష్ట పడ్డాను. కానీ ఇలాంటివాటికి నేను అప్పుడే సిద్ధంగా లేనని చెప్పింది. క్రికెట్ నుంచి తన దృష్టిని మరల్చలేనంది' అన్నాడు భరత్.

'ఆమెని బ్రతిమిలాడలేదా?" అడిగాడు రాము.

నవ్వాడు భరత్. 'శివానీకి ప్రపంచమంతా క్రికెట్టే. హాకీ హాసిని, నేను ప్రస్తుతం క్లోజ్‌గా ఉన్నాం' అన్నాడు భరత్ తేలికగా.

'శివానీని చంపేంత కారణం ఎవరికయినా ఉందా?' అడిగాడు శరత్.

కాస్సేపు ఆలోచించి, తల అడ్డంగా ఊపాడు భరత్. 'సారీ... నాకేం తెలియదు' అన్నాడు.

**మైదానంలో ప్రాక్టీస్ చేస్తుండగా క్రికెట్ క్రీడాకారిణి శివాని హత్యకు గురైంది. ఎవరో ఆమెను కత్తితో పొడిచి చంపారు. సాక్ష్యాలు దొరకలేదు. పోలీసు జాగిలాలు కూడా ఏం చేయలేకపోయాయి. కేసు టేకప్ చేశాడు డిటెక్టివ్ శరత్. కానీ ఈ కేసులో ఎక్కువ మ్యాచ్‌లు ఆడేందుకు ఆమెకు అవకాశాలు వచ్చాయి! కోచ్ కావాలనే అవకాశాలు కల్పించాడా? అతడితో శరత్ నిజం చెప్పించగలిగాడా? ఇంతకీ హంతకుడెవరు?**

•••

'ఈసారి టోర్నమెంట్ టీమ్‌కి శివానీ కెప్టెన్ అయ్యేది. ఈ విషయం ఆమెకీ తెలుసు. అందుకే మరింత శ్రద్ధగా ప్రాక్టీస్ చేసేది. ఇంతలో ఇలా జరిగింది' చెప్పాడు కోచ్ కనక్ విషాదంగా.

'ఆమెని చంపే అవసరం ఎవరికి ఉంటుంది?' అడిగాడు శరత్.

'అందరితో మంచిగా ఉండేది. చంపేంత ద్వేషం ఎవరికి ఉంటుంది. అదే మాకూ అర్థం కావడం లేదు. నా అనుమానం ఎవరో దారిన పోయే వాడు ఒంటరి అమ్మాయిని చూసి చంపి ఉంటాడు'.

'మరి ఇప్పుడు కెప్టెన్‌గా ఎవర్ని ఎన్నుకుంటారు?"

'నలుగురైదుగురు ప్రాబబుల్స్ ఉన్నారు కానీ శివానీకి ఉన్నంత ప్రతిభ ఎవరికీ లేదు, కమిటీయే నిర్ణయించాలి' చెప్పాడు కనక్.

•••

'రండి' శరత్‌ని, విజయ్‌ని ఆహ్వానించాడు శివానీ తండ్రి. అప్పటికే గదిలో ఎవరో ఉన్నారు.

'ఈయన రాజన్. శివానీ పర్సనల్ కోచ్. ఆయన కూతురు శోభ. ఈమె కూడా క్రికెటరే. శివానీకి మంచి ఫ్రెండు' చెప్పాడాయన.

'కానీ శివానీ కోచ్ కనక్ కదా?' అడిగాడు శరత్.

'అఫీషియల్‌గా మ్యాచ్‌లు ఆడేటప్పుడు కనక్ కోచ్. మిగతా సమయాల్లో కోచ్ నేనే' చెప్పాడు రాజన్.

'అంటే?'

'అంటే, చిన్నప్పటి నుంచి వీళ్ళ రోజువారీ ప్రాక్టీస్‌కోచ్ నేనే. మ్యాచ్‌లప్పుడు క్రికెట్ బోర్డు నిర్వహించే క్యాంపుకు కోచ్ కనక్' వివరించాడు రాజన్.

'ఈ శివానీకే కాదు జట్టులో ఉన్న చాలా మంది సిటీ ప్లేయర్లకు ఈయనే కోచ్' చెప్పాడు శివానీ తండ్రి.

'మీ అమ్మాయి క్యాంపులో ఉందా? అడిగాడు శరత్.

'శివాని మరణంతో మరో ప్లేయర్ అవసరం. బహుశా శోభను తీసుకుంటారేమో. కానీ ఆమెకు ఇష్టం లేదు. అందుకే నచ్చచెప్పటానికి వీళ్ళింటికి తీసుకువచ్చాను' అన్నాడు రాజన్.

'శివానీతో కలిసి ఆడాల్సిన దాన్ని, ఆమె స్థానంలో ఎలా ఆడతాను? ఆడగలనా?' భోరుమంది శోభ.

ఆమెని అనునయించసాగారు శివానీ తల్లి తండ్రి, రాజన్.

కాసేపటికి బైటకు వచ్చేశాడు శరత్.

•••

'బాస్...శోభ, శివానీ చిన్నప్పటి నుంచీ కలిసి చదువుకున్నారు. కలిసి ఆడుకున్నారు. రెండు సీజన్లుగా శివానీ అద్భుతంగా ఆడుతోంది. వాళ్ళ నాన్న కోచ్ కావడంతో శోభకు అవకాశాలు వచ్చినా ఎందుకో సరిగ్గా ఆడలేకపోయింది. దాంతో శివానీ ముందుకు దూసుకుపోయింది. కానీ హత్య చేసేంత కోపం, అసూయ ఉన్నట్టులేవు' చెప్పాడు రాము.

తల ఊపాడు శరత్. 'మ్యాచ్‌ల వివరాలు తెచ్చావా?'

'యెస్ బాస్' అందించాడు రాము.



వాటిని పరిశీలించాడు శరత్.

'బాస్, మ్యాచ్‌ల వివరాలు చూస్తే హంతకు డెవరో తెలుస్తుందా? నవ్వాడు శరత్ తెలియదు. ఏదైనా ఊహ రావచ్చు. మనకు ఎలాంటి ఆధారం లేనప్పుడు ఏదో ఒకటి చేయాలి' అన్నాడు. మ్యాచ్‌ల వివరాలు పరిశీలిస్తున్న శరత్ భృకుటి ముడిపడింది.

'ఏమిటి బాస్?' అడిగాడు రాము.

శరత్ మాట్లాడలేదు. కాస్సేపు ఆలోచించి రాము వైపు చూసి 'బయల్దేరు' అన్నాడు.

●●●

శరత్ వైపు విచిత్రంగా చూశాడు కనక్.

'నాకు ఇష్టం లేదు. అందుకే పెళ్లి చేసుకో లేదు. క్రికెట్ నేర్చుకోటానికి నా దగ్గరకు వచ్చే వాళ్ళంతా నా పిల్లలే'.

'వాళ్లల్లో శివానీ అంటే మీకు చాలా ఇష్టం. అవునా?'

'మీ ప్రశ్నకు అర్థం ఏమిటి? బెస్ట్ స్టూడెంట్ పట్ల ఉండే అభిమానానికి పెడార్థాలు తీయకండి' కోపంగా అన్నాడు కనక్.

'నేను తీయటం లేదు. ఆమె మీద అభిమానంతో ఆమెకు మీరు ఎక్కువ అవకాశాలు ఇచ్చారు. అవునా?'

'అవకాశాలు ఆమె ప్రతిభ ఆధారంగా వచ్చాయి. ఎవరి దయాదాక్షిణ్యాలు ఆమెకి అవసరం లేదు'

'మరి ఎవరికి అవసరం? శోభకా?'

కనక్ మాట్లాడలేదు.

'శోభ ప్రతిభావంతురాలే అయినా శివానీని చూసి న్యూనతా భావానికి గురయ్యేది. అందుకే నేమో ఏ మ్యాచుల్లో శివానీ బాగా ఆడిందో, ఆయా మ్యాచుల్లో శోభ విఫలమయింది. మీరు శివానీ కన్నా ముందు శోభని బరిలో దింపేవారు. అప్పటి దాకా బాగా ఆడుతున్న శోభ శివానీ మైదానం లోకి దిగగానే ఔటైపోయేది. ఔనా?'

శరత్‌ని పరిశీలనగా చూశాడు కనక్. 'అవును. ఆమెను మానసిక వైద్యుడికి చూపించి, శివానీ పట్ల ఉండే భయం తొలగించమని రాజన్‌కి చెప్పాను. అందుకే ఈసారి శోభని రిజర్వ్‌లో ఉంచాను' అన్నాడు కనక్.

'మీరీ విషయం రాజన్‌తో కాక ఇంకెవరి కయినా చెప్పారా?' ప్రశ్నించాడు శరత్.

'కమిటీలో చెప్పాను. నా ఆలోచన సమంజస మైనదే అన్నారు వాళ్ళు'

'శోభకు అడ్డు తొలగించడమే శివానీ హత్యకు కారణమై ఉంటుందా?

'ఛ... ఛ... రాజన్, అలాంటి వాడు కాదు' అన్నాడుగానీ మాటల్లో కనక్ బలహీనపడటం గమనించాడు శరత్.

'రాజన్ హత్య చేయకపోవచ్చు. కానీ చేయించి ఉండవచ్చుగా?' అడిగాడు శరత్. కనక్ మౌనం వహించాడు. అర్థాంగీకారమైన మౌనం అది.

●●●

'బాస్, నెల రోజులుగా రాజన్ కదలికలు, అతని కాల్‌డేటా, బ్యాంక్ ఎకౌంట్ వివరాలివి' అందిం చాడు రాము.

'శోభ, రాజన్‌ల ప్రతి కదలికనూ మనవాళ్లు పరిశీలిస్తున్నారుగా!'

'యెస్ బాస్... ఇంతవరకూ ఎలాంటి అను మానం రాలేదు'.

'సరే, ఓసారి శోభను ప్రశ్నిద్దాం' అన్నాడు శరత్ ఆలోచిస్తూ.

●●●

'నాకు తెలుసు. ఎందుకనో శివానీ బాగా ఆడితే నేను ఔట్ అయిపోయేదాన్ని. నాన్న నాకు కౌన్సెలింగ్ ఇప్పించారు. కోచ్‌తో మాట్లాడారు'

'శివానీని చూస్తే నీకు ఎందుకంత న్యూనతా భావం?' అడిగాడు శరత్.

'ఏమో తెలియదు. కానీ అది బాగా ఆడితే నా బాయ్‌ఫ్రెండ్ దాని వెంట పడతాడని నాకు భయం' శోభ కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

'బాయ్‌ఫ్రెండ్ ఎవరు?'

'నేను సరిగ్గా ఆడటం లేదని శివానీతో గణేశ్ ఫ్రెండ్‌షిప్ చేసినప్పటి నుంచీ నాకు అన్నిటి మీదా ఇంటరెస్ట్ పోయింది. క్రికెట్ ఆడాలని పించటం లేదు'

'గణేశ్ ఎవరు?' అడిగాడు శరత్.

'బాక్సర్. ఇండియాకు రిప్రజెంట్ చేశాడు' చెప్పింది శోభ. రాముకి ఫోను చేస్తూ బయటకు నడిచాడు శరత్.

●●●

బాక్సింగ్ పంచ్‌లు ప్రాక్టీస్ చేస్తున్న గణేశ్ శరత్‌వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

'ఎలా ఉంది చెయ్యి?' అడిగాడు శరత్.

'నా చెయ్యి బాగానే ఉంది. ఇంతకూ ఎవరు మీరు? ' అన్నాడు గణేశ్.

'గాయం ఎలా తగిలింది? బాక్సింగ్ చేస్తుం టేనా? కత్తితో పొడుస్తుంటేనా?'

'షటప్... ఎవరు మీరు?' కోపంగా అడిగాడు గణేశ్.

'చేతికి ఉన్న బాక్సింగ్ గ్లవ్స్ ఇతర కట్లు విప్పి చూపించు' అడిగాడు శరత్.

'ఎందుకు చూపించాలి? ఎవరు మీరు?'

విజయ్, రాము గణేశ్‌ని కదలకుండా గట్టిగా పట్టుకున్నారు. శరత్ అతడి చేతి గ్లవ్స్, కట్లు విప్పి చూశాడు. చేతి నిండా కత్తి గాయాలున్నాయి.

'ఇవి బాక్సింగ్ గాయాల్లా లేవు. శివానీని కత్తితో పొడుస్తుంటే అయిన గాయాలు' అన్నాడు శరత్.

గణేశ్ మెరుపులా విజయ్‌ని, రామును విది లించుకుని శరత్ పైకి లంఘించాడు. ముందే ఊహించిన శరత్ ఆ దాడి నుంచి తప్పించుకుని వంగి, పిడికిలితో గణేష్ కుడి దవడ మీద, ఎడమ దవడ మీద బలంగా మోదాడు.

●●●

'శోభతో సన్నిహితంగా ఉన్నప్పటికీ, శివానీ బాగా ఆడటంతో గణేశ్ ఆమె వైపు ఆకర్షితుడయ్యాడు. కానీ శివానీ అతన్ని పట్టించుకోలేదు. ఆ కసితో శివానీని దెబ్బతీసి, శోభకు అవకాశం రప్పించా లనుకున్నాడు. శివానీని గాయపరిచే యత్నంలో ఆమె ప్రతిఘటించటంతో కత్తి అదుపు తప్పి హత్య జరిగింది. శోభకు అడ్డు తొలగిందిగానీ ఆమె క్రికెట్ నుంచి విరమించుకుంది. గణేశ్ జైలు పాలయ్యాడు' చెప్పాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ**

**సెల్: 98496 17392**



# వాడని వసంతం

-శ్రీ చరణ్ మిత్ర

**జుట్టు నల్లదనాన్ని అనుభవాలు పీల్చేస్తున్నాయి.**

**అయినా అవి కనబడకుండా ఉండటానికి రకరకాల సౌందర్య సాధనాలు కూడా వచ్చేశాయి.**

**ముడతలు పడ్డ ముఖానికి, నిగారింపుకోసం, నిత్యం యమయాతనలు పడే సుజాత, అద్దంలో మొహాన్ని మరింత పరీక్షగా చూసుకుంది.**

**అప్పుడే తాను అమ్మమ్మ అయిందనే ఆ నిజాన్ని ఆమెకు ఎంత మాత్రం ఒప్పుకోబుద్ధి కావటం లేదు.**

ఉదయాన్నే వియ్యపురాలు ఫోన్ చేసినప్పట్నించీ మనసంతా చికాకుగా తయారయింది సుజాతకి.

"వదినగారూ మీ అమ్మాయి అదే నా కోడలు, మిమ్మల్ని అమ్మమ్మను, నన్ను నాన్నమ్మను చేసేసింది" అంటూ ఎంతో సంబరంగా చెప్పుకొస్తున్న వియ్యపురాలికి ఏమి సమాధానం చెప్పాలో తెలియక క్షణం సేపు నిశ్శబ్దంగా ఉండిపోయింది.

"ఏం వదినా మాట్లాడవు? ఎవరు పుట్టారని కూడా అడగవా?" అంది ఫోన్‌లోనే.

"ఆఁ ఆఁ అదే అడగాలనుకుంటున్నాను. భలేవారే, ఎందుకడగనూ? ఇంతకూ మగబిడ్డా, ఆడబిడ్డా?"

"ఆడబిడ్డ. మహలక్ష్మిలా ఉంది" అందామె అట్నుంచి ఎంతో ఉత్సాహంగా.

"ఇంతకూ రేష్మీకి ఎలా ఉంది?" లేని ఉత్సాహాన్ని తెచ్చుకున్నట్టు నీరసంగా అడిగింది సుజాత.

"బాగానే ఉంది. కాస్త మగతగా ఉన్నట్టుంది. నిద్రపోతోంది. ఇదిగో మీ అల్లుడు మాట్లాడుతాడట" అంటూ అతగాడికి సెల్ ఇచ్చింది వియ్యపురాలు.

"అత్తయ్యగారూ మీ మనుమరాలు అచ్చం మీ పోలికల్తోనే అందంగా పుట్టిందండీ. అమ్మమ్మగారి కోసం ఆల్చిప్పల్లాంటి కళ్లను అల్లల్లాడిస్తోంది. అన్నట్టు మీరు ఎప్పుడొస్తున్నారు?" అడిగాడు అతడు. అల్లుడి మాటలు ఏదో విజయ ఢంకా మోగిస్తున్నట్టుగా వినిపించాయి సుజాతకు.

"ఆఁ ఆఁ వస్తున్నా, ఇదిగో మీ మావయ్యగారు రాగానే బయలుదేరుతా, ఉంటాను" అంటూ మరోమాటకు అవకాశం లేకుండా ఫోన్ కట్‌చేసి, భారంగా నిట్టూర్చింది సుజాత.

"పుట్టిన పిల్ల మీలా అందంగా" అల్లుడు చెప్పిన ఆ పదం చెవిలో పదేపదే వినిపించ సాగింది. మనసంతా హాయిగా అనిపించింది. పుట్టిన ఆడపిల్ల తనలా ఉండాలని కోరుకోకపోతే వాడు మగాడెలా అవుతాడు. తన అందం ఏ తరానికి అయినా ఎవర్‌గ్రీనే మరి, అనుకుందామె గర్వంగా.

కానీ మరీ ఇంత తక్కువ కాలంలోనే తనను 'అమ్మమ్మ' అని పిలిచే దౌర్భాగ్యాన్ని కలిగించిన ఆ చంటి దానిపై కసిగా ఉంది సుజాతకు.

అసలు తన కూతురు రేష్మీకి బుద్ధిలేదు. పదహారేళ్లు నిండక ముందే మనోహర్‌తో లవ్‌లో పడింది. పంతంపట్టి మరీ పెళ్లి చేసుకుని, సంవత్సరం తిరగక ముందే తల్లయి కూర్చుంది. ఆ అమ్మాయి ఎలాపోయినా పర్లేదు. యవ్వనపు సౌందర్యపు శరీరఛాయలు ఇంకా తన శరీరాన్ని వదిలి పెట్టకముందే అమ్మమ్మ అయింది తను. ఈ వయసులో ఆ పిలుపులేంటి? అసహాయంగా.

దిగులుగా కూర్చుంది సుజాత. వ్యక్తపరచలేని ఆందోళన ఆమె హృదయాన్ని ఆవరించేయ సాగింది.

అందమైన అమ్మాయి, కాలేజీ బ్యూటీ, చార్మింగ్ ఫేస్, బల్క్ బ్యూటీ, సూపర్‌షేప్స్. ఇలాంటి అభినందనలతో మునిగి తేలిన తాను, అప్పుడే అమ్మమ్మ అయిపోయిందా? ఇంకా నయం. తనకు రేష్మీ కాక మరో మగవెధవ ఎవడో పుట్టి ఉంటే, వాడికీ ఓ పిల్లో, పిల్లోడో పుడితే, వాడు నన్ను నాన్నమ్మ అనో మామ్మ అనో పిలిచేవాడు కాబోలు.. 'మామ్మ' ఎంత అసహ్యాకరమైన సంబోధన.

జన్మఎత్తిన పదమూడేళ్లకి శరీరానికి నాజూకు పెంచిన యవ్వనసిరులు, కలువల్లా విచ్చుకుని కన్నులను తేజోవంతం చేసేలా రూపొంది అత్యంత మనోహరంగా తయారుచేసుకున్న తన తనువు, ఇంత త్వరగా అంటే.. పెళ్ళయిన ఒక ఇరవయ్యేళ్లలో... అమ్మగా, అమ్మమ్మగా, ఇలా రూపాంతరం చెందుతూ ఉంటే, ఊహించటానికే భయంకరంగా తోచింది సుజాతకు.

తన శరీరాన్ని, తనను ఆబగా చూసే వారిని హైస్కూల్ నుండీ గమనిస్తూనే ఉండేది సుజాత. సైన్సు మాష్టారు తనను తాకాలని రకరకాలుగా అవస్థలు పడటం ఇంకా ఇప్పుడిప్పుడే జరిగినట్లుంది తనకు. తన అందానికి ముచ్చటపడో, సంఘానికి భయపడో అరవిందరావు అనే అబ్బాయి, తన నోట్సులో, అందమైన ఒక అమ్మాయి బొమ్మ చిత్రించి, దానికింద తన పేరు రాసి ఉంచుకున్నందుకు, అతడిని డ్రాయింగ్ టీచర్ పిచ్చిదెబ్బలు కొట్టిన సందర్భంలో స్టూడెంట్స్ అందరూ నవ్వినా, సుజాతకు అతడిపై జాలే కలిగింది.

తనలో ఏదో ప్రత్యేకత ఉందని తొలిసారిగా చక్షువు తెరిపించిన ఆ చెలికాడు ఆ సందర్భంలోనే స్కూల్ మానేశాడు పాపం.

తరువాత కాలేజీ. ఒక విధంగా చెప్పాలంటే కుర్రకారు వెర్రెత్తిపోయేవారు. నలుగురు ఆడపిల్లలతో కలిసి నడిచే టప్పుడు వారినందరినీ డామినేట్ చేసే విధంగా మగవాళ్ల చూపులన్నీ తన వైపే నిలిపి ఉంచే తన శరీర లావణ్యానికి తనకు తానే గర్వపడేది. అద్దం ముందు నిలబడి హిమోన్నతనగంలా తెల్లగా నిగనిగలాడే తన శారీరక వంపుసొంపులకు తనే మురిసిపోయేది.

"సుజాత పక్కనుంటే, మనం ఈ మగ వెధవలకు కనిపించమేతల్లీ.." అంటూండేది తరచుగా తన స్నేహితురాలు రాగిణి. అది అలా అంటున్నప్పుడల్లా తనకు ఎంతో గర్వంగా ఉండేది.

నిజానికి రాగిణి కూడా అందమైనదే. కానీ తన సౌందర్యం గాడ్ గిఫ్ట్. తనకే స్వంతమైన అందం. అప్పట్లో తనను సరిపోల్చటానికి పాపులర్ సినిమా యాక్టర్ల పేర్లు కూడా సరిపోయేవి కావు.

పాపం అప్పట్లో కుర్రకారు రకరకాల అవస్థలు పడుతుంటే విలాసంగా నవ్వుకునేది సుజాత. వాళ్లను రెచ్చకొట్టటానికో తనను మెచ్చుకోవాలని పట్టుబట్టటానికో అన్నట్లు తను కూడా రకరకాల వస్త్రధారణలతో మరింత అందంగా తయారయ్యేది. అంతులేని ప్రేమలేఖలు, అవధులు లేని అభిమానులు, తనెవరితో మాట్లాడినా అవతలి వారు పొంగిపోతూంటే ఆ అవకాశం దొరకని మిగతావారు అసూయపడే వారు. తను మాట్లాడటమే 'గోల్డెన్ ఛాన్స్' అన్నట్లు మురిసిపోయే వారు మగవాళ్ళు. కనీసం ఓ రెండు డజన్ల కళ్లు తన వైపు ఆత్రంగా చూసేవి ఎల్లప్పుడూ.

అలాంటి రోజుల్నించి మరికాస్త ముందుకు జరిగితే. పెళ్ళి. తనని పెళ్ళాడకపోతే చస్తాడంటూ అత్తయ్య కొడుకుని అతి తొందరగా అతికించేశారు. నిజానికి అతడు కూడా అందగాడే. పైగా తనంటే అంతులేని ప్రేమ అతడికి. తన అందం అతడిని కూడా పిచ్చెక్కించేసేది. తనను పొగడటానికి, ప్రసన్నం చేసుకోవటానికి రకరకాల అవస్థలు పడేవాడు. తన అందాన్ని మెచ్చుకునే భాష అతనికి పట్టుపడక, క్లాసు పుస్తకాలను కూడా అంత ఇంట్రెస్ట్‌గా చదవని శ్రీవారు, రకరకాల సాహిత్య పుస్తకాలను, మ్యాగజైన్‌లను తెప్పించి, అందమైన నాయికల శారీరక వర్ణనలతో తనని పోల్చి వర్ణించేవాడు. అలా తనని పొగిడేటప్పుడు తాను పారిజాత ప్రభంజనమే అయ్యేది. ఒకసారి పడక మీద నుండి లేవగానే-

"ఈ పౌర్ణమికి ఇద్దరు చంద్రుళ్లు వచ్చారనుకున్నాను. రాత్రంతా నువ్వు నా పక్కనున్నావని పొద్దున్న తెలిసిందాక-" అని తన వదన సౌందర్యాన్ని వర్ణిస్తూంటే, అతను ఇంకా అలా పొగిడితేనే బాగుణ్ణనిపించేది.

ఎవరికైనా ఎలా ఉంటుందోగానీ తన సౌందర్యాన్ని మెచ్చుకునే వారంటే, పిచ్చి అభిమానంగా ఉండేది తనకు. ప్రకృతిలోని పచ్చదనాన్ని తన పాదాలకు అర్పించాలని, లేత నారింజ తొనల సౌకుమార్యం చిందే తన కాలి పిక్కలకు తొలి సంధ్యలో లేత పసుపును అద్దాలని, పసుపు రాసుకున్న తన కాలి పిక్కలను చూసి అతను పిచ్చెక్కిపోతూంటే... చాలా గమ్మత్తుగా ఉండేది.

తన నల్లని వాలు జడలో మల్లెచెండులా మారి, మెరుపులు సంతరించుకున్న తన మెడను వెచ్చని ఊపిరితో గిలిగింతలు పెడుతూ ఎన్నెన్నో చిలిపిచేష్టలతో అతను చేసిన 'శృంగారయోగం' తన స్త్రీత్వాన్ని మరింత ఉద్దీపింపచేసేది.

పాప పుట్టాక ఆయన ఒకసారి అడిగారు.

"సుజా నీ కాలి మొత్తాన్ని ఒక్కసారి వెలుగులో చూడాలని ఉంది'.

"ఎందుకు?"

"పాప బరువు ఇన్నాళ్లు నీ పొట్టలో మోశాక, నే మునుపు చూసిన ప్రకాశవంతమైన దీప స్తంభాలను మరిపించే నీ కాలి తొడలపై మెరిసే ఆ వజ్రాల మెరుపు అలానే ఉందా? ఏమైనా మాసిందా? అని"

ఆ మాటలకు ఆమె సాధారణ స్త్రీలా 'ఛీ' అనలేదు. సిగ్గు నటించనూ లేదు. తనలో తాను గర్వపడింది. మరింత ఆరాధనగా అతనికేసి చూసింది. చేప పిల్లల్లాంటి కళ్లు మరింత అల్లరిగా నవ్వాయి. అతని కోరిక తీర్చటంలో తనకూ ఆనందం ఉంది. తన సౌందర్యం ఎప్పటికీ అతనికి గిలిగింతలు పెడుతూందనే నమ్మకాన్ని కలిగించాలని ఉంది.

"మరి వాటిని చూశాక మీరు అక్కడే నిద్రిస్తానని అనరు కదా?" అందామె నవ్వుతూ.

"ఆ భాగ్యం ఇప్పుడు మీ అమ్మాయికి ఇచ్చేశావు కదా. నాకయితే ఏదో సినిమాపాటలో



అన్నట్టుగా' నీ ఒడిలో నిదురించి - తీయని కలగాంచి, పొంగిపోయాను - పుణ్యమెంతో చేశాను' అనిపిస్తూంది. కానీ ఇప్పుడు బ్యాడ్ లక్. రేష్మీకే ఆ చాన్స్ ఎక్కువ ఇస్తున్నావు" అన్నాడు బుంగమూతి పెడుతూ.




అతడిని మురిపెంగా దగ్గరకు తీసుకుని ఎదకు ఆనించుకుని- "అక్కడే పడుకోవాలా? మీరు నిదురించాలంటే ఇక్కడా చోటు ఉందను కుంటా..' అంది ఆయన్ని మరింతగా హత్తుకుంటూ.

ఎద స్పందనల లయకు నిదురించే పాపాయిలా తన్మయత్వంతో అతను కళ్లు మూసుకుని తన శరీర సుగంధాన్ని ఆస్వాదిస్తూంటే తనకూ మత్తుగానే ఉండేది.

"అన్నట్టు నిన్నొక చిత్రం జరిగింది తెలుసా?" అనడిగాడు అతను.

"ఏమిటి?" అందామె. ఇంకా తమకం నుండి తేరుకోకుండానే.

"నాకు వెన్నెల అందించటానికి మబ్బులు, ఈ పిల్లదానికి పాలివ్వటానికి వాళ్లమ్మా హడావిడిగా పమిట జార్చారు. చిత్రం ఇద్దరం ఒకేసారి ఏడుపు ఆపేశాం తెలుసా?" అన్నాడు. ఎద సంపద వైపు ఆబగా చూస్తూ.

"ఈ నాలుగు ముక్కలు ఎక్కడివి?" చిన్నగా నవ్వుతూ అడిగిందామె.

"నిన్ననే ఏదో పత్రికలో చదివాను. ఎవరో కవయిత్రి అనుకుంటాను. పేరు సరిగ్గా గుర్తు లేదు. అవి నానీలో, హైకులో గుర్తులేదు కానీ, కొన్ని ముత్యాలను ఏరి నీకోసం దాచుకున్నాను" అన్నాడు అతడు.

"ఊహూ, అలాగే మీకిప్పుడు అవి కావాలన్న మాట" అంటూ మత్తుగా అతని చెంపలను తన చెంపలకు హత్తుకుంటూ ఎదకౌగిలిలో ఆమె అతన్ని బంధించటానికి సుతి మెత్తని ఆ కంకణాలంకృత కరద్వయం కమనీయ ప్రణయానికి అంకురార్పణ చేస్తూ, ఆర మగ్గిన మామిడి పండ్లలా రసాన్ని ఆస్వాదించుకుంటూ ఆహ్వానించిన ఆ స్తనద్వయం అతనికి అందించేది. ఎంత విచిత్రమైన దేవుడో.. బంగారు వన్నెల స్వర్ణకల



అడవుల్లోని దావానలం
ఆరోహణ క్రమంలో ఎగువకు
వ్యాపించినంత వేగంగా
దిగువకు వ్యాపించదు.

శాలపై నల్లటి తొడుగుతో అలంకరించి, అర్థం కాని లిపితో ఎద లోగిల్లోంచి... నిర్విరామ ప్రణయానికి సాక్షిగా పైన సీలింగ్ ఫ్యాను స్టీలు కన్ను, వారి వేగాన్ని, ఆ ప్రతిబింబాల్ని తనలో ఇముడ్చుకోలేక తీయగా మూలిగేది.

అలా ఇప్పటికీ ప్రణయ జలధిలో కొట్టుమిట్టాడుతున్న తమను ఈ జగతి ముసలి వాళ్లగా పరిగణించే సమయం అప్పుడే వచ్చేసిందా? తనకిప్పుడు అమ్మమ్మ బిరుదా? తప్పదా? సీలింగ్ ఫ్యాను చల్లగాలి కూడా తగ్గించని వేడి వాయువులు పాపం సుజాత శరీరాన్ని, తలను వేడెక్కించేస్తున్నాయి.

ఇంతలో బయట తలుపు కొట్టిన చప్పుడు.

బహుశా అతనే "తలుపు తెరచే ఉంది" చెప్పింది తను.

అతను తలుపు తోసుకుని లోపలకు వచ్చాడు. మొహం అంతా ప్రకాశవంతంగా ఉంది. సంతోషపు ఛాయలు అతని వదనంలో తారట్లాడుతున్నాయి. "సుజా, నీకు మనుమరాలు పుట్టిందట. అమ్మాయే స్వయంగా ఫోన్ చేసింది తెలుసా?" అన్నాడతను ఎంతో ఉత్సాహంగా.

'ఎవరికి చేసింది? తాతగారికా?" అంది ఆమె నిర్లక్ష్యంగా.

"తాత ఎవరు?" అర్థం కానట్టు అడిగాడు తను.

"ఇంకెవరవుతారు? మీరే! ఆ పుట్టిన నంగనాచికి మీరు తాతేగా మరి" అందామె ఉడుకు మోత్తనంగా. ఆయన అర్థం చేసుకుని "ఓహ్ నేను తాతనయితే, నీవు మామ్మవు కావేమిటి?" అన్నాడు పెద్దగా నవ్వుతూ. అంతే అరికాలి మంట నెత్తికెక్కినట్లయింది సుజాతకు. చేతిలో ఉన్న వస్తువును నేలకేసి కొట్టి, "చూశారా? అప్పుడే మీరు నన్ను మామ్మ అనేస్తున్నారు. అలా పిలి పించుకోవటం నాకస్సలు ఇష్టం లేదు" అంది ఆమె కళ్లల్లో నీళ్లు సుడులు తిరుగుతుండగా.

ఆమె తీయని గొంతులో దుఃఖపు జీర అతను భరించలేకపోయాడు. దుఃఖంతో ఆమె శరీరం అంతా కంపించటం చూసి, ఆమెని నెమ్మదిగా సోఫాలో కూర్చోబెట్టాడు.

"సుజా, ఏవిటీ అర్థం లేని ఆవేదన? ప్రకృతి ధర్మం అనేది ఒకటుంది కదా. సహజ పరిణామాన్ని ఆనందంగా స్వీకరించాలి గానీ ఆందోళన పడటంలో అర్థం ఉందా సుజా. పుట్టినబిడ్డకు నీవు అమ్మమ్మవు అయ్యావేమో గానీ నాకు నువ్వెప్పుడూ నా అందాల సుజాతవే కదా! కన్యగా, ముగ్ధగా, ఇల్లాలిగా, నిన్ను వివిధ దశలలో ప్రేమించి, ఆరాధించి నా హృదయానికి హత్తుకున్న నా అందాల రాశిని నేను ఎలా ముసలిదానిగా భావిస్తాననుకున్నావు. వయసునో అందాన్నో చూసిన భర్త దీర్ఘకాల దాంపత్యంలో భార్య దివ్యమైన అనురాగాన్ని చూడడని ఎలా అనుకుంటున్నావు" అతడు గుక్కతీసుకోవటానికి కాసేపు ఆగాడు.

ఆమె ఆసక్తిగా వినసాగింది.

"మగాళ్లగా మాకు అన్నీకావాలి. మీ యవ్వనం కావాలి. మీ సౌందర్యం కావాలి. మీ ఆత్మీయత, అనురాగాలన్నీ మాకే కావాలి. అవన్నీ సొంతం చేసుకున్నాక ఇద్దరి ప్రణయానికి ఫలితంగా ఉదయించే పిల్లలకు, వారి తరాలకు కూడా మనమే ఆదర్శం కావాలి. అవన్నీ సమాజంలో మన సంఘం పెట్టుకున్న హోదాలు! ఒకప్పుడు మీ నాన్నకు అహ్లాదం కూర్చే అమ్మాయివి. తరువాత భర్తకు సుఖాన్ని పంచే ఇల్లాలివి. ఆ తరువాత మన పాపకి తల్లివి. రేపట్నుంచి పుట్టిన చంటి దానికే జన్మనిచ్చిన అమ్మకే అమ్మవు. ఇవి కించపరచటానికో, స్థాయి తగ్గించటానికో మన పెద్దలు ఏర్పరచలేదు. స్త్రీకి పరిపూర్ణమైన జీవిత సాఫల్యతను చూపించటానికి ఒక నిండు జీవితానికి ప్రతీకలుగా ఏర్పరిచారు. ఎవరు ఎలా పిలిచినా, ఏమనుకున్నా సహజ సౌజన్యమూర్తులైన మీ స్థానం ఎప్పుడూ ఉన్నతమే" చెప్పాడు అతడు.

"కానీ రేష్మీతో 'మీ మమ్మీని అడుగు' అన్నట్లుగా, రేపు పుట్టిన దానితో 'మీ అమ్మమ్మకు చెప్పు' అంటూ మీరు ఆ స్థాయిలోనే చూస్తారుగా" అంది బేలగా.

"పిచ్చి సుజా, ఒక అందమైన పుష్పాన్ని, రైతు అంగట్లో పెట్టి అమ్ముకోవాలని చూస్తాడు. ఆ పువ్వును ఆడపిల్ల జడలో పెట్టుకుని మురిసిపోతోంది. భక్తుడు దేవుడికి పెట్టి పూజిస్తాడు. ఆయుర్వేద వైద్యుడు ఆ పువ్వు రసంతో వైద్యం చేస్తాడు. ప్రకృతి ప్రేమికుడు ఆ పువ్వును ఆ చెట్టుకు అలాగే ఉండాలనుకుంటాడు. ఇక్కడ వ్యక్తులు, ఆ పువ్వుతో చేసే చర్యలు మారాయే గానీ పువ్వుమారదు. అలాగే మీరు కూడా! కన్యగా, ఇల్లాలిగా, తల్లిగా, వివిధ స్థాయిల్లో స్త్రీ గౌరవం పదిలపరచబడుతూ ఉంటుంది. ఏ దశలోనైనా స్త్రీ పూజనీయురాలే. ఇక శృంగార

పరంగా అంటావా నచ్చిన వ్యక్తిని అవతల వ్యక్తి భౌతికంగానో మానసికంగానో రమిస్తూనే ఉంటాడు. వృద్ధాప్యం అనేది చూసే కళ్లకే గాని ఇవతల వ్యక్తిలోని సమర్ధతకు గీటు రాయి కానే కాదు".

"నువ్విలా అనుకుంటున్నావు కానీ నిన్ను పొందిన అదృష్టం నాకు లభించింది. లేనట్లయితే నా జ్ఞాపకాల్లోనే ఇప్పటికీ పదిలంగా ఉంచుకునే వాడిని. నేనే కాదు నిన్ను దక్కించుకోలేని వారం దరి జ్ఞాపకాల్లోనూ నీవు సౌందర్యరాశివే. వాళ్లకు నువ్వు అమ్మవా, అమ్మమ్మవా అనే ప్రశ్నే ఉండదు. నిత్యం నీతో మాట్లాడాలని, ఒక్కసారైనా నీ సాంగత్యంలో గడపాలనే ఉంటుంది. ఈ క్షణంలో నాకు కూడా నీ ఎదలో కరిగిపోవాలని ఉంది. అమ్మగా నీవు ప్రతిఘటించినా, అమ్మమ్మలా వ్యతిరేకించినా మగాడు ఎప్పుడూ స్త్రీ ఆరాధకుడే.."

"మీరు కూడా ఎప్పుడూ అలానే ప్రేమించగలరా?" సంశయంగా అడిగింది సుజాత.

"నేనే ఏం ఖర్మ? అందంగా ఉన్న మీలాంటి ఆడవాళ్ళను ముసలాళ్లే కాదు వయసు వచ్చిన కుర్రాళ్లు కూడా ఆరాధిస్తారు. అది భగవంతుడు మీకు ఇచ్చిన వరం. అయితే మీరే ఇద్దరు పిల్లలు కలిగేసరికి, మేము ముసలాళ్లం అయిపోయాం అనే భావంతో, అటు శరీరం మీద, దాంపత్య సౌఖ్యం మీద విముఖత చూపిస్తారు. ఫలితంగా ప్రేమ కరువై ఒకరిపై ఒకరికి ఉండాల్సిన అనురాగం దూరమై సంసారంలో మరబొమ్మల మాదిరి తయారవుతారు. మీరే కాస్త ఉత్సాహం చూపి, వయసు అయిపోయిందనే భావనకు రాకుండా, మేం ఎప్పుడైనా, ఎవర్నయినా ఆకట్టుకో గలం... అనే భావనకు రాగలిగితే ప్రతి సంసారం నందనవనం అవుతుంది."

అతని వాదనతో నిశ్శబ్దంగా ఉండిపోయిన సుజాత కొంతసేపటి తరువాత అంది "రేప్మి దగ్గరకు ఎప్పుడు వెళ్దాం. చంటిదానికి ఏం తీసుకెళితే బావుంటుంది".

అతడు చిన్నగా నవ్వి, ఆమె బుగ్గలమీద సుతారంగా రాస్తూ 'అమ్మమ్మని తీసుకెళదాం' అన్నాడు పెంకితనంగా. ఆమె చెంపలు కెంపులయ్యాయి.

•••

తరువాత కొన్ని రోజులకు సుజాత, చంటిదానికి ప్రాణం అయిపోయింది. ఇప్పుడు వాళ్లిద్దరూ చాలా బిజీ అయిపోయారు. చంటిదాని కేరింతలో సుజాత తనూ చిన్నపిల్లలా కేరింతలు కొడుతూంది.

చంటిదాని లేత శరీరం కోసం ఉపయోగించాల్సిన బేబీ ఆయిల్స్, క్రీమ్స్, తను కూడా తన శరీరపు నునుపుదనం కోసం తన ఒంటికి పూసేసుకుంటోంది.

ఎన్నిచేసినా తననెవరైనా గమనిస్తున్నారా లేదా అనే అనుమానం సుజాతను వదలనే లేదు. గమనింపును కోరుకోవటంలో చెప్పుకోదగ్గ దోషమేమీ ఉండదు గానీ, ఆ సింగారింపు ప్రక్రియలతో సుజాతకు భర్తను ఉడికించడం అలవాటయిపోయింది.

ఒకరోజు తల దువ్వుకుంటూ అతని దగ్గరకు వచ్చింది సుజాత.

"అబ్బ గంటల నుండి ఆ తల దువ్వుతున్నావు సుజా. ఇంకెప్పుడు తెములుతావు" అన్నాడతను చిరాగ్గా.

"ఉండండి, ఆడవాళ్లు ఆకర్షించుకునేలా తయారు అవ్వాలని మీరే కదా చెప్పారు".

"కురుల మీదుగా మెరుపు జాలువారుతోంది. నిన్న ఓ అపరిచితుడు నా జుట్టు వైపు ఆరాధనగా చూసిన గుర్తు. అతడు మళ్లీ చూడాలంటే..." అంది కొంటెగా నవ్వుతూ.

"ఆc ఏమిటంటున్నావు?" అన్నాడతడు చకితుడై.

"కంగారు పడకండి బాబు. మీరు కట్‌చేసి పెట్టుకున్న పేపర్ కటింగుల్లో నుండే తీశాను ఈ కవిత" అంది కురులను మరింత దువ్వుకుంటూ.

అతడు వెనుకవైపు నుంచీ ఆమె కురులలో ముఖం దాచుకుంటూ, పరిమళాన్ని ఆస్వాదిస్తూ ఆమెను ఆర్తిగా కౌగలించుకున్నాడు.

సెల్: 95735 66990

## మనమీదేనర్రోయ్!

సరసి








**లంకలో సీతాదేవిని చూశాననీ, లంకాదహనం చేసి మరీ వచ్చాననీ చెప్పాడు హనుమ. అందరూ ఒప్పుకుంటే రావణుణ్ణి పరిమార్చి, రాముణ్ణి దర్శిద్దామన్నాడు. వద్దన్నాడు జాంబవంతుడు. ముందు రాముణ్ణి దర్శించి, ఆ తర్వాత ఆయన నిర్ణయానుసారం ప్రవర్తించడం మంచిది అన్నాడు. సరేనన్నారు వానరవీరులు. కిష్కింధకు బయల్దేరారు. వస్తూ దారి మధ్యలో మధువనాన్ని చూశారు. ఆకలి దప్పులు తీర్చుకుందామనుకున్నారు. మధువనంలో ప్రవేశించారు. అక్కడ పళ్ళూ తేనెలూ తిన్నంత తిని, తాగినంత తాగి మత్తెక్కారు. వనాన్ని సర్వనాశనం చేశారు. వారిని వారించేందుకు ప్రయత్నించిన దధిముఖుణ్ణీ, అతని అనుచరగణాన్నీ చితకబాదారు. తిన్న దెబ్బలు చూపించి, జరిగిన అవమానాన్ని చెప్పి, వానరవీరుల్ని గట్టిగా శిక్షించాలనుకున్నాడు దధిముఖుడు. పరుగుదీశాడు అక్కణ్ణుంచి.**

ఆరాటాన్ని ఆపుకోలేకపోతున్నాను, దయచేసి చెప్పండి."

చెప్పమన్నట్టుగా హనుమకు సైగ చేశాడు అంగదుడు. అలాగేనన్నట్టు తలూపాడు హనుమ. చెప్పేందుకు సిద్ధమయ్యాడు. ముందుగా సీతాదేవి ఉన్న దిక్కునకు నమస్కరించాడతను. తర్వాత సీతను తలచుకుని ఆమెకు నమస్కరించాడు. ఆ తర్వాత రామునితో అన్నాడిలా.

"రామా! నీ దయతోనే నేను నూరుయోజనాల సముద్రాన్ని దాటి లంకానగరానికి చేరుకున్నాను. సీతాదేవికోసం వెదికానక్కడ. రావణ సౌధానికి సమీపంలో గల అశోకవనంలో ఆమెను ఎట్టకేలకు చూశాను. అనేకమంది రాక్షసస్త్రీలు సీతాదేవిని కాపలా కాస్తున్నారు. బందీయై శోకిస్తోంది సీతాదేవి. ఉపవాసాలతో కృశిస్తూ, నిన్నే ధ్యానిస్తూ, నీ నామమే జపిస్తూ ఉన్నదామె. కటిక నేలపై పడుకుంటోంది. కొన ఊపిరితో జీవిస్తోంది."

సీతా అని ఘూర్ణిల్లాడు రాముడు. సుగ్రీవుని కౌగిలి వీడి చేతుల్లో ముఖం దాచుకున్నాడు.

# సీత జాడ చెప్పిన హనుమ:రాముని విలాపం

రామలక్ష్మణులనూ, సుగ్రీవుణ్ణీ సమీపించాడు దధిముఖుడు. జరిగిందంతా వారికి విన్నవించాడు. చెప్పిందంతా కళ్ళు మూసుకుని జాగ్రత్తగా విన్నాడు సుగ్రీవుడు. హనుమాదుల అల్లరిలో గల ఆంతర్యాన్ని గ్రహించాడతను. సన్నగా నవ్వుతూ కళ్ళు తెరిచాడు. సుగ్రీవుణ్ణి రామలక్ష్మణులు గమనించారు. అతని హావభావాలు అంతుచిక్కలేదిద్దరికీ. వారికే కాదు, దధిముఖునికి కూడా మహారాజు చర్య మతిపోగొట్టినట్టయింది. లక్ష్మణునిసహా అడిగాడు దధిముఖుడు.

"ఏమిటి మహారాజా! ఎందుకు ఆ చిరునవ్వు?"

"ఎందుకంటే... నా మిత్రుడు రాముని కార్యం నెరవేరింది, అందుకు." అన్నాడు సుగ్రీవుడు.

ఆశ్చర్యానందాలతో రామలక్ష్మణులు ఒకరిని ఒకరు చూసుకున్నారు.

"లక్ష్మణా! హనుమంతాదులు మధువనంలో ప్రవేశించి, నానా యాగీ చేశారంటే దాని అర్థం సీతాదేవిని వారు కనుగొన్నారు. ఆమె ఎక్కడ ఉన్నదీ తెలుసుకున్నారు."

"నిజమా మిత్రమా?" సుగ్రీవుణ్ణి అభినందిస్తున్నట్టుగా అతని భుజమ్మీద చేయి వేశాడు రాముడు.

"నిజం మిత్రమా! నా ఆలోచన ఎప్పుడూ తప్పుకాదు. సీతాదేవిని హనుమంతుడే సందర్శించి ఉంటాడని కూడా నాకెందుకో గట్టిగా అనిపిస్తోంది."

ఆ మాటలకి రామలక్ష్మణులు పులకించిపోయారు. ఒకరిని ఒకరు గట్టిగా కౌగిలించుకున్నారు. వారి ఆనందాన్ని రెట్టింపు చేస్తూ దధిముఖునితో అన్నాడిలా సుగ్రీవుడు.

"మామా! నువ్వు వెంటనే వెళ్ళి అంగదాదులకి ఇలా చెప్పు. మీ నోటంట శుభవార్త వినేందుకు ఇటు రామలక్ష్మణులూ, అటు సుగ్రీవుడూ నిరీక్షిస్తున్నారని చెప్పు. వెంటనే ఇక్కడికి రమ్మను."

"సరే మహారాజా" అన్నాడు దధిముఖుడు. బాధనంతా మరచిపోయాడతను. మహదానందంగా ఉన్నాడు. అనుచరులసహా ఆకాశానికి ఎగిరాడు. మధువనాన్ని చేరుకున్నాడు. ఆసరికి మత్తు దిగి, అలసిసొలసి కూర్చున్నారు వానరవీరులు. విరిచిన ఓ చెట్టును ఆనుకుని, కళ్ళు మూసుకుని కునుకు తీస్తున్న అంగదుణ్ణి చేరుకున్నాడు దధిముఖుడు. మహారాజు సుగ్రీవుడు చెప్పిన వార్తను అతనికి వినిపించాడు. తర్వాత మధువనంలో వానరవీరుల్ని అడ్డగించినందుకు క్షమాపణ కోరాడు. అతని క్షమాపణ గురించి పెద్దగా పట్టించుకోలేదు అంగదుడు. లేచి నిల్చుని హనుమాదులతో అన్నాడిలా.

"మహారాజు ఆదేశం విన్నారు కదా! మన వార్తలు వినడానికి రామలక్ష్మణులు ఆరాటపడుతున్నారట, పదండి."

యువరాజు ఆజ్ఞ వినిపించడమే ఆలస్యం, హనుమాదులంతా ఒక్కసారిగా ఆకాశానికి ఎగిరి, గర్జనలూ, కిలకిలధ్వనులూ చేస్తూ ప్రస్రవణగిరికి పయనమయ్యారు. గిరి మీద అడుగు మోపగానే తిన్నగా రాముణ్ణి సమీపించాడు హనుమ. అతనికి శిరస్సు వంచి నమస్కరించాడు.

"సీతాదేవిని చూశాం స్వామీ" అన్నాడు.

చెప్పానా! నా మాటే నిజం అయింది అన్నట్టుగా రాముడు భుజమ్మీద చేయి వేసి, గట్టిగా నొక్కాడు సుగ్రీవుడు. రాముడు అతన్ని కౌగిలించుకున్నాడు. వానరవీరులవైపు తిరిగి అడిగాడిలా.

"మీలో సీతను చూసిందెవరు? ఇప్పుడు ఆమె ఎక్కడ, ఏ స్థితిలో ఉంది? నాకేమైనా చెప్పమన్నదా?

"రాక్షసస్త్రీలు పెట్టే బాధలు భరించలేక, సీతమ్మతల్లి ఆత్మహత్య చేసుకునేందుకు ప్రయత్నించడాన్ని గమనించాను. దానిని ఆపాలి అనుకున్నాను. అయితే ఆ తల్లి నన్ను గుర్తించి, నా మాట వినేందుకు నీ సద్గుణాలను వర్ణించాను. నువ్వు ఇచ్చిన ఉంగరాన్ని ఆమెకు సమర్పించాను. అయినా నన్ను నమ్మలేదామె. అప్పుడు ఆ తల్లి కోసం నువ్వెంతగా తపిస్తున్నదీ తెలిపి, జరిగిన సంఘటనలన్నీ ఒకొక్కటిగా చెప్పుకొచ్చాను. అప్పుడు నన్ను నమ్మిందామె. నమ్మి, నిన్ను చూడగలనన్న ఆశతో ఆనందంగా నవ్వింది."

"తర్వాత" అడిగాడు రాముడు.

"తర్వాత నువ్వు నమ్మగలిగే గుర్తు ఏమైనా ఇమ్మని ఆమెను ప్రార్థించాను. అందుకామె చిత్రకూటంలో జరిగిన సంఘటనను కథగా చెప్పింది. కాకిని శిక్షించేందుకు నువ్వు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించడం, బ్రహ్మాస్త్రాన్ని తప్పించుకునేందుకు కాకి ముల్లోకాలూ తిరగడం, ఎంత తిరిగినా ప్రాణాపాయాన్ని తప్పించుకోలేక ఆఖరికి నిన్నే అదిశరణు వేడడం, శరణు వేడుకున్న కారణంగా కన్నును లొట్ట చేసి విడిచిపెట్టమని నువ్వు అస్త్రాన్ని ఆదేశించడం, నువ్వు చెప్పినట్టే చేసి, అస్త్రం అదృశ్యం కావడం... అదంతా అందమైన ఓ జ్ఞాపకం అని, ఆ జ్ఞాపకాన్ని నీకు గుర్తు చెయ్యమన్నది సీత. నువ్వింకా నమ్మేందుకు కొంగుముడిలో దాచిన శిరోరత్నాన్ని నీకు అందజేయమని నాకిచ్చిందామె. ఇస్తూ అన్నదిలా.

'రామా! ఈ శిరోరత్నం అంటే నీకిష్టం. ఆ కారణంగానే దీనిని రక్షిస్తూ వచ్చాను. నీ వియోగాన్ని ఈ రత్నాన్ని చూసి మరిచిపోయేదాన్ని. ఇప్పుడు ఈ రత్నం కూడా నీకు ఇవ్వడంతో ఇకపై



నన్ను ఓదార్చేదేదీ లేదు. రామా! నువ్వు వస్తావు, వచ్చి నన్ను రక్షిస్తావు అన్న ఆశతో ఒక నెల మాత్రమే జీవిస్తాను. ఆ వ్యవధిలో నువ్వు రాని పక్షంలో నేనిక జీవించను'

-విన్నావుగా రామా! నేను చెప్పిన మాటల్లో ఒక్క అక్షరం అబద్ధం లేదు." అన్నాడు హనుమ. జాగ్రత్తగా దాచి ఉంచిన శిరోరత్నాన్ని తీసి, రామునికి అందించాడు. చేతికందిన శిరోరత్నాన్ని చూసి కంటికీమంటికీ ఏకధారగా విలపించాడు రాముడు. గుండెలకు హత్తుకున్నాడు దానిని.

"మిత్రమా" పిలిచాడు. పిలుపు అందుకుని రాముణ్ణి సమీపించాడు సుగ్రీవుడు. అతనితో అన్నాడిలా రాముడు.

"మిత్రమా! ఈ శిరోరత్నాన్ని దేవేంద్రుడు మా మామగారు జనకునికి ప్రసాదిస్తే, కల్యాణవేళ ఆయన దీనిని సీతకు బహూకరించారు. దీనిని చూస్తోంటే సీతేకాదు, మా అత్తమామలూ, నా తండ్రీ అందరూ గుర్తుకొస్తున్నారు. అయితే సీతలేని ఈ శిరోరత్నం బాధాకరం."

"ఊరుకో మిత్రమా! ఊరుకో" సుగ్రీవుడు ఓదార్చాడు.

హనుమను చూశాడు రాముడు. అడిగాడిలా.

"ఇంకా నా సీత ఏమన్నది? నేను లంకకు రానందుకు కోపించిందా? సీత ప్రేమించినా కోపించినా నాకు ఇష్టమే."

"ప్రభూ" ఏం చెప్పను అన్నట్టుగా చేతివేళ్ళు పెనవేసుకుని నిల్చున్నాడు హనుమ.

"సీత ధైర్యవంతురాలే! నా కోసం ఒక నెల జీవిస్తాను అంటోంది. తానెక్కడ ఉన్నదీ తెలిసిన

**శిరస్సు వంచి రామునికి నమస్కరించాడు హనుమ. సీతను చూశాను స్వామీ అన్నాడు. ఆమె ఇచ్చిన శిరోరత్నాన్ని అందజేశాడు. అశోకవనంలో సీతకష్టాలు విని ఘూర్ణిల్లిన రాముడి నేత్రాలు హనుమ సందేశం విన్నంతనే సూర్యగోళాల్లా మారాయి. నరాలు పొంగించి లేచి నిల్చున్నాడు. హనుమతో సీత పంపించిన సందేశం ఏమిటి? కళ్ళు చెమర్చుకున్న రాముడు అంతలోనే ఎందుకు కోపంతో దక్షిణ దిక్కును చూశాడు?**

తర్వాత కూడా నేను ఆమెను చూడకుండా ఒక్క క్షణం జీవించలేనయ్యా! నేను బతకాలనుకుంటే, నన్ను బతికించాలనుకుంటే చిన్న సాయం చెయ్యి హనుమా! నన్ను...నన్ను నా సీత దగ్గరకు తీసుకునిపో." అన్నాడు రాముడు.

"మహాసౌందర్యరాశి నా సీతకు వికృతరాక్షస స్త్రీలు కాపలా? అయ్యో" అన్నాడు. తల పట్టుకున్నాడు రాముడు.

"ప్రభూ! సీతమ్మ ఇంకా ఏమన్నదో తెలుసా?"

"ఏంటందయ్యా?"

"ఒకనాడు మీరిద్దరూ అడవిలో తిరుగుతుండగా చెమటపట్టి, ఆమె నుదుటితిలకం కరిగిపోయిందట! అప్పుడు నువ్వు మణిశిలను అరగదీసి, ఆమెకు తిలకం దిద్దావట! ఈ మాట చెబుతూ తల్లి ఏమన్నదంటే...

'రాముడు కరుణాపరాయణుడు. దివ్యాస్త్రవేది. లంకలో నేను ఉన్నానని తెలిసి, ఒక్క అస్త్రం...ఒకే ఒక్క అస్త్రం ఆయన ప్రయోగిస్తే నా కష్టాలు గట్టెక్కవా చెప్పు? అయినా రాముడు ఎందుకు అస్త్రప్రయోగం చేయడం లేదు? కోపం వచ్చిందేమో! భర్త కనుక ఉపేక్షించాడనుకుందాం. మరి లక్ష్మణుడి మాటేమిటి? నన్ను కన్నతల్లిగా చూసేవాడు. నాకు పాదపూజలు చేసేవాడు. అతనికెందుకు నేను చేదయ్యానో అంతుచిక్కడం లేదు హనుమా! అగ్ని వాయువులు ఆ సోదరులు. నన్నెందుకు కాదనుకుంటున్నారో నాకు అర్థం కావడం లేదయ్యా' అన్నది"

లక్ష్మణుణ్ణి చూశాడు హనుమ. ఏడుస్తున్నాడతను.

"హనుమా! నేనెంతగా క్షోభిస్తున్నదీ, నన్ను రాక్షసస్త్రీలు ఎంతగా వేధిస్తున్నదీ వివరంగా రాముడికి చెప్పు. అలాగే లక్ష్మణుణ్ణీ, సుగ్రీవుణ్ణీ క్షేమం అడిగానని చెప్పు అన్నది సీతమ్మ" అన్నాడు హనుమ.

తల వంచుకుని, శిరోరత్నాన్ని చూస్తూ రాముడు దుఃఖిస్తున్నాడే కాని, తలెత్తి హనుమను చూడలేదు. అప్పుడిలా అన్నాడు హనుమ.

"హనుమా! నా రాముడు వానరవాహినితో ఈ లంకలో ప్రవేశించాలి. సపరివారంగా రావణుణ్ణి హతమార్చాలి. జయజయధ్వానాలు వినవస్తోంటే... నన్ను నా రాముడు అయోధ్యకు తీసుకుని వెళ్ళాలి. అలా తీసుకుని వెళ్తేనే వీరునిగా రాముడికీ, వీరపత్నిగా నాకూ, ఇక్ష్వాకువంశానికీ కీర్తి అని చెప్పు. ఇందుకు భిన్నంగా ఏం జరిగినా నేను తట్టుకోలేనని చెప్పు అన్నది స్వామీ."

అప్పుడు తలెత్తాడు రాముడు. కళ్ళెత్తి హనుమను చూశాడు. ఆ కళ్ళు రెండూ మండుతున్న సూర్యగోళాల్లా ఉన్నాయి. నరాలు పొంగించి, లేచి నిల్చున్నాడు రాముడు. కోపంగా దక్షిణదిక్కును చూశాడు. అడిగాడిలా.

"ఇంకా ఏమన్నది సీత?"

"ఇంకేంఅనలేదు ప్రభూ! నేనే ఆమె పాదాలకు నమస్కరించి ఇలా అన్నాను.

తల్లీ! నీ కష్టాలు గట్టెక్కేకాలం సమీపించింది. రామలక్ష్మణులు లంకకు త్వరలోనే వస్తారు. ఈ రాక్షసుల అంతు చూస్తారు. ఒకవేళ ఏదైనా కారణంతో రామలక్ష్మణులు సముద్రాన్ని దాటి రావడం కష్టమైతే వారిని నా భుజాల మీద ఎక్కించుకుని మరీ నేను లంకకు వస్తానమ్మా! వచ్చి ఈ రావణుణ్ణీ, అతని అనుచరుల్నీ హతమారుస్తాను. జయం మనదే! అప్పుడు రాముడు నిన్ను అందుకుని అయోధ్యకు తీసుకుని వెళ్తాడు. పట్టాభిషిక్తుడవుతాడని అన్నాను. ఆ మాటలకి పొంగిపోయింది తల్లి. నన్ను దీవించి పంపింది." అన్నాడు హనుమ.

చేతులు జోడించి, నీ బంటుని అన్నట్టుగా నిల్చున్న హనుమను ఆప్యాయంగా చూశాడు రాముడు. అభిమానంగా చూశాడు. ఆరాధనగా చూశాడు.

**(సుందరకాండ సమాప్తం)**

**-అరణి**




**రాజేశ్వరమ్మ చేతులు జోడించి నమస్కరిస్తూ "మీ దంపతుల రుణం ఈ జన్మలో నేను తీర్చుకోలేనిది. ఆపదలో ఉన్న నా బిడ్డను కడుపులో పెట్టుకుని కాపాడటమే కాదు, దాన్నొక ప్రయోజకురాల్ని చేశారు. ఏమిస్తే ఇలాంటి రుణాలు తీరతాయి" అంది.**

"అంతంత మాటలు వద్దు. మానవత్వమున్న ప్రతి మనిషీ చేస్తాడీ పని. అమ్మాయిని మీరు సంస్కారవంతురాలిగా తీర్చిదిద్దారు. మాతో కలిసిపోయింది మీ బిడ్డ" అంది సుజాత.

"కష్టాలను ఎదిరించి నిలబడ్డారు. మీ ధైర్య, స్థైర్యాలకు జోహార్లు. జరిగిపోయిన వాటిని తలుచుకుని, బాధపడి ప్రయోజనం లేదు. వాటిని, చెత్తను ఊడ్చి బయట పారబోసినట్లు మనసులోంచి తీసివేయాలి. ఇంక మీకేమీ ఫరవాలేదు, అమ్మాయి రుక్మిణి చక్కగా ఉద్యోగం చేసుకుంటున్నది. అద్దెకు ఒక ఫ్లాట్ తీసి పెట్టుకుంది. మీ ఇద్దరూ కలిసి అక్కడ ఉండొచ్చు. మీకు తోడుగా మేముంటాం. ఇంక ఎలాంటి భయాలు, బెంగలు లేకుండా విశ్రాంతిగా మీరు కాలం గడపొచ్చు" అని ఎలీషా గారు ధైర్యం చెప్పారు.

"ప్రపంచం పాడైపోయింది. మానవత్వం, మంచితనం మాయమైపోయాయి. ఎవరినీ నమ్మడానికి వీల్లేదు అని రోజూ అనుకుంటుంటాం. కానీ మధ్యలో మీలాంటివారు ఎదురైనప్పుడు, 'లేదు మానవత్వం ఇంకా బతికే ఉంది, మంచితనం మనని స్పర్శిస్తూనే ఉంది' మనం నిరాశకు, నిస్పృహకు లోనుకాకూడదు అన్న ధైర్యం, విశ్వాసం కలుగుతాయి. బాబూ! మీలాంటి వారు ఇంకా ఇంకా రావాలని ప్రార్థిస్తున్నాను" అంది రాజేశ్వరమ్మ.

నాలుగైదు రోజులు గడిచిపోయాయి. కానీ శ్రావణ్‌కుమార్ తన ప్రతాపం చూపడానికి ఏ రకమైన పనులూ చేయలేదు. అయినా మరో పదిరోజులు వేచి చూసి అంతా బాగానే ఉంది గనుక ఇక ఆ ఇంటికి మారిపోదామని రుక్మిణీ, రాజేశ్వరమ్మ కూడా అనుకున్నారు. తల్లిని తీసుకొచ్చేశాక ఈ పది పదిహేను రోజులలో సుజాత, రుక్మిణి కలిసి ఆ ఇంటికి కావలసిన సామాన్లను కొన్నారు. ఇప్పుడు ధైర్యంగా ఆ ఇంటికి మారిపోయారు తల్లీకూతురూ. వెళ్లే ముందు రాజేశ్వరమ్మ ఒక మాట చెప్పింది.

"రుక్మిణి మీ బిడ్డే. మీకెప్పుడు అవసరమనిపిస్తే అప్పుడు మీ దగ్గరకు వచ్చేస్తుంది. మీరేం సందేహించకండి" అని. ఎలీషాగారు, సుజాత సంతోషించారు ఆ మాటలకు.

రుక్మిణి తన తల్లిని అనంతయ్యగారికి, సావిత్రమ్మకు పరిచయం చేసింది. అంతా పాత స్నేహితులలాగా, బంధువుల్లాగా కలిసిపోయారు. ఒకళ్లకొకళ్లు తోడుగా ఉన్నామని సంతోషించారు.

రుక్మిణి యూనివర్సిటీకి వెళ్లి వస్తోంది. లైబ్రరీకి బుక్స్ కోసమని స్టూడెంట్సే కాక అప్పుడప్పుడు ప్రొఫెసర్లు కూడా వస్తుంటారు. వాళ్లతో పాటు వాళ్లకు తెలిసిన ఫ్రెండ్స్ కూడా వస్తుంటారు. వాళ్ల మధ్య జరిగే డిస్కషన్స్ రుక్మిణి సైలెంట్‌గా వింటుండేది. కొంతమంది మామూలు మాటలు, కబుర్లు చెప్పుకునేవారు. అవి మాత్రం రుక్మిణి పట్టించుకునేది కాదు. కానీ ఏదైనా సబ్జెక్టు మీదనో, లేక తనకు తెలియని విషయాల మీదనో వాళ్లు మాట్లాడుకుంటుంటే మాత్రం తను శ్రద్ధగా వినేది. ఏదైనా డౌటు వస్తే వాళ్లను అడిగేది కూడా. వాళ్లు కూడా ఆ అమ్మాయికున్న ఉత్సుకతకు సంతోషపడేవారు.

ఒకసారిలాగే ఒక ప్రొఫెసర్, మరో వయసైన పెద్దమనిషి వచ్చారు. ఒక పుస్తకం కావాలని చాలా వెతికారు. రుక్మిణి కూడా వాళ్లతో పాటు తనూ వెతికింది. కానీ ఎక్కడా దొరకలేదు. దాంతో వాళ్లిద్దరూ అక్కడే కుర్చీలలో కూచుని మాట్లాడుకోవడం ప్రారంభించారు. ఆ పెద్దమనిషి తన అనుభవాలను ప్రొఫెసర్‌కి చెప్తున్నారు. తను ముందర చిన్మయానంద స్వామి ప్రసంగాలను విని ప్రభావితుడైనాడట. ఆయన ప్రసంగాలెక్కడ ఉన్నా వెళ్లి వినేవాడట. తరువాత దయానందస్వామి ఫాలోవర్ అయినాడట. దయానందస్వామి, చిన్మయానందస్వామి శిష్యుడే. అయితే ఈయన మాటతీరు సౌమ్యం, విషయాన్ని బోధించే పద్ధతి తనకు చాలా నచ్చాయట. ఇవన్నీ చెపుతూ చెపుతూ ఆ పెద్దమనిషి మరో సంగతి తనను చాలా ప్రభావితం చేసినది కూడా చెప్పాడు. ఏమిటంటే దయానంద స్వామీజీ గిరిజనుల పిల్లల కోసమనీ, పేదపిల్లల కోసమనీ కొన్ని స్కూల్స్, హాస్టల్స్ నిర్మించి నడుపుతున్నారట. అందులో చదువుకున్న పిల్లలను మంచి పౌరులుగా తీర్చిదిద్దేలా ఆ చదువు, క్రమశిక్షణ ఉంటాయట. ఆ పిల్లలను మనం కూడా పెంచుకోవచ్చు. ఎలానంటే ఒక పిల్లవాడికి ఏడాదికి ఇంత ఖర్చవుతుందని చెప్తారు. మనం ఏడాది పాటో, రెండేళ్ల పాటో ఆ పిల్లవాడి పెంపకానికయ్యే ఖర్చు చెల్లించి అందులో భాగస్వాములం కావచ్చు. అలా తను కూడా భాగస్వామినయ్యానని ఆ పెద్దమనిషి చెప్పుకు పోతున్నాడు. వాళ్ళ సంభాషణ ఆసక్తితో వింటున్న రుక్మిణి మధ్యలో అందుకుని. "సర్ వాళ్ల అడ్రస్ గానీ, ఫోన్ నెంబరు గానీ మీకు తెలుసా?" అని అడిగింది.

ఆ పెద్దమనిషి, "కంప్యూటర్‌లో 'ఎయిమ్ ఫర్ సేవా' అని కొడితే నీకు కావలసిన వివరాలన్నీ దొరుకుతాయి. ఇదే కాదు. ఇంకా మానసిక వికలాంగుల కోసం, వృద్ధుల కోసం ఆయన చాలా చేస్తున్నారు. కావాలంటే మనకు నెట్‌లో ఆ సమాచారమంతా దొరుకుతుందమ్మా" అన్నారు.

"థాంక్సండీ" అంది రుక్మిణి.

ఆమె మనసులో కొద్దికాలంగా కలుగుతున్న ఆలోచనను కార్యరూపంలోకి తెచ్చేందుకు ఒక మార్గం ఏర్పడినట్లు తోచి, మనసు తేలికపడింది.

ఎలీషాగారు క్యాంపస్‌లో ఇంటిని ఖాళీ చేసి సొంతింటికి మారిపోయారు. అంతకు రెండు, మూడు నెలల ముందే అందులో ఉన్న బ్యాంక్

### జరిగిన కథ

ప్రొఫెసర్ ఎలీషా, నర్సు సుజాత భార్యాభర్తలు. ఆయనలోని దాతృత్వగుణం, ఆమెలోని సేవాభావమే వారిద్దరినీ కలిపింది. మొదట ఆనంద్ వల్ల మోసపోయిన సుజాత హైదరాబాద్ చేరుకుని అక్కడే నర్సు ఉద్యోగంలో చేరుతుంది. పక్క ఇంట్లో ఎలీషాగారితో సుజాత పరిచయం వారి వివాహానికి దారి తీస్తుంది. అనాథగా మారిన రుక్మిణికి ఆశ్రయమిచ్చి డిగ్రీ చదివించి ఉద్యోగం ఇప్పిస్తారు. రుక్మిణిని, ఆమె తల్లిని ఒకచోటకు చేర్చి ఆమె ఆనందకర జీవితం గడిపేందుకు చేయూతనిస్తారు. ఆ తర్వాత.....



ఆఫీసర్ ట్రాన్స్‌ఫర్ అయి వెళ్లిపోయాడు. ఎలీషా గారు ఇంటిని మరెవరికీ ఇవ్వదలచుకోలేదు. చిన్నచిన్న రిపేర్లుంటే చేయించి ఇంటికి వెల్ల వేయించి ఆ ఇంట్లోకి మారిపోయారు.

మొక్కలన్నీ మంచిజాతి మొక్కలవడం చేత అప్పుడే పూత, కాపుకొచ్చాయి. తోటంతా పచ్చగా పక్షుల అరుపులతో ఎంతో ముచ్చటగా ఉంది. ఎలీషాగారు తోటంతా తిరిగి ప్రతి మొక్క దగ్గరా పలకరిస్తున్నట్లు నిలబడి, చేత్తో ముట్టుకుని ఆనందించేవారు. సుజాత కూడా తనకు వీలైనప్పుడల్లా ఆయన వెంట తిరుగుతుండేది. ఇక రుక్మిణి వచ్చినప్పుడల్లా తోటనంతా ఒకసారి చుట్టి చూసి ఏయే చెట్లకు పిందెలు పడ్డాయో ఏవి పండబారాయో చెప్తుండేది. దోర జామ పండును చిలకలు బతకనిచ్చేవి కాదు. అవి సగం కొరికిన పండే వీళ్లకు దొరికేది. అయినా ఎక్కడో ఆకుల సందున ఒకటో, రెండో పళ్లు దాచి పెట్టి తీసి ఇచ్చినట్లు దొరుకుతుండేవి. పువ్వుల మొక్కలైతే కళ్లకు పండుగలా విరగబూస్తున్నాయి. బంతి, చేమంతి, గరుడవర్ధన, నంది వర్ధన, కనకాంబరం, మల్లె - ఇలా ఏ మొక్క చూసినా నిండుగా పువ్వులే. రుక్మిణి దాదాపు రోజూ తోటంతా కలియతిరిగి వచ్చి బోలెడు కబుర్లు చెప్పేది. సుజాత వాళ్లకి ఎదురువైపు ఇళ్లల్లోనే రుక్మిణి వాళ్లుండేది. అందుకే తను తరచు వచ్చి వెళ్లేది. అనంతయ్యగారు, సావిత్రమ్మగారు కూడా సాయంత్రాలు కాస్త వాకింగ్‌గా వచ్చి తోటలో కాసేపు తిరిగి వెళుతుండేవారు.

ఆ రోజు సుజాతకి సెలవు. ఆదివారం అవడం చేత ఎలీషాగారికి, రుక్మిణికి కూడా సెలవే. అందరం ఒకేచోట కలిసి భోజనం చేద్దామని సుజాత అనంతయ్యగారిని, సావిత్రమ్మను, రాజేశ్వరమ్మను, రుక్మిణిని కూడా ఇక్కడికే రమ్మని పిలిచింది. సుజాతకు వంటలో సాయపడాలంటూ ముందుగా రుక్మిణి బయలుదేరింది. నీతో నేనూ వస్తానని రాజేశ్వరమ్మ కూడా వచ్చింది. వంటిల్లంతా ఒకటే సందడి. రాజేశ్వరమ్మ రకరకాల వంటలు చేయడంలో దిట్ట. భోజనాల సమయానికి అనంతయ్యగారు, సావిత్రమ్మగారు కూడా వచ్చేశారు. వాళ్లిద్దరూ కూడా రుక్మిణిని తమ సొంత మనవరాలిగానే చూస్తారు.

ఆరోజు భోజనాలు కాస్త లేటైనా వండిన పదార్థాలన్నీ మంచి రుచిగా ఉండటంతో అంతా ఒక ముద్ద ఎక్కువే తిన్నారు. భోజనాలయినాక అంతా కబుర్లకు హాల్లో చేరారు. కబుర్ల మధ్యలో సావిత్రమ్మగారు నవ్వుతూ “మన రుక్మిణికి మంచి సంబంధం చూసి పెళ్లి చెయ్యాలే సుజాతా. లోగడ అడిగితే తను చదువు పూర్తిచేసి ఉద్యోగంలో చేరాలన్నావు. అదీ అయ్యిందిగా. ఇంకా ఎందుకాలస్యం?” అన్నది.

“అమ్మా! రుక్మిణి చిన్నపిల్లేం కాదు. బాగా చదువుకున్నది. మానసిక పరిపక్వత ఉన్న పిల్ల. తనకు తగిన వాణ్ణి, నచ్చిన వాణ్ణి తను ఎన్నుకోగలదని నా విశ్వాసం” ఈ మాట అంటూ తను సరిగానే చెప్తున్నానా అన్నట్లు ఎలీషా గారి వంక చూసింది. ఆయన ‘కరెక్ట్’ అన్నట్లు బుర్ర ఊపారు. ఈ మాటలు విన్న రుక్మిణి నవ్వుతూ.

“నా పెళ్లికేం తొందర, ఇంకా నేను పూర్తి చెయ్యాల్సిన పనులు రెండు, మూడున్నాయి. ముఖ్యంగా రెండు. ఆ రెండు పనులు పూర్తయితేనే పెళ్లి సంగతి ఆలోచిస్తా” అంది.

ఎలీషాగారు నవ్వుతూ, “ఏమిటమ్మా ఆ రెండు పనులూ? మేం కూడా సహాయం చేస్తాం, త్వరగా పనులు పూర్తయ్యేందుకు” అన్నారు.

“మీ సహాయం, మీ ఎడ్వైజ్ తప్పక కావాలి. మొదటి పని ఏమిటంటే ‘శివ’ ద్వారా వచ్చిన ఆస్తిని నాకోసం ఉపయోగించుకోవడం నాకిష్టం లేదు. దాన్ని అలా బ్యాంక్‌లో వేసి ఒక మంచి కార్యానికి ఉపయోగించాలని నా కోరిక. ‘ఎయిమ్ ఫర్ సేవా’ అనే కార్యక్రమం ద్వారా గిరిజన, పేద, అనాథ పిల్లల కోసం, వాళ్లను సుశిక్షితులుగా తీర్చిదిద్దడానికనీ కొన్ని స్కూల్స్, హాస్టల్స్

నిర్మించి వాళ్లను చదివిస్తున్నారు. దాదాపు అన్ని రాష్ట్రాలలోనూ ఈ హోమ్స్ నిర్మించారు. ఇదేకాక మానసిక వికలాంగుల కోసమనీ, వృద్ధుల కోస మనీ వీరు ఆశ్రమాలు, హోమ్స్ నడుపుతున్నారు. ఇవన్నీ కూడా ఉచితంగా నడుపబడుతున్నాయి. అయితే దాతలనుండి విరాళాలు స్వీకరిస్తారు. దీన్ని దయానందస్వామి అనే స్వామీజీ స్థాపిం చారు.

"ఈ పాటికి మీకర్థమయ్యే ఉంటుంది. నాకు వచ్చిన ఆస్తి మొత్తం శివ పేరు మీద వీళ్లకు డొనేట్ చెయ్యదలుచుకున్నాను" అంటూ నవ్వుతూ ముగించింది రుక్మిణి.

అందరూ అవాక్కై అలా చూస్తుండిపోయారు. అప్పుడు రుక్మిణి ఎలీషాగారి వైపు చూసి, "చెప్పండి, నా ఆలోచన ఎలా ఉంది?" అంది.

ఎలీషాగారు కొంచెం తేరుకుని, "చూడమ్మా రుక్మిణీ! నువ్వు మా అందరి కంటే ఎంతో చిన్న దానివి. కానీ మా అందరికంటే ఎంతో ఉన్న తంగా ఆలోచించావు. ఇలాంటి నిర్ణయం తీసు కోవడానికి గొప్ప పట్టుదల, ఆత్మవిశ్వాసం ఉండాలి. నిన్ను చూసి నేను గర్వపడుతున్నాను తల్లీ" అన్నారు ఎమోషనల్‌గా.

సుజాత, రుక్మిణి వంక ఆశ్చర్యంగా చూస్తూ "ఎవరో మెచ్యూర్డ్ పర్సన్ మాట్లాడినట్లుంది గానీ మనమ్మాయి, మన రుక్మిణి మాట్లాడింది అంటే నమ్మలేకుండా ఉన్నాను" అంది.

"మరి నేనెవరి దగ్గర పెరుగుతున్నాను. ఇద్దరు నోబుల్ పర్సన్స్ దగ్గర. ఇలా ఉండకపోతే మరెలా ఉంటాను?" అంటూ కిలకిలా నవ్వింది.

అనంతయ్యగారు అందుకుంటూ, "అవును తల్లీ. నువ్వు నోబుల్ పర్సన్స్ దగ్గరే పెరుగుతు న్నావు. అది నీ అదృష్టం. దీపం తన కాంతిని చుట్టుపక్కలకు ప్రసరించి, ఆ ప్రదేశమంతా ఎలా ప్రకాశవంతం చేస్తుందో, అలాగే వీరు కూడా తమ వ్యక్తిత్వంతో ఎదుటివారిని ప్రభావితం చేసి వారిలో కూడా మానవత్వం, మంచితనం పాదు కొలుపుతారు. నువ్వు అలా ప్రభావితమైన దానివే" అన్నారు.

వెంటనే ఎలీషాగారు, "వద్దు వద్దు, అంత పెద్ద మాటలు. మేం కూడా మీలాంటి మామూలు మనుషులమే" అంటూ మాట మార్చి, నవ్వుతూ రుక్మిణిని చూసి, "సరే ముఖ్యమైన మొదటి పనేదో చెప్పావు బావుంది. ఆ పని నువ్వు నిర్విఘ్నంగా చేసేందుకు నీకు కావలసిన సాయం నేను చేస్తా. మరిప్పుడు ముఖ్యమైన నీ రెండో పనేమిటో కూడా చెప్పు" అన్నారు.

రుక్మిణి ఈ రెండో పని చెప్పడానికి కాస్త తటపటాయించింది.

సుజాత కల్పించుకుని "ఎందుకమ్మా రుక్మిణీ సందేహం? చెప్పు త్వరగా" అంది.

అందరివంకా ఒకసారి చూసి "నాకు ఒక పాపను పెంచుకోవాలని ఉంది" అంది.

సావిత్రమ్మగారు పెద్దగా నవ్వుతూ, "చూశావా సుజాతా! నేనిందాక చెప్పలేదూ, రుక్మిణికి ఇంక పెళ్లి చేసెయ్యమని! ఇప్పుడు తనూ అదే అంటోంది మరో రకంగా. పెళ్లి చేస్తేనే కదా పాపలొచ్చేది" అంది.

రుక్మిణి, "అబ్బే నేను అలా అనడం లేదు అమ్మమ్మగారూ! మొన్నామధ్య సిటీలో ఉన్న మహిళా శిశుసంక్షేమ శాఖకు వెళ్లి కనుక్కుని వచ్చాను. అక్కడ అబాన్‌డెన్డ్ చిల్డ్రన్ ఉంటారు. రోజుల, నెలల పిల్లల దగ్గర నుండి ఏడాది, రెండేళ్లు ఉన్న పిల్లలు కూడా ఉన్నారు. మనం పెంచుకుంటా మంటే ఇస్తారు కొన్ని షరతులతో. అయితే కొంత కాలం మనం ఎదురుచూడాలి" అంది.

"నువ్వు పెళ్లి చేసుకోదలచలేదా?" అంది సుజాత.

> **రుక్మిణి ఇప్పుడు మానసికంగా ఎదిగిన మనిషిగా రూపుదాల్చింది. యూనివర్సిటీ లైబ్రేరియన్‌గా ఎన్నో ఉన్నతమైన మానవతా విలువలను ఒంటబట్టించుకుంది. కోర్టు ద్వారా సంక్రమించిన తన భర్త ఆస్తిని ప్రజా ప్రయోజనాలకోసం ఉపయోగించాలని ఆలోచించింది. ఆ ప్రతిపాదన చెప్పినప్పుడు సుజాతా, ఎలీషా ఎలా రియాక్టయ్యారు? రుక్మిణి మళ్ళీ పెళ్ళి చేసుకుందా, లేదా?**

"ఎందుకు చేసుకోను. మంచి కుర్రాడు దొరికి నప్పుడు తప్పక చేసుకుంటాను. అయితే ఇప్పటి నుండి అదే పనిగట్టుకుని వెతకను".

ఎలీషాగారు రాజేశ్వరమ్మగారి వైపు చూశారు. ఆవిడ అన్నీ వింటోంది, ఏం మాట్లాడకుండా.

"మీరేమనుకుంటున్నారమ్మా, మీ అమ్మాయి కోరిక విని" అని ఆవిడని అడిగారు.

"ఈ పిల్ల నేను కనిపెంచిన పిల్లేనా అని సందేహపడుతున్నా. మీ సావాసంతో దానిలో ఎంత సంస్కారం వచ్చిందోచూసి సంతోషపడు తున్నాను. పెంచుకోనివ్వండి పాపని. ఆ పాపను చూసుకునేందుకు మనమంతా లేమా. పెళ్లి కూడా తను అనుకున్న విధంగానే చేసుకోనిద్దాం" అంది.

"అయితే ఈ ప్రపోజల్‌ని అందరూ ఒప్పుకు న్నట్లేనా?" అంటూ రుక్మిణి ఒక్కొక్కరిగా అందరి వైపూ చూసింది. అందరూ నవ్వుతూ తలలూ పారు. అంతే సంతోషంతో సంబరపడిపోయింది. ఇంతలో సావిత్రమ్మగారికొక సందేహం వచ్చింది.

"నువ్వెవరి బిడ్డనో తెచ్చి పెంచుకుంటుంటే నిన్ను చేసుకునే వాడిష్టపడతాడటే రుక్మిణీ!" అని అడిగింది.

"ఇష్టపడేవాడినే చేసుకుంటానమ్మమ్మగారూ.



# కాజల్ వన్నీ కహానీలే!

'సర్దార్ గబ్బర్ సింగ్' సినిమాలో తన పాత్రకి తానే డబ్బింగ్ చెప్పుకున్నానని మొన్నటి దాకా కాజల్ మహా గొప్పలు చెప్పింది. అయితే ఆడియో ఫంక్షన్లో అసలు నిజం తెలిసిపోయింది. కాజల్‌వన్నీ కహా నీలే అన్న విషయం స్పష్టమైంది అంటు న్నారు సినీ జనాలు. ఆ ఫంక్షన్లో రెండు మూడు మాటలు కూడా తెలుగులో పలక లేకపోయిన కాజల్ మొత్తం పాత్రకి తనే డబ్బింగ్ చెప్పుకున్నానంటే ఎలా నమ్మాలి? అని వారు ప్రశ్నిస్తున్నారు. తమన్నా, సమంత, రకుల్‌లు డబ్బింగ్ చెబుతున్నారు కాబట్టి తను కూడా చెప్పానని ఓ మాట అంటే పడి ఉంటుంది కదా అనుకుని కాజల్ అబద్ధాలు చెప్పి ఉండవచ్చు కానీ, తెలుగులో డబ్బింగ్ చెప్పేంత సీన్ ఆమెకు లేదని సినీ జనాలు అంటున్నారు. ముందూ వెనుకా చూసుకోకుండా ఆడిన అబద్ధానికి కాజల్ అడ్డంగా బుక్ అయిందని మరికొం దరు ఆమె మీద జాలి చూపిస్తున్నారు.

పాపని ఇష్టపడని వాడి మొహమైనా చూడను" అంది రుక్మిణి. అందరూ నవ్వారు.

"మీరే చూద్దురుగాని పాపని ఎంత బాగా పెంచుతానో. అమ్మమ్మ, తాతయ్యగార్ల వద్ద పాప ఏ ఆర్భాటాలూ లేకుండా సింపుల్‌గా ఉంటూనే సంతోషంగా ఎలా బతకాలో నేర్చుకుంటుంది. మరి దాని అమ్మమ్మ దగ్గర ఎన్ని కష్టాలు వచ్చినా వాటిని ధైర్యంగా ఎలా ఎదిరించి నిల వాలో నేర్చుకుంటుంది. ఇక నా ఆరాధ్యదైవాలైన సుజాతగారు, ఎలీషాగారి దగ్గర మనుషులను ఎలా ప్రేమించాలి, ఎలా వారికి అండగా నిల వాలో నేర్చుకుంటుంది. ఇంకా మానవత్వమంటే, మంచితనమంటే - ఇలా ఎన్నో ఎన్నో నేర్చు కుంటుంది. దానికి నేను ఆస్తిపాస్తులు సంపా దించి పెట్టను. కానీ అది చదువుకుని దాని కాళ్ల మీద అది నిలబడగలిగే శక్తిని కలగజేస్తాను" అంటూ ఏదోఏదో తన్మయత్వంతో చెప్పుకు పోయింది రుక్మిణి.

"ఏమిటీ అంత తన్మయత్వంతో చెబుతు న్నావు? పాపను గానీ చూసి అప్పుడే ఎంపిక చేసుకుని వచ్చేశావా?" అడిగింది సుజాత.

"పాపను ఎంపిక చేయవలసిన బాధ్యత మీదే. నేను ఊరికే చూసి వచ్చాను. అయితే అన్నిటికంటే ముందు ఈ ఆస్తిని డొనేట్ చేసే పని పూర్తి చేశాకే రెండో పని గురించి ఆలో చిద్దాం" అంది.

రుక్మిణి చెప్పిన తరువాత ఎలీషాగారు కంప్యూటర్‌లో ఆ వివరాలన్నీ తెలుసుకుని తృప్తి చెందారు. ఆ సంస్థ వారితో, లాయర్‌తో సంప్ర దించి, ఈ డబ్బు ఎలా ఎక్కడకు పంపాలో తెలుసు కుని రుక్మిణికి కూడా ఆ విషయాలన్నీ వివరంగా చెప్పారు. రుక్మిణి చెప్పిన ముఖ్యమైన పనుల్లో మొదటిది పూర్తి చేశారు.

ఇక రెండో పని పాపను తెచ్చుకోవడం. ఒక వారం తరువాత సుజాత, రుక్మిణి మహిళా శిశు సంక్షేమ శాఖకు వెళ్లి పాపను తెచ్చుకునేందుకు వాళ్లతో మాట్లాడి ఏదో ఫారమ్ నింపి ఇచ్చారు. అందులో పని చేస్తున్న ఒక మహిళా అధికారిని సుజాత ఎరుగును. ఆవిడ హాస్పిటల్‌కి వచ్చిన ప్పుడు సుజాతే ఆమెకి సేవలందించింది. ఆ అధి కారిణి సలహా సహకారాలతో అక్కడున్న పిల్లల్లో ఒక పాపను ఎంచుకుంది రుక్మిణి. ఆ పాపకి ఏడాది. వాళ్లు కావలసిన రాత కోతలన్నీ పూర్తి చేశారు. వారం, పది రోజుల్లో పాపను వీళ్లకు అప్పగించారు.

పాపను ఇంటికి తీసుకొచ్చారు. రాజేశ్వరమ్మ గారికి ఈ మధ్య వరకూ కొడుకు పిల్లలను పెంచిన అనుభవముంది.

సుజాత సెలవు రోజైతే పాప ఎలీషాగారిం ట్లోనే ఉంటుంది. ఎలీషాగారికి పాప రాక ఎంతో సంతోషాన్నిచ్చింది. ఇటు నుంచి వచ్చి ఒకసారి అటు నుంచి వచ్చి ఒకసారి పాపను పలకరించి పోతుంటారు. పాపకి ఏం పేరు పెట్టాలా అని తర్జనభర్జనలు జరిపి చివరికి 'నివేదిత' అనే పేరు ఖరారు చేశారు. ఏడాది మీద నాలుగు నెలలు వచ్చేసరికి బుడిబుడి నడకలు ప్రారంభిం చింది పాప. దానికిప్పుడు ఎలీషా తాతతో కలిసి తోటలో తిరగడం ఇష్టం. ఎలీషాగారు పాపను ఎత్తుకుని ప్రతి చెట్టు దగ్గరకు వెళ్లి ఆ చెట్టు పేరు చెప్పేవారు. ప్రతి పువ్వునూ చూపించి పువ్వు పేరు చెప్పేవారు. ప్రతి పక్షినీ చూపించి పక్షి పేరు చెప్పేవారు. ఇప్పుడు నివేదితను మనం పాపా మామిడి చెట్టేది అనంగానే మామిడి చెట్టు చూపిస్తుంది. అలాగే ఏ పువ్వు పేరడిగితే ఆ పువ్వు చూపిస్తుంది. కాకి, పిచ్చుక, చిలక వేటి పేరడిగినా చుట్టూ చూసి ఆ పక్షి కనిపిస్తే చూపి స్తుంది. లేకపోతే అది ఎగిరి పోయిందని అభిన యించి చూపిస్తుంది. తొందరలోనే మాటలు కూడా వచ్చేశాయి. ఆ చిలక పలుకులు వినేం దుకు అందరూ దాని చుట్టూ చేరేవారు. ఈ చిన్నపాప ఆ మూడు ఇళ్లల్లో ఆనందాన్ని, చైత న్యాన్ని నింపింది.

పది రోజుల్లో ఎలీషాగారు రిటైరవుతారనగా ఆయన శిష్యులు ఆ రోజుకి తాము వచ్చి ఆయ నను కలుస్తామని ఈ-మెయిల్ పంపారు. సుజాత, రుక్మిణి - ఇద్దరూ సెలవు పెట్టి ఆ రోజు ఎలీషా గారితోనే ఉండాలనుకున్నారు.




## మహాబలిపురం

*ఇక్కడ ఈ సంద్రం ఒడ్డున*
*ఒకనాడు ఏడు గుడులుండేవట*
*నీళ్ళల్లో ఆరు మునిగిపోగా*
*ఇప్పుడొంటిగా మిగిలిన ఈ నిస్సవ్వడి గుడి!*
*మొదటిదా ఏడవదా-*
*సూర్యచ్ఛాయలో హిరణ్యవర్ణకాంతిలో*
*మెరుస్తున్న ఈ ఏకశిలాదేహి మీద*
*ఇప్పటికి ఎన్ని శతాబ్దాలు*
*వాలి వెళ్ళిపోయాయో!*
*ఇది మాత్రం ఇక్కడే తపోమూర్తిలా*
*ప్రాచీన స్మృతుల్లో, దస్సిన చూపుతో!*

●●●

*ఈ పంచరథాలు పాండవనామాల్తో*
*భారతాన్ని తలపుకు తెస్తున్నాయి*
*ఇక్కడి గజమూ నందీ సింగమూ*
*దృఢంగా కాలాల్ని ఢీకొట్టిన ధైర్యదేహాల్తో!*
*ఆ పక్కనే పచ్చని చెట్టులా నిల్చున్న*
*శిల్పాన్ని ఎవరంత సజీవంగా మలిచారని*
*చూడబోతే*




*శిల్పం కాదది, నిజంగా తరువే!*
*నాకన్నే భ్రమించింది, శిల్పధ్యాసలో లీనమై!*

●●●

*ఏ ఆచ్ఛాదనా లేక భారీగా పరుచుకున్న*
*ఈ శిలాతలమ్మీద ఇమిడింది గంగావతరణమా*
*లేక పార్థుడి తపోభంగిమా కాక రెండూనా*
*ఇంకా అనేక ప్రాణుల కోలాహలంతో*
*కళా నైపుణ్యకాంతితో కనువిందు చేస్తున్న*
*ఈ దీర్ఘబహుళ దృశ్య శిల్ప మాలిక ముందు*
*నిల్చుని తన్మయ స్నానం చేస్తున్నా-*

●●●

*ఒక దరిదాపు గుండ్రని శిల ఇది!*
*గోపాలుని వెన్నముద్దని దీన్నంటారట*
*కానీ ఏదీ మెత్తదనపు ఆనవాలు?*
*కానీ వెన్నలాగా బహులావణ్యంగా*
*కొన్ని టన్నుల దృఢత్వంతో ఇది!*
*ఏటవాలు తలమ్మీద వందలేళ్ళుగా*
*ఎలా ఇది ఇలాగే నిల్చున్నది దొర్లకుండా?*
*ఆశ్చర్యమైదానంలో నా మనసు దొర్లుతుంటే*
*దీని నీడలో కూర్చున్నానిప్పుడు-*
*నాకిక కొండంత అండ అని నా గుండె*
*అనుకుంటున్నది!*

●●●

*రాళ్ళను తొలిచి ఈ గుహలుగా మలచి*
*బొమ్మల్ని చెక్కి వెళ్ళిన వాళ్ళు*
*నాడు ఏ జీవనపల్లవుల్ని పాడుకున్నారో కదా*
*ఉలి సంగీతాన్ని వెంటేసుకుని!*
*ఇప్పుడు మాత్రం ఇక్కడంతా నిశ్శబ్దలయ!*
*నాలోకి వ్యాపిస్తూ కూడా!*

●●●

*కళలున్నవి*
*కాలాన్ని పదిలపరచడానికే కదా!*
*ఇవాళ ఈ శిల్పాల నడుమ యాత్రిస్తుంటే*
*గత కాలాల గాలుల్ని స్పృశిస్తున్నట్లుగా ఉంది*
*ఆ ఉలుల్నీ ఆ చేతుల్నీ తలుచుకుంటూ*
*ఉల్లంతో ప్రణమిల్లడం తప్ప ఏమివ్వగలను*
*ఈ కళాతీరానికి!*

**-దర్భశయనం శ్రీనివాసాచార్య**
**సెల్: 94404 19039**

యూనివర్సిటీలో ఎలీషాగారికి ఘనంగా వీడ్కోలు పలికారు. కొంతమంది ప్రొఫెసర్లు, వైస్ చాన్స్‌లర్ అంతా ఆయన్ను గురించి గొప్పగా మాట్లాడారు. అమెరికాలోని యూనివర్సిటీలో పని చేస్తున్న ఆయన శిష్యుడు కూడా వచ్చి మాట్లాడాడు. అతను ఎలీషాగారి గురించి చెప్తున్న ప్రతి మాటకు హాలంతా చప్పట్లతో ప్రతిధ్వనించింది.

ఆ మర్నాడు శిష్యులంతా సాయంత్రం నాలుగు గంటలకు పైనున్న హాల్లో ఒక మీటింగ్‌లా ఏర్పాటుచేశారు. బయట ఏదైనా హాలులో ఏర్పాటు చేద్దామని చూశారు గానీ అలాంటి ఆర్భాటాలు తనకు నచ్చవని ఎలీషాగారు గట్టిగా చెప్పారు. అరవై డెబ్భైమంది శిష్యులు ఆయన సహాయంతో పై చదువులు చదివిన వారు వచ్చారు. ఇల్లంతా, హాలంతా మహాసందడిగా ఉంది. ఆ రాత్రికి భోజనం ఏర్పాట్లు కూడా ఇంట్లోనే చేశారు. రాజేశ్వరమ్మగారు ఆ పని తన మీద వదలమని, పార్వతిని తోడు ఇస్తే చాలనీ ఏ లోటూ లేకుండా తాను నిర్వహించగలననీ భరోసా ఇచ్చారు. ఇంటి ముందు చిన్న షామియానా వేసి, బల్లలు తెప్పించారు. ఈ పనులన్నీ ఊళ్లో ఉన్న శిష్యులు చూసుకున్నారు.

నాలుగు గంటలకు మీటింగ్ ప్రారంభమయింది. మొదట ఎలీషాగారే లేచి ఒక మాట చెప్పారు. "మీరంతా ఎంతో శ్రమకోర్చి నన్ను చూడాలని రావడం నాకు చాలా సంతోషంగా ఉంది. మీరంతా నా బిడ్డల్లాంటి వారు. మిమ్మల్ని నేను కోరేది ఒక్కటే. ఈ సందర్భంగా నాకేవో కానుకలు ఇవ్వాలని మాత్రం ప్రయత్నించకండి. ఆ పని నాకు సంతోషాన్ని కలిగించదు సరికదా బాధ పెడుతుంది" అని చెప్పి ముగించి కూర్చున్నారు.

ఆర్గనైజర్‌గా ఉన్న ఒక కుర్రవాడు లేచి ఒక ప్రపోజల్ పెట్టాడు.

"మేమంతా కలిసి మీ పేరు మీద ఒక ట్రస్ట్‌ను ఏర్పాటు చెయ్యాలనుకుంటున్నాం. ఏ పిల్లవాడికి అవసరం వచ్చినా - శరణాలయం స్టూడెంట్ గాని, బయట నుండైనా సరే పేదరికం వల్ల పై చదువులు చదువుకోలేకపోతే, ఆ స్టూడెంట్‌ని ట్రస్టు అతను కోరుకున్న చదువు చదివిస్తుంది. అయితే అతను ఉద్యోగంలో చేరాక ఆ డబ్బు తిరిగి ట్రస్ట్‌కి చెల్లించాలి. ఎలాంటి ఇంట్రెస్టు లేకుండా డబ్బు ఇవ్వబడుతుంది" అంటూ చెప్పుకుపోయాడు. మిగిలిన వారంతా ఆమోదముద్ర తెలుపుతూ చప్పట్లు కొట్టారు.

మరి ట్రస్ట్ నిర్వహణ బాధ్యతలు ఎవరు చేపడతారు? ఇందులో నలుగురో, ఐదుగురో మెంబర్స్ ఉండాలి. ఎవరు ఉంటారు? ఈ విషయం మీద వాళ్లల్లో వాళ్లు కొంత డిస్కస్ చేశారు. కానీ ఇంకా ఒక నిర్ణయానికి రాలేకపోతున్నారు.

అప్పుడు ఎలీషాగారు కల్పించుకుని మాట్లాడటం మొదలు పెట్టారు. "అసలు ట్రస్ట్ అన్నదే నాకు నచ్చదు. ట్రస్ట్ నుండి డబ్బు తీసుకున్న విద్యార్థి అది అప్పుగా భావించి, తిరిగి తను ఉద్యోగం చేస్తున్నప్పుడు తీర్చేయాలి అనడం కూడా నాకు సమంజసంగా లేదు. మనం ప్రారంభించి నడుపుతున్నది ఒక చెయిన్‌లాంటి సహాయ కార్యక్రమం. మీరంతా చదువుకుని పైకొచ్చారు. ఉద్యోగాల్లో స్థిరపడ్డారు. పెళ్ళిళ్ళు చేసుకున్నారు. పిల్లలు కలిగిన వారు కూడా ఉన్నారు. ఇన్ని బాధ్యతలుండి కూడా మీరంతా మీలో ఒకరితో మరొకరికున్న స్నేహబాంధవ్యాన్ని మరిచిపోలేదు. అది ఎలా ఏర్పడిందో మీరు ఆలోచించండి. ట్రస్ట్ నుండి డబ్బు తీసుకుని చదువుకుంటే మీలో ఆ బాంధవ్యం ఏర్పడేదా? అసలు మీకు అవసరమైన సమయంలో సాయపడింది ఎవరో కూడా తెలియదు. అలాంటప్పుడు మరొకరికి మనం కూడా సహాయం చేద్దామనే భావనకు చోటే ఉండదు. అందుకే నేను ట్రస్ట్ వద్దంటున్నాను. మానవ సంబంధాలు, ప్రేమలు, ఆత్మీయత ఇవి బలపడాలంటే ఒకరితో ఒకరికి ప్రత్యక్ష సంబంధముండి తీరాలి.

"మనం సహాయం అందించే విద్యార్థి అభివృద్ధిని కళ్లారా చూడటం, ఆ సహాయం చేసే వారికి ఎంత సంతోషాన్నీ, తృప్తినీ, ఆత్మవిశ్వాసాన్నీ కలిగిస్తుందంటే మనం ఇంకా మరి కొంత మందికి కూడా ఇలా సహాయాన్నందించి వాళ్ల అభివృద్ధికి తోడ్పడదాం అని. అంతేకాదు, వీళ్లంతా నా వాళ్లు, నా సోదరులు అనే బాంధవ్యమేర్పడుతుంది. సహాయం పొందేవారికి కూడా తమకు సాయపడే వారి పట్ల గౌరవం, ప్రేమ ఏర్పడతాయి. తమను ఇంతవారిని చేసినవారి పట్ల కృతజ్ఞతాభావం కలుగుతుంది. నేను చెప్పేది ఒకటే. మీరు ట్రస్ట్ గురించి మర్చిపోండి. ఇకముందు కూడా మీకు చేతనైన సహాయాన్ని ఈ పద్ధతిలోనే చేయడానికి ప్రయత్నించండి" అని ముగించారు.

హాలంతా చప్పట్లతో మార్మోగింది. ఎలీషాగారు చెప్పిన మాటల్లోని భావాన్ని, అర్థాన్ని అందరూ తెలుసుకున్నారనడానికి ఆ చప్పట్లే తార్కాణం.

అంతా భోజనాలు ముగించారు. ఇక సెలవు తీసుకుని వెళ్లిపోవలసిన సమయం వచ్చింది. అందరి మనసులూ బరువెక్కాయి. ఎలీషాగారి వద్దకు ఒక్కొక్కరే వెళ్లి సెలవు తీసుకుంటున్నారు. ఒకర్నొకరు అభినందించుకున్నారు. ఆలింగనం చేసి వీడ్కోలు చెప్పుకున్నారు. కళ్లల్లో నీళ్లు తొణికిసలాడాయి. అప్పటికి అనుభవమయింది వారికి ఎలీషాగారు చెప్పిన మాటలలోని సారాంశం. నిజమే, సహాయ కార్యక్రమం ఇలా సాగడంలోనే అర్థముంది అనిపించింది.

వాళ్లంతా ఒకొక్కరూ సెలవు తీసుకుని వెళ్లిపోతుంటే ఎలీషాగారు నిలబడి చూస్తున్నారు. 'అవును. వీళ్లంతా నా వాళ్లు, నా పిల్లలు' అనుకునేసరికి ఆయన ఒళ్లు పులకరించింది. ఆనందంతో కంఠం రుద్ధమైంది. తన ఆలోచనలు, భావాలు, కోరికలు - అన్నీ ప్రాణం పోసుకుని నడుస్తున్నట్లనిపించింది. కళ్లు చెమర్చాయి.

ఆ రోజు రాత్రి సుజాత ఎలీషాగారి పక్కన కూచుని ఆయన భుజం మీద తలవాల్చి....

"ఈ రోజు నాకు ఎంత ఆనందంగా ఉందో చెప్పలేను. ఆ పిల్లలంతా మీ చుట్టూ చేరి మాట్లాడుతుంటే వాళ్ల మాటల్లో కంటే వాళ్ల కళ్లల్లో మీ మీద ఉన్న ప్రేమ, ఇష్టం కనబడింది. ప్రతి పిల్లవాడు ప్రొఫెసర్‌గారు నావాడు అన్నట్లే ఉన్నారు. అప్పుడనుకున్నాను. అలా వాళ్లు ఫీలవడానికి మీ నుంచి ఎంత ప్రేమాభిమానాలు వాళ్లు పొందారో కదా అని" అంది.

ఎలీషాగారు సుజాత భుజం చుట్టూ చెయ్యి వేసి దగ్గరగా లాక్కుని, "సుజాత! ఇంతమందికి ప్రేమను పంచానంటున్నావు. కానీ, నువ్వు నన్ను ప్రేమిస్తున్న సంగతి నేనెందుకు కనుక్కోలేకపోయానో తెలీదు. ఇప్పుడనుకుంటున్నాను, సుజాత సాహసించి ఆ ప్రేమ సంగతి బయట పెట్టకపోతే నేను జీవితంలో ఎంతో పోగొట్టుకుని ఉండే వాణ్ణి. పేలవంగా ఉండే నా జీవితం నీ రాకతో రసభరితమయింది. ఈ జీవితాన్నిలాగే ఆస్వాదిస్తూ అర్థవంతం చేసుకుందాం" అన్నారు.

(అయిపోయింది)

సింహప్రసాద్

## నిండు నూరేళ్ళు

వచ్చే వారమే ప్రారంభం



## ఆయన చేతల మనిషి

ప్రకాష్‌రాజ్ గురించి తెలిసిన వారెవరైనా ఇదే మాట అంటారు. ప్రకాష్‌రాజ్ మహబూబ్ నగర్ జిల్లా కొండారెడ్డిపల్లి గ్రామాన్ని దత్తత తీసుకున్న విషయం తెలిసిందే! కేవలం దత్తత తీసుకోవడంతోనే ఆగిపోకుండా ఆ గ్రామంలో అభివృద్ధి కార్యక్రమాలు చురుకుగా చేయిస్తున్నారు. తన గ్రామంతోనే ఆగిపోకుండా పక్కనున్న కమ్మదనం గ్రామం వైపు కూడా ఓసారి దృష్టి సారించారు. అక్కడ మహిళలు నీటి కోసం పడుతున్న కష్టాలు ప్రకాష్‌రాజ్‌ను కదిలించి వేశాయి. దాంతో ఆ గ్రామంలో యుద్ధప్రాతిపదికన ఓ బోరు తవ్వించి గ్రామంలో నీటి కొరత తను కొంత వరకూ తీర్చారు. తమ గ్రామాన్ని దత్తత తీసుకోకపోయినా పెద్దమనసుతో తమ గ్రామంలో నీటి కొరత తీర్చినందుకు ఆ గ్రామస్థులు ప్రకాష్‌రాజ్‌కు ధన్యవాదాలు చెప్పుకుంటున్నారు. తమ గ్రామంలో నీటికొరతను అరికడతామని గతంలో చాలా మంది చెప్పారనీ, కానీ ఇంత త్వరగా స్పందించింది మాత్రం ప్రకాష్ రాజ్ ఒక్కరే అనీ, ఆయన మాటల మనిషి కాదు చేతల మనిషి అంటూ ఆకాశానికి ఎత్తేస్తున్నారు.






## ఆ ఎయిర్ బస్ విలువ 260 కోట్లు!

సినీ ప్రపంచంలో బిగ్ బి.... ఈ పేరు సుపరిచితమే! కానీ ఆయన తిరిగే ఎయిర్ బస్ గురించీ కానీ, దాని ఖరీదు గురించి కానీ పెద్దగా ఎవరికీ తెలియకపోవచ్చు. ఆయన ఎయిర్ బస్ ఖరీదు అక్షరాలా 260 కోట్ల రూపాయలు అంటున్నారు. తను సొంతంగా ఎక్కడికి వెళ్ళాలన్నా ఈ ఎయిర్ బస్‌లోనే ప్రయాణిస్తుంటారు. అంత ఖర్చుతో ఎయిర్ బస్ ఏర్పాటు చేసుకోవడం ఏమిటి? అన్న అనుమానం సహజంగానే చాలా మందికి వచ్చింది. ఎందుకు ఏర్పాటు చేసుకోకూడదని అంటున్నారు బిగ్ బి అభిమానులు. దశాబ్దాల తరబడి పేరు ప్రఖ్యాతులు, బుల్లితెర ద్వారా, వెండితెర ద్వారా బోలెడంత ఆదాయం, కొడుకు సూపర్ స్టార్ అయితే కోడలు స్టార్ హీరోయిన్. ఇక భార్య రాజకీయ నాయకురాలు. ఇలా నలుగురూ ఎడతెగకుండా సంపాదిస్తుంటే ఎయిర్ బస్ కోసం ఆ మాత్రం ఖర్చు పెట్టలేరా? అని కొందరు ప్రశ్నిస్తున్నారు. సకల సదుపాయాలు కలిగిన ఆ ఎయిర్ బస్ ఫోటో ఇటీవల నెట్‌లో తెగ చక్కర్లు కొడుతోంది. అదే ఇది.



## తన సంపాదనంతా ఆమె కోసమేనట!

లేటు వయస్సులో కొందరికి జ్ఞానోదయం అవుతుంది. సరిగ్గా జగపతి బాబుకు కూడా ఈ వయస్సులో జ్ఞానోదయం కలిగినట్టుంది. ఆయన సినీ కెరీర్‌లో ఎన్నో ఎత్తు పల్లాలను చూశారు.

ఫ్యామిలీ హీరోగా ఒకప్పుడు ఓ వెలుగు వెలిగి ఇప్పుడు పరిస్థితులకు అనుగుణంగా విలన్‌గా, ఫాదర్‌గా ఫిక్స్ అయి బిజీ అయ్యారు. ఇన్నాళ్ళూ తను సంపాదించినదంతా తన తెలివితక్కువతనంతో పోగొట్టుకోవలసి వచ్చిందనీ, ఇప్పుడు సెకండ్ ఇన్నింగ్స్ మొదలెట్టింది కూడా తన భార్య కోసమే అనీ చెబుతున్నారు జగపతి బాబు. ఇప్పుడు సంపాదించే ప్రతిపైసా ఆమె చేతికే ఇస్తున్నాడట! ఈ డబ్బు ఎవరికీ ఖర్చు పెట్టననీ, ఎవరికీ దీని మీద హక్కు కూడా ఉండదని స్పష్టం చేస్తున్నాడు.

## మాంత్రికుడి లెక్క తప్పుతుందా?



మాటల మాంత్రికుడు త్రివిక్రమ్ తన సినిమాకు సంబంధించి ప్రతి విషయంలోనూ పక్కాగా ఉంటారన్న పేరు ఉంది. మాటల దగ్గర్నుంచీ సినిమా బడ్జెట్ వరకూ అన్నింటికీ ఓ లెక్క ఉంటుంది. కానీ 'అ ఆ' సినిమా విషయంలో మాత్రం ఆ లెక్క తప్పేటట్టు ఉంది అంటున్నారు సినీ జనాలు. ఈ సినిమాకు త్రివిక్రమ్ పారితోషికం బదులు లాభాల్లో వాటా తీసుకునే విధంగా ఒప్పందం కుదిరింది. అయితే సినిమా అనుకున్న బడ్జెట్ కన్నా రెట్టింపు అయిపోయింది. మామూలుగా స్టార్ హీరో అయితే ఈ విషయం గురించి పెద్దగా చెప్పుకోనక్కర్లేదు. కానీ నితిన్ హీరో కావడంతో లాభాల మాట దేవుడెరుగు ఖర్చు పెట్టినంత తిరిగి వస్తుందా? లేదా? అనే అనుమానం వ్యక్తం చేస్తున్నారు చాలా మంది. ఇదే కనుక జరిగితే ఈ సినిమాకు త్రివిక్రమ్ పారితోషికం తీసుకోకుండా చేసినట్లే అనీ, ఈ సినిమా విషయంలో ఆయన లెక్క తప్పినట్టేననీ అంటున్నారు.



'నవ్వడం ఒక యోగం అయితే నవ్వించడం మహా కష్టం!' మొదటి దానితోపాటు రెండవ దాన్ని కూడా సునాయాసంగా చేసేస్తూ వెండి తెర మీద నవ్వుల పువ్వులు పూయిస్తున్నాడు కమెడియన్ సప్తగిరి! కొందరు హావభావాలతో నవ్విస్తే, మరికొందరు నటనతో నవ్విస్తారు. కానీ సప్తగిరి మాత్రం తన యాసతోనే నవ్వు తెప్పిస్తాడు. అసిస్టెంట్ డైరెక్టరుగా పరిశ్రమలో అడుగుపెట్టి కమెడియన్‌గా మారి 'బొమ్మరిల్లు'తో మొదలుపెట్టి 'పరుగు' పెడుతున్న మగజాతి ఆణిముత్యం సప్తగిరితో...

# 'హాస్య'గిరి సప్తగిరి



**మీ అసలు పేరు 'సప్తగిరి' కాదు కదా?**

నా పేరు ప్రభు ప్రసాద్. సప్తగిరి అన్న పేరు నాకు నేనే పెట్టుకున్నాను.

**మీకు మీరే పెట్టుకున్నారా?**

నేను వెంకటేశ్వరస్వామి భక్తుణ్ణి. ఒకసారి తిరుపతి వెళ్ళినప్పుడు నిలబడి కొండను చూస్తూ ఉండిపోయాను. అటుగా వస్తున్న సాధువుల్లో ఒక పెద్దాయన బాబూ 'సప్తగిరి' కాస్త పక్కకి జరుగు అనడంతో టక్కున పక్కకి జరిగాను. ఈ పేరేదో బాగుందే అనుకున్నాను. ఇంట్లో అందరూ నన్ను గిరి అంటారు. దాంతో సప్తని ముందు తగిలించుకుని 'సప్తగిరి' అని పెట్టుకున్నాను.

**దర్శకత్వం నుంచి నటనవైపు ఎందుకు మళ్ళారు?**

'పరుగు' సినిమాకు భాస్కర్‌గారితో చేశాను. ఒక కొత్త కమెడియన్ క్యారెక్టర్ ఉంది. ఆ కమెడియన్ పాత్రను నన్నే చేయమన్నారు. నాకు అసలు నటన మీద దృష్టే లేదు. కానీ భాస్కర్‌గారు చెప్పారని ఒప్పుకున్నాను. కొత్త ఫేసు, దానికి తోడు నా యాస కొత్తగా ఉండటంతో ఆ పాత్రని చాలా బాగా ఆదరించారు. చిత్తూరు యాస సహజంగానే కొద్దిగా నవ్వు తెప్పిస్తుంది. దానికి కొద్దిగా కామెడీ జోడించాను అంతే! అంతకు మించి నేను పెద్దగా చేసిందీ, చేస్తున్నదీ ఏమీ లేదు.

**మిగతా వారికీ మీకూ అదే తేడానా?**

కచ్చితంగా ఇదే తేడా. పరిశ్రమలో చాలా మంది కమెడియన్లు ఉన్నారు. వారిలో యాసతో మాట్లాడేవాళ్ళు చాలా తక్కువ! నేను బయట ఎలా మాట్లాడతానో, తెర మీద కూడా అదే యాసతో మాట్లాడడంతో ప్రేక్షకులు కొత్తగా ఫీలయ్యారు.

**కమెడియన్ల మధ్య పోటీ ఎక్కువగా ఉంటుందా?**

పోటీ అనేది ఎక్కడైనా ఉంటుంది. కానీ మా మధ్య ఉన్నది ఫ్రెండ్లీ పోటీనే! అందరం చక్కగా కలుసుకుంటాం. మాట్లాడుకుంటాం. ఒకరిని చూసి మరొకరు అసూయ పడడం అంటూ ఉండదు. అందరికీ మంచి అవకాశాలే ఉన్నాయి.

**ఎక్కువగా ఇష్టపడే కమెడియన్?**

బ్రహ్మానందం గారే! ఆయన స్కూప్‌లు ఒకటి రెండు నేను నా సినిమాల్లో వాడేశాను కూడా! వాటిని చూసి ఆయన నాకు ఫోన్ చేసి 'బాగా చేశావు' అంటూ అభినందించారు. ఇప్పటికీ తరచు ఆయనకు నేను ఫోన్ చేయడమో, లేక ఆయనే నాకు ఫోన్ చేయడమో జరుగుతూ ఉంటుంది. ఒక విధంగా ఆయనే నాకు ఆదర్శం.

**మీకు బాగా పేరు తీసుకొచ్చిన సినిమా?**

'ప్రేమ కథా చిత్రం'. నన్ను స్టార్ కమెడియన్‌గా చేసిన సినిమా. ఆ సినిమాలో నా నటన అందరిని బాగా ఆకట్టుకుంది. ఆ తరువాత నేను చేసిన సినిమాలన్నీ నాకు ఇష్టమైనవే!

**మీకు మీరుగా బాగా ఎంజాయ్ చేస్తూ చేసిన సినిమా?**

'వెంకటాద్రి ఎక్స్‌ప్రెస్'. 'ప్రేమ కథా చిత్రం'లో నేను నవ్వించానని అందరూ అన్నారు. కానీ నేను అంత బాగా ఎంజాయ్ చేయలేకపోయాను. 'వెంకటాద్రి ఎక్స్‌ప్రెస్' షూటింగ్ సమయంలోనే బాగా ఎంజాయ్ చేశాను.

**బాగా ఇష్టపడే హీరో?**

అందరూ ఇష్టమైన వారే! ఎవరికి వారే చాలా బాగా చేస్తారు. కానీ అల్లు అర్జున్‌గారంటే మాత్రం మిగతా వారి కంటే కొద్దిగా ఎక్కువ ఇష్టపడతాను. 'పరుగు' సమయంలో ఆయన్ని చాలా దగ్గర్నుంచి చూశాను. సినిమా కోసం ఎంతగా కష్టపడతారో చెప్పలేను. మిగతా హీరోల విషయంలో నేను అంత దగ్గర్నుంచి పరిశీలించే అవకాశం రాలేదు. ఒక్క అల్లు అర్జున్‌గారి విషయంలోనే ఆ అవకాశం వచ్చింది కాబట్టి ఆయన కష్టం ఏమిటో తెలిసింది.

**మరి డైరెక్టర్లలో ఎవర్ని లైక్ చేస్తారు?**

పరిశ్రమలో నేను కృతజ్ఞతలు చెప్పుకోవలసిన దర్శకులు ఇద్దరున్నారు. ఒకరు 'బొమ్మరిల్లు' భాస్కర్ గారు. మరొకరు మారుతి గారు. వీరిద్దరూ నన్ను బాగా ప్రోత్సహించిన వారే! నీకు ఎలా తోస్తే అలా చేయి! బయట ఎలా ఉంటావో తెర మీద కూడా అలాగే కనిపించు! అని నన్ను ప్రోత్సహించారు. నిజం చెప్పాలంటే మొదటి సినిమా నుంచి ఇప్పటి దాకా నేను హోంవర్క్ చేసిందంటూ ఏం లేదు. షూటింగ్‌కి రావడం, అప్పటికప్పుడు డైరెక్టర్‌గారు ఎలా చెబితే అలా చేసుకుంటూ పోవడం అంతే! చాలా మందికి తెలియని సంగతి ఒకటుంది. నాకు అస్సలు నటన రాదు.



**దర్శకత్వం మీద మనసు పోలేదా?**

ఏడెనిమిది సంవత్సరాల క్రితం ఉండేది. కానీ ఇప్పుడు ఆ ఆలోచన అస్సలు రాదు. ఎందుకంటే కమెడియన్‌గా బాగా క్లిక్ అవుతున్నాను. దీన్ని విడిచి దర్శకత్వం వైపు వెళ్లడం ఎందుకు అనిపిస్తుంది? దర్శకత్వం అంటే చాలా బాధ్యతతో కూడుకున్నది. ఇప్పుడు నటించడమే సులభమని అనిపిస్తోంది.

**దర్శకుడవ్వాలని ఎందుకు అనుకున్నారు?**

చదువుకునే రోజుల్లో 'సింధూరం' సినిమా చూసిన తరువాత ఎప్పటికైనా దర్శకుడినై ఇలాంటి సినిమా చేయాలని గట్టిగా డిసైడ్ అయ్యాను.

**చదువుకునే రోజుల్నించే సినిమాలంటే ఇష్టం ఏర్పడిందా?**

చదువు కన్నా సినిమాలంటే ఇష్టంగా ఉండేది. చదువు బాగా రాలేదు. దానికి రెండు కారణాలు. ఒకటి సినిమా, రెండోది క్రికెట్. క్రికెట్ ప్లేయర్ని అవ్వాలని ఉండేది. మధ్యలోనే దాన్ని వదిలేసి సినిమాల్లోకి వచ్చేశాను.

**చదువుకోకుండా సినిమాల్లోకి వస్తే పేరెంట్స్ ఏమనలేదా?**

ప్రారంభంలో కొద్దిగా బాధపడ్డారు. ఇప్పుడు వాళ్ళు ఫుల్ హ్యాపీ. మా ఫాదర్ అయితే నా సినిమా విడుదలైన రోజు థియేటర్‌కి వెళ్ళి ఓ యాభై టిక్కెట్లు కొనేసి టిక్కెట్లు దొరకని వారికి ఫ్రీగా ఇచ్చి సినిమా చూడండి అని పంపించేస్తుంటారు. అలా చాలా సార్లు చేశారు.

**అభిమానుల నుంచి రెస్పాన్స్ ఎలా ఉంటుంది?**

నా అభిమానులు పిల్లలే! పిల్లలే ఎక్కువగా నన్ను గుర్తుపట్టి సప్తగిరి, సప్తగిరి అని అరుస్తూంటారు. వారి వెంట ఉన్న పెద్దలు నన్ను ముందు గుర్తుపట్టకపోయినా, పిల్లల అరుపులు విని నా దగ్గరకి వస్తూంటారు. అందరికీ పెద్ద అభిమానులుంటే నాకు పిల్ల అభిమానులు ఎక్కువ!

**రెమ్యునరేషన్ పెంచేశారన్న మాట నిజమేనా?**

ఈ మాట నా దాకా కూడా వచ్చింది. మొదట్నించీ ఎవరినీ డిమాండ్ చేయడం నాకు అలవాటు లేదు. నా కష్టానికి తగిన ప్రతిఫలమే తీసుకుంటాను. కాల్‌షీట్లను బట్టి నాకు రెమ్యునరేషన్ ఇస్తుంటారు. ఎక్కువ రోజులు పనిచేస్తే ఎక్కువ మొత్తం, తక్కువ రోజులు చేస్తే తక్కువ మొత్తం ఇస్తారు.

నవ్య



## 25 లక్షలు పైమాటే!

'కుమారి 21 ఎఫ్' సినిమాలో నటించిన హెబ్బా పటేల్ గుర్తుంది కదా! ఆ సినిమా మంచి విజయం సాధించినా హెబ్బాకు మరో చాన్స్ రాలేదు. కాకపోతే ఈ సినిమాలో చేస్తోంది, ఆ సినిమాలో చేస్తోంది అన్న రూమర్లు మాత్రం బాగా వ్యాపించాయి. తాజాగా వరుణ్‌తేజ్ సినిమాలో హెబ్బా చేయబోతోంది. ఇది రూమర్ కాదంటున్నారు సినీ జనాలు. ఈ సినిమాకుగాను హెబ్బాకు 25 లక్షలకు పైగానే ముట్టాయంటున్నారు టాలీవుడ్ జనాలు. మలి సినిమాకే ఇంత మొత్తం తీసుకోవడం పట్ల పలువురు ఆశ్చర్యం వ్యక్తం చేస్తున్నా, హెబ్బాకు జరిగిన పబ్లిసిటీ ఆమె రేంజ్‌ని ఒక్కసారిగా పెంచిందని అంటున్నారు. రెండవ సినిమాకే 25 లక్షలు పుచ్చుకుంటున్న ఈ అమ్మడు భవిష్యత్తులో రెమ్యునరేషన్ విషయంలో స్టార్ హీరోయిన్లను మించిపోతుందంటున్నారు.

ఇంటర్వ్యూ

రోజుల్లో రేడియో ద్వారా ఇంటింటా నిత్యం మారు మోగిపోయేది. ఆ పాట విననివారే లేరు. ఈ చిత్రంలో బాలనటిగా నాకు ఎన్నో అవార్డులు వచ్చాయి. హరనాథ్, జమున నటించిన ఈ చిత్రం అన్ని థియేటర్లలోనూ శతదినోత్సవం జరుపుకుంది. 'కుజుందయమ్ దైవము' అనే టైటిల్‌తో మొదట తమిళంలో, 'లేతమనసులు' పేరిట తెలుగులో తీశారు. ఈ రెండు భాషల్లోనూ నేనే చేశాను. 1965లో తమిళంలో, 1966లో తెలుగులో ఈ చిత్రాలు విడుదలయ్యాయి. ఇది సూపర్‌హిట్ చిత్రం.

### ఫిలింఫేర్ అవార్డు

నువ్వు గొప్ప నటివి అవుతావని అప్పుడే పరిశ్రమలో అంతా నన్ను అశీర్వదించేవారు. ప్రేక్షకులు కూడా అలాగే ఆదరిస్తున్నారు. మూడేళ్ళ వయసులో నేను నటించిన తమిళచిత్రం 'పసమలార్' ఎంతో విజయవంతమైన చిత్రం. 1963లో నిర్మించిన హిందీ చిత్రం 'దిల్ ఏక్ మందిర్'. సి.వి.శ్రీధర్ దర్శకత్వంలో రాజ్‌కుమార్, రాజేంద్రకుమార్, మీనాకుమారి నటించిన ఈ చిత్రాన్ని 'నెనిజిలోరు ఆలయం' పేరిట తమిళంలో నిర్మించారు. 'మనసే మందిరం' పేరుతో అక్కినేని, సావిత్రిగారితో తెలుగులో తీశారు. ఈ తమిళ చిత్రానికి నాకు ఫిలింఫేర్ అవార్డు వచ్చింది.

### బాలనటిగా 140 చిత్రాలు

బాలనటిగా నేను తెలుగు, తమిళ, మలయాళ భాషల్లో 140 చిత్రాల్లో నటించాను. ఇందులో ప్రజాదరణ పొందినవే ఎక్కువ. స్కూల్ మాస్టర్, సత్యభామ, కుప్పివల, దేవత, ఐ లవ్ ఇన్ కేరళ (మలయాళం), నినజమ్ మరప్పతిల్లమ్, కుజుందయమ్ దైవము (తమిళం), లేతమనసులు. తమిళంలో నెనిజిలోరు ఆలయం చిత్రానికి నాకు అవార్డు వచ్చింది. 1962 - 1969 మధ్య కాలంలో అనేక చిత్రాల్లో నటించాను.

ఎన్టీఆర్, కె.ఆర్.విజయ, కాంతారావుగారు నటించిన ఏకవీర, ఏకలవ్య, బి.సరోజ, రామారావుగారు నటించిన శకుంతల, విచిత్ర దాంపత్యం, కథానాయకుడు, ఆస్తిపరులుతోపాటు మరో 15 చిత్రాల్లో నటించాను. ముఖ్యంగా కథానాయకుడు చిత్రంలో ప్రస్తుత తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత, రామారావుగారు నటించారు.

# ఈనాటి నటుల్లో ఉన్నది వ్యాపార ధోరణే!

**బాలతారగా సినీరంగ ప్రవేశం చేసి అనేక భాషల్లో నటించారు కుట్టిపద్మిని. కేవలం బాలనటిగా 140 చిత్రాల్లో నటించిన బోర్న్ ఆర్టిస్టు, టెలీఫిల్మ్ ప్రొడ్యూసర్. తనకు వస్తుందనుకున్న బాలనటి అవార్డు మరొకరికి ఇస్తుండగా, రాష్ట్రపతి భవన్‌లో నాటి ప్రధానమంత్రి ఇందిరాగాంధీ దగ్గరకు వెళ్ళి ఆమె కొంగు పట్టుకుని మీరు నా సినిమాలు చూశారా? అని నిలదీసి అడిగిన ధీశాలి. దాదాపు ఐదు దశాబ్దాలుగా 200 చిత్రాల్లో నటించి ప్రేక్షకులను మెప్పించిన కుట్టి పద్మిని ఇంటర్వ్యూ....**

-కుట్టి పద్మిని

మా నాన్నగారు శ్రీనివాస చక్రవర్తి. అమ్మ రాధ. చెన్నైలో జన్మించాను. అన్నిటికంటే ముఖ్యమైన విషయం నేను పసికందుగా ఉన్నప్పుడే వెండితెరపై కనిపించటం!

### పసికందుగా తెరపై

జెమినీగణేశన్ చిత్రాలంటే మా అమ్మగారికి ఎంతో ఇష్టం. ఆయన మా అమ్మకు పరిచయమే. ఆయన ఆహ్వానం మేరకు బహుశా ఏవీఎం స్టూడియోకి అనుకుంటాను, షూటింగ్ చూసేందుకు నన్ను ఎత్తుకుని వెళ్ళింది మా అమ్మ. ఆ రోజు సీన్‌కు అవసరమైన మూడునెలల పసిబిడ్డను అనుకున్న సమయానికి సప్లయర్స్ తీసుకురాలేకపోయారు. అదే సమయంలో నన్ను తీసుకుని అమ్మ అక్కడకు వెళ్ళడంతో వెంటనే సెట్లో బాధ్యులు అమ్మను రిక్వెస్ట్ చేసి నన్ను షూటింగ్‌లో పసిబిడ్డ పాత్రకు తీసుకున్నారు. 'అబలయ్ అంజుగమ్' చిత్రంలో జెమినీగణేశన్, షావుకారు జానకిగార్లు ఒక పాటలో నన్ను ఉయ్యాల తొట్టెలో ఉంచి జోకొడతారు. అలా క్లోజప్ షాట్స్‌తో మూడునెలల పసిప్రాయంలోనే నా సినీ కెరీర్ ప్రారంభమైంది.

### లేత మనసులు

'లేత మనసులు' చిత్రం నా కెరీర్‌లో మరువలేనిది. 'పిల్లలూ దేముడూ చల్లనివారే. కల్లకపట మెరుగనీ కరుణామయుడే....' అనే పాట ఆ



### అగ్రనటులతో

శివాజీగణేశన్, ఎం.జి.ఆర్, జయశంకర్, ఎన్టీఆర్, ఏఎన్నార్ వంటి అగ్రనటుల చిత్రాల్లో 1975 నుండి విరామం లేకుండా నటించాను. అవి నిజంగా మరిచిపోలేని రోజులు. శివాజీగణేశన్‌గారితో ఎన్నో చిత్రాల్లో నటించాను. నా నటన చూసి ఆయనే ఆశ్చర్యపోయారు. తిరువరుచల్వర్, తిరుమాల్ పెరుమై తమిళనాట అద్భుత విజయం సాధించిన చిత్రాలు. 'ఈ చిత్రాలు నా వల్ల విజయవంతంగా ఆడలేదు. చిన్న చేప పెద్ద చేపను మింగింది' అంటూ శివాజీగణేశన్ నన్ను ప్రశంసిస్తూ ఉండేవారు. ఎం.జి.ఆర్ గారితో నాన్ ఏంతిరందేన్, ఆనందజ్యోతి, అందేవా, నమ్‌నాజ్ వంటి హిట్ చిత్రాల్లో నటించాను.

### పాము కరిచే సీన్

చిత్ర పరిశ్రమలో నాకు ఒక ప్రత్యేకమైన గుర్తింపు ఉండేది. పాము కరిచే సీన్ షూటింగ్ తియ్యాలంటే ఆ పాత్రకు నన్నే ఎన్నుకునేవారు. తమిళం, మలయాళం, తెలుగు ఏ భాషా చిత్రమైనా దర్శకులు నాతోనే షూటింగ్ చేసేవారు. ఆ సమయంలో నా నటన బాగుంటుందనీ అలా చేసేవారు.

### ముద్దుపెట్టి ఆశీర్వదించిన ఇందిరాగాంధీ

ఢిల్లీ నేషనల్ ఫిలిం అవార్డ్స్ బహూకరణ కోసం నేను నటించిన కుజుంధయుమ్ ధైవమ్ (తమిళం), ఆస్తిపరులు (తెలుగు), సత్యహరిశ్చంద్ర (కన్నడ) చిత్రాలు పరిశీలనకు వెళ్ళాయి. ఏం జరిగిందో గానీ ఎంపిక కాలేదు. అవార్డుల ప్రధానోత్సవం నాడు నాకు నిరాశే ఎదురైంది. రాష్ట్రపతి భవన్‌లో అప్పుడు ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ అవార్డులు ప్రదానం చేసి ప్రసంగించి తిరిగి వెళుతుండగా నేను మొండి ధైర్యంతో వెళ్ళి ఆమె చీర కొంగు పట్టుకున్నాను. భద్రతా సిబ్బంది నన్ను అడ్డుకోబోయారు. ఆమె ఆశ్చర్యపోయి వారిని వారించారు. వాట్ డూ యూ వాంట్ అని అడిగారు. అప్పుడు నేను వెంటనే అన్నాను. నాకు అవార్డు ఇవ్వకపోయినా పర్వాలేదు. కానీ కనీసం మీరు నా సినిమాలు చూశారా? ఆ అవార్డు కమిటీ చూసిందా? అని నిలదీశాను. ఆమె కంగుతింది. వెంటనే తన సెక్రటరీని పిలిచి ప్లీజ్ గెట్ మీ ద మూవీ ప్రింట్స్ వితిన్ వన్ అవర్ అన్నారు. అక్కడున్న వారంతా ఆశ్చర్యపోయారు. ఆ సాయంత్రమే ఆమె నా సినిమాలు చూసి నన్ను ప్రత్యేకంగా పిలిపించారు. నా బుగ్గమీద ముద్దు పెట్టుకుని నన్ను ప్రశంసించారు. ఆ మూడు చిత్రాలకుగాను నన్ను బెస్ట్ చైల్డ్ ఆర్టిస్టుగా నిర్ణయించారు. నువ్వు గొప్ప నటివి అవుతావంటూ ఆమె నన్ను ఆశీర్వదించారు. ఇది నా జీవితంలో ఎప్పటికీ మరువలేని సంఘటన.



నవ్యవీక్లీ చదువుతూ...

### 1971లోనే టీవీ చూశా

పదహారేళ్ళ వయసులో ఉండగా, 1971లో ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం, శివాజీగణేశన్‌గార్లతో కలిసి సింగపూర్‌లో స్టార్ నైట్‌కి వెళ్ళాను. అక్కడే మొట్టమొదటిసారి టెలివిజన్‌ను చూశాను. అప్పుడే నేను డిసైడ్ అయిపోయాను. ఎలాగైనా సరే నేను టీవీ ప్రొడ్యూసర్, డైరెక్టర్ కావాలని. ప్రాక్టికల్‌గా, టెక్నికల్‌గా అన్ని విషయాలూ తెలుసుకోవాలని నిర్ణయించుకున్నాను.

### సింగపూర్ అధ్యక్షుని సహకారం

టీవీ ప్రొడ్యూసర్‌ని కావాలంటే సర్టిఫికెట్ ఉండాలి. శిక్షణ పొందాలి. కానీ ఎలా? ఆ రోజు జరిగిన స్టార్ నైట్‌కి సింగపూర్ దేశాధ్యక్షుడు లింక్వాంగ్‌యా వచ్చారు. వేదికమీద నా దగ్గరకు వచ్చి నవ్వుతూ నాతో మాట్లాడారు. ఇదే అవకాశం అనుకుని నా మనసులో కోరిక చెప్పాను. సార్, నాకు ఎక్కువ చదువు లేదు. కానీ ప్రొడ్యూసర్, డైరెక్టర్ అవ్వాలని ఉంది. మీ బ్రాడ్ కాస్టింగ్ అండ్ టెలికాస్టింగ్ సర్వీస్ ద్వారా సర్టిఫికెట్ ఇవ్వగలరా? అని ప్రశ్నించాను. వెంటనే ఆయన అంగీకరించారు. అనుకున్నట్టుగానే ఆరు నెలల తర్వాత ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్‌గా సర్టిఫికెట్ తీసుకున్నాను. అందుకోసం ఆరు నెలలు సింగపూర్‌లోనే ఉన్నాను. ఆ విధంగా సింగపూర్ దేశాధ్యక్షుడి సహకారం లభించడం నిజంగా నా జీవితంలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన అంశం.

### హిందీ టెలీఫిల్మ్

1986లో నా మొట్టమొదటి టెలీఫిలిం ప్రసారమైంది. హిందీలో నేను తీసిన తరాజు చిత్రానికి అనురాధ రమణన్ కథ, జాతీయ అవార్డు గ్రహీత హరిహరన్ దర్శకత్వం చేశారు. ఢిల్లీ గణేష్, నేను హీరోహీరోయిన్లుగా నటించాం. ఇది ఆ ఇయర్ బెస్ట్ టెలీఫిలింగా ఎంపికై అవార్డు అందుకున్నాను.

### టెలీ సీరియల్స్

కస్టమ్స్ అండ్ ఎక్సైజ్ డిపార్ట్‌మెంట్‌ను ప్రధానాంశంగా తీసుకుని నేను తీసిన టెలీసీరియల్ సంఘర్ష్. ఇందులో అమల, నాజర్ నటించారు. హాంకాంగ్, సింగపూర్ దేశాల్లో ఈ టెలీ సీరియల్ షూటింగ్ తీశాం. ప్రేక్షకులు ఎంతగానో ఆదరించారు. దీనికి బెస్ట్ సీరియల్ అవార్డు లభించింది. తెలుగులో కిట్టిగాడు సీరియల్ దూరదర్శన్‌లో 26 ఎపిసోడ్స్ ప్రసారమైంది. దీనికి కూడా మంచి ఆదరణ లభించింది. ప్రస్తుతం కృష్ణదాసి అనే మరో సీరియల్ రూపొందిస్తున్నాను. దీనికి ఇంద్రా సౌందర్‌రాజన్ కథ సమకూర్చారు. ఈ సీరియల్ షూటింగ్ మొత్తం ముంబైలోనే. హీరోతో సహ అందరూ కొత్త నటులే. త్వరలో ఒక చానల్‌లో ప్రసారమవుతుంది.

దక్షిణ భారత చలనచిత్ర వాణిజ్య మండలి వారి ఫిలిం ఇనిస్టిట్యూట్‌లో ప్రస్తుతం ట్యూటర్‌గా చేస్తున్నాను. తమిళనాడు చిత్ర పరిశ్రమ నడిగర సంగం ఫిలిం అసోసియేషన్ కార్యనిర్వాహక సభ్యురాలుగా ఉన్నాను. నేను ఎక్కువ విజ్ఞాన యాత్రలు చేస్తాను. సింగపూర్, బ్యాంకాక్, హాంకాంగ్ ఎక్కువగా వెళ్తుంటాను. అక్కడ సీరియల్స్ షూటింగ్ చేస్తాం. ఈ మధ్య ఆంధ్రప్రదేశ్‌లో గోదావరి పుష్కరాలకు నటుడు శరత్ బాబుగారితో కలిసి వెళ్ళాను.

### సావిత్రే మహానటి

దేవదాసు, లవకుశ నాకు నచ్చిన చిత్రాలు. పాత చిత్రాలన్నీ అద్భుత చిత్రాలే. ప్రస్తుతం నా అభిమాన హీరోలు మహేష్‌బాబు, ప్రభాస్. అప్పటికీ ఇప్పటికీ మహానటి సావిత్రే. ఎస్వీరంగారావు, నాజర్ నచ్చిన క్యారెక్టర్ ఆర్టిస్టులు. నచ్చిన హాస్య నటుడు బ్రహ్మానందం. నాకు నచ్చిన ఆహారం పెరుగు అన్నం, ఆవకాయ పచ్చడి.

### హాయ్ అంటే హాయ్ కల్చరే!

నాటి రోజుల్లో పరిశ్రమలో షావుకారు జానకి, బి.సరోజ, సావిత్రి, కృష్ణకుమారి, జయంతి, సూర్యకాంతం మేమంతా ఎంతో అన్యోన్యంగా అక్కచెల్లెళ్ళుగా మసిలేవాళ్ళం. భేషజాలు లేకుండా ఒకరి బాధలు మరొకరితో మనసు విప్పి చెప్పుకుంటూ ఒక కుటుంబంగా అందరం షేర్ చేసుకునేవాళ్ళం. రాను రాను ఇప్పుడు ఆ ఆప్యాయతలు తగ్గిపోయాయి. ఈనాటి నటులు కేవలం వ్యాపార ధోరణితో ఒకరితో మరొకరు సంబంధం లేకుండా ప్రవర్తిస్తున్నారు. అంతటా హాయ్ అంటే హాయ్ కల్చర్ పాకిపోయింది.

-కె.హరనాథ్
సెల్: 97035 42598

